ఓమ్

# శ్రీమదాంధ్ర
# కిరాతార్జునీయము

## భారవి - తృతీయభాగము.



గ్రంథకర్త

శ్రీ గణేశ్వరీయాద్యనేక గ్రంథకర్త

భువనగిరి విజయరామయ్య, బి. ఏ.,

లోకల్ ఆడిట్ ఆఫీసు,

గుంటూరు

1934



[వెల రు 1-8-0

# పండితాభిప్రాయములు.

## భారవి I – III భాగములమీఁద.

1. కింకవీంద్రఘటాపంచానన నేత్యాదిబిరుదాంకితులగు బ్ర. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, కడియము, 21-3-'33.

" ... ఆంధ్రీకరించినపద్యములలో ... ధార, కల్పన, గుదిగూర్పు స్ఫుటోక్తి-లియభినంద్యములు ... "

2. కవిరాజాదిబిరుదాంకితులగు బ్ర. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమండ్రి, 24-3-1933.

" ... మీ తెలుఁగుపరివర్తనము చక్కఁగానున్నది. "

3. చతుర్విధకవితానిర్వాహకులు బ్ర. నాదెళ్ళ పురుషోత్తమకవిగారు, బందరు, 31-5-33.

ఎదొ కథయుం జొకండుఁగొని యింతలె యెంతలొ సేసి చెప్పఁగా
మొదలిడ మంత్రిపుష్పమును భోజన మింక వధానపద్ధతు
ల్విదితములై చెలంగఁ గవివేత్తృత తెల్లముగా లసద్గుణా
స్పదపదగుంభనంబు మృదుశయ్య రసాఢ్యత ముద్దులొల్కెడిన్.

4. బ్ర. నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రికవిగారు, బందరు, 1-6-1933.

భువనగిరిప్రసిద్ధకులపూర్ణసుధాకర ! నీవచించు భా
రవిఁ గవితాప్రవాహము సురాపగతోఁ దులతూఁగసాగ మా
ర్దవమున నింపునింపెడి సుధారుచిరోక్తివిధాన, మైన " భా
రవి " యనకున్న నౌచితి కర మ్మధిక మ్మపునుమ్మి తమ్మయిన్.
వినిపించితివి " కిరాతా
ర్జునీయము " తెలుఁగునఁ బలుకుచున్ రుచు లొలికిం
చినవాఁడ " వర్థగౌరవ
ము " నిలువఁ గవి ! విజయీరామ ! 1 ముద మొదఁ గదురన్.

5. బ్ర. యేలూరుపాటి రామచంద్రచయనులుగారు,
తాళ్ళపూడి 24-3-1933.

"తమచే రచింపఁబడిన 'భారవి' పద్యకావ్యమును ... పూర్తిగఁజదివితిని. కవిత మంచిధార కలిగి యున్నది. ... కవిచరిత కావునఁ గవులగు తమప్రతిభను వెల్లడించునవకాశము లభించిన దనుకొనెదను. అల్లసానిపెద్దనవలె వృత్తముల నేకప్రాసతో వ్రాయుటలో మంచి శక్తిని జూపఁగలిగితిరి. 'పసినిసుగు' 'పాడి' 'అసదృశ' 'హసదు' మొదలైనవి మూఁడుచోట్ల వ్రాసితిరి. మెప్పందినది ..."

6. బ్ర. జయంతి రామయ్యపంతులుగారు, ముక్తీశ్వరము,
20-6-1933.

"అయ్యా! మీరు రచించిన "భారవి - ప్రథమభాగము చదివినాను. మీ కవిత్వము సరసముగను ప్రౌఢముగను నున్నదని నా యభిప్రాయము."

7. బ్ర. శిష్టా నరసింహశాస్త్రిగారు, బందరు 15-5-1933.

ఉ. రాజితశయ్య శ్రీవిజయరామకవీశ్వర! నీదు భారవిన్
బూజితమైనవర్ణనలసోడిమిఁ జూచితి సంతసించితిన్
ధీజితసత్కవీశ్వరవిధిజ్ఞుఁడ వౌదువు సొంపుమీఱఁగా
భోజనవర్ణనాదికముఁ బూర్వకవీశ్వరులట్ల వ్రాయుటన్.

ఉ. కూరలు పిండివంటలును గూడిన సూదవినోదవైఖరు
ల్ధీరతఁ జాటల జ్జదువు ధీమణులున్ వటువు ల్సువాసినీ
చారుగతు ల్విలాసగుణచారుచమత్కృతవాక్యపద్ధతు
ల్మీరఁగ మీఱుకావ్యమయి మెప్పును గాంచెను సత్కవీశ్వరా!

చ. తగినసమస్తవర్ణనల ధారుణి మీఱినభారవి న్సుధా
విగళితబిందుబృందముల వేడ్కనొసంగెడి పద్యభంగి నీ
జగమున నాంధ్రసత్కవుల సత్కృతిఁబొంది తెలుంగొనర్చి నీ
తగుమతికౌశలంబు విశదంబుగఁ జేసితివయ్య! సత్కవీ!.

చ. భువనగిరిం జనించినప్రభూతగుణాఢ్యుఁడ వీవు కావునన్
భువన మలంకరింపఁదగు భూషణమా వరరత్న వైఖరిన్
గవనవిశేషసంపద వికస్వరమై విలసిల్లుఁగావునన్
నవతరకావ్యరత్న మిది నల్దెసల న్వెలిఁగింపకుండునే.

ఉ. భారవిసచ్చరిత్రమును, భారవికావ్యము, నాంధ్రియందు మే
లూర్ఛరిచమత్కృతు ల్దనరఁ బుణ్యవశంబునఁ జెప్పి తింక నా
భారతియే ప్రబంధపరిపాకముఁగ్రోలఁగ విశ్వమందునన్
ధీరతఁ జేరెనో యనఁగ తీరదు శైలిహారంగుఁ జూచినన్.

8. బ్ర. వేమూరు శ్రీరామశాస్త్రిగారు,
ఘంటాశతగ్రంథకరణధురీణ, శతావధాన, విద్వత్తిలక,
పండితభూషణాదిబిరుదాలంకృతులు, గురుకులాశ్రమము
విజయవాడ. **15–12–1933.**

ఉ. భారవికావ్య మాంధ్రమునఁ బద్యముల న్ప్రకటించి గాథ నా
భారవి నాంధ్రభారవిగఁ బండితకోటికిఁ దోఁపఁజేయు ధీ
భారవి "నాంధ్రభారవి"గఁ బల్కుట చోద్యముకాదటంచు భా
రారుచి నేను ని న్విజయరామయ సాటిన నెవ్వ రొప్పరే.

క. చదివెద వినుఁ డన "సహసా
విదధీత"ను బద్యరచన వినవలెనని నేఁ
బదములు శయ్యయు విన బ
ల్హృదయంగమ మయ్యెఁ గవిత హే! విజయకవీ!

చ. రచనలు నిన్న నేఁడుఁ గడు రచ్చల నచ్చునటంచు నెందఱో
వచనపుఁగావ్యము ల్కరము వన్నెలుఁ జిన్నెలు మార్చి చేసెద
ర్వచనము లెట్లు సాధ్యములు వాంఛితభాగపు వర్ణనంబులన్
రచనగ నుండుపద్యములు రంగతలంబుల రక్తికట్టఁగన్.

సీ. నోటిగౌరవ మెంతయో పూసె నీకు
చేతిగౌరవ మెవ్వరున్ జేయకుండి

రనుచు విజయేశునకుఁ గృతి నప్పగింపు
మంటి విజయాఖ్యకవి ! దాని కట్లు వినవె.
గీ. పరి కౌరససంతతు లెన్నియున్న
ధర్మసంతానతుల్యము ల్దరను గావు
కృతికి స్థిరతను గావింపఁ గృతియె దీటు
కర్తభర్తలభాగ్యలఘటన లయుదు.
క. కృతియైనఁ గృతి కనర్హుఁడె
కృతినొంద నదాతయైనఁ గృతి ధనియైనన్
గృతిఁ జేయుట కృతి నొందుట
కృతకృత్యతఁ గూర్చు నిజసుకృతఫలమె యగున్.
క. నరులకుఁ గృతి నిడి కొందఱు
నెఱనామకు లగుట నద్ది నిందిత మైనన్
హరికో హరునకొ కృతు లిడఁ
దరియింపరె యిహముఁ బరముఁ దరతమవిదులై.
చ. విజయకథంబు నీయభిధ, పీఠకయుండిన దాని కర్థము
ల్విజయప్రతిష్ఠితేశ్వరుఁడు వేలుగఁ దా నిడకున్న నేటికిన్
విజయకవీశ ! సంస్కృతిని వేత్తృతచే జయకాము లందఱున్
భజనలుచేసి మావిజయవాడకుఁ జేరి తరించుచుండుటల్.

9. బ్రి. కూచి నరసింహముగారు, M. A. పిఠాపురము,
2-5-1934.

" ... మీ రంపిన " ఆంధ్రకిరాతార్జునీయము " నామూలా గ్రముగాఁ జదువఁజాలకపోయినను, అక్కడక్కడఁ జదివి చూచితిని. శైలియుఁ గవితాధారయు బాగుగా నున్నవి.

10. బ్రి. కావ్యస్మృతితీర్థ, జనమంచి శేషాద్రిశర్మగారు,
బ్రహ్మాండపురాణాది బహుగ్రంథకర్తలు, కడప, 25-4-1934.

" ... భారవి - తృతీయభాగ మందినది. అందందుఁ బెక్కు తావులం బఠించితిని. మూలమునఁగల భావములు చక్కగా నిం దిమిడి

యున్నవి. కవిత్వము యతిప్రాసార్థము గ్రంథముల వెదకఁబూనక గంగాప్రవాహమురీతి సాగియున్నది. భాషయు సులలితరీతి నాశ్రయించినది. "భారవే రర్థగౌరవ" మ్మను సూక్తికి నెలవగు నీపాత్రము నాంధ్రీకరించి "సమానానా ముత్తమశ్లోకో అస్తు" అనుసూక్తికిఁ బాత్రులరైతిరి. పరమశివార్పితము చేయఁబడిన మీ యీ సుకృతి నిరంతరము దశదిశల వెలయుఁగాతమని కోరుచున్నాఁడను.

11. బ్ర. శిష్టా హనుమచ్ఛాస్త్రికవిగారు – సీనియర్ తెలుఁగుపండితులు-టవున్ హైస్కూలు-గుంటూరు, 14-5-1934.

ఉ. భారవికావ్య మర్థభరబంధుర మయ్యది తెల్గుసేయఁగా
నేరుపు పెద్ద గావలయునే యని జంకక సుంతయేని, స
ద్ధారయు నర్థపుష్టియుఁ బదప్రచయంబు సమాసరేఖ సొం
పూరఁగఁ గూర్చియుంటిరిగ దో! జయరామయ ! నేఁటి కీకృతిన్.

12. బ్ర. విద్వాన్ గరిమెళ్ళ సోమన్నపంతులుగారు, M. A., L. T., చోడవరం-విశాఖపట్టణముజిల్లా, 15-5-34

మీ యాంధ్రకిరాతార్జునీయము నాదరముతో భక్తితో నందుకొంటిని. చదివితిని. సంతోషించితిని. మహాకావ్యమునకుఁ దెలుఁగు వ్రాసి యాంధ్రుల కుపకారము సేసితిరి. ఇట్టిమేల్సేత వైదుష్యవివేకదీక్షాసామర్థ్యము మావంటివారికి సాధ్యపడదు ... "

13. బ్ర. భువనగిరి కోదండపాణిగారు, అనేకగ్రంథకర్తలు, నా సహోదరులు, సబురిజస్ట్రారు, బందరు – 30-5-34.

ఉ. శ్రీజవరాలి వెన్నెలల చిన్నెల వన్నెల కంతరార్థము
ల్మైజరుచిప్రబోధకలనం దగు భారతికిన్ బ్రబోధము
లారజదనంతతోకపుపటంబులకున్ బ్రతిబింబనుల్గదా
మా జయరాము కావ్యములు మాన్యకవీశ్వరగేయభావ్యముల్.

14. బ్ర. విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రిగారు,
విజయనగరమహారాజసంస్కృతకళాశాలాంధ్రోపాధ్యాయులు
విజయనగరము - 21-5-1934.

“ అర్థగౌరవముకలిమి బుధాలికిఁగూడ నభేద్యమైన భారవిని దేటతెలుఁగు నుడివోని తీయని నుడికారములఁ దెలుఁగుసేసి తెలుఁగు బాసకలరూపెఱుంగు నెఱుకగలవారి కెల్లరకు సుబోధముఁగావించిన మీపాండితీప్రకర్ష ప్రశంస్యము.

పండితవరులును నిదమిత్థమని నిరూపింప నేర్పుచాలమి వదలు నట్టి నారికేళపాకాంచితంబులై నిగూఢార్థబంధురములగు పట్టుల ననంటిపం డొలిచి చేతంబెట్టినభాతి నాంధ్రీకరించి మించిన మీ యాంధ్రీకరణనైపుణి యనుపమము.

రసమునకొండె నలంకృతులకొండె భంగమురాని భంగి జాతీయోక్తులచెలువము చెలంగ జానుతెలుఁగునుడులయందము పొందుపడ భారవియున్న రూపునకు వన్నెవెట్టుచున్న మీ తెలుఁగుసేఁత మీయుభయభాషాకౌశలమును జాటు వలఁతి.

క్లిష్టస్థలములఁ గష్ట మిసుమంతయేనిఁగనక మార్దవమెసంగ భాషాంతరీకరించిన మీకవితాకౌశల మనన్యకవిసామాన్యము.

ఇట్లు దొసంగు పొసంగనికవితకలిమి నెసంగు మిమ్మును, భారవి కలరూపు నెఱింగించిన కవితల్లజుల మిమ్మును నాంధ్రకవిలోకభారవులని నామనం బనుమతించెనని విన్నవించికొన వేడ్కపడువాఁడను.

15. మహారాజరాజశ్రీ శ్రీరాజా విక్రమదేవవర్మబహద్దర్ గారు,
జయపురమహారాజుగారు, జయపురము, ౧౧-౬-౩౪.

శ్రీయుక్త భువనగిరివిజయరామయ్య, బి. ఎ, గారు సాదరముగా నాకుఁ బంచిన స్వీయానువదితభారవికావ్యముయొక్క ప్రథమతృతీయభాగముల నొప్పుపద్దెములలోఁ గొన్నింటిని మాత్రమె చదివితిని.

సరిగా ననువదించుట కష్టము. అట్లనువదించినను దదనువాదము హృద్యముగా నుండుట దుర్లభము. అట్లుండ నేఁజదివిన యాపద్యములు మూలానుసరణములును, మృదుమధురపదయుతములును, సలక్షణములునై యున్నవి. అవ్వుత్తములు పాఠ కాలలందు మాత్రమే కాక, గృహములందును బఠనీయములుగా నొప్పెడిని.

# తొలి పలుకు.

—••❀••—

ఉ. ఎచ్చటనుండిరాకయొకో? యెచ్చటికేగఁగ నింతవేగమో?
యిచ్చలనంబున న్జదల నేమిటికో యిటులిన్నిచుక్కలి
మ్మచ్చ[illegible]ట్టి సాగి బహుమానముల న్గమనించుచుంట లీ
యచ్చెరువైన కాలగతి కౌర! కతం బెఱుఁగంగ శక్యమే?. 1

శా. రేల న్నింగిని మిణ్కుమిణ్కుమనుచు న్రిక్కల్ప్రకాశింపఁగా
నాలోకించిన రంగువెన్నెలలు కాయన్నాగు నిర్మేఘమా
నీలాకాశమునందు, పెక్కులగుచిన్నెల్వాని కెట్లబ్బెనో!
వ్యాలోలస్థితు లేలకల్గెనొకో! తద్వ్యాపార మేభంగియో ! 2

మ నవరత్నాభలు మింటఁ బ్రిస్తరితవిన్యాసంబుల న్లెక్క కె
క్కువలై యొంటిగఁ గల్పగా నిగిడి నిగ్గుల్చుట్టువర్షించు చెం
దొవలై పద్మములై జపాసుమములై తోమాలలై నింగియ
న్నువపెన్కొప్పు నలంకరించునటు లెందు న్జుక్క లిట్లేలకో? 3

చ. టకటక నేగు ధూమశకటంబున గొట్టమునుండి మిణ్గురు
ల్వకవిక లేచు బాగొలయఁ గాలునిచండగతిన్ స్ఫులింగమా
లిక లిటు లుప్పరంబునకు లేచి చెలంగుచునున్నవొక్కొ? ప
ల్రికములచుక్కలై బహుళలాస్యముల న్నిజదీప్తు లొప్పఁగన్. 4

మ. అది సప్తర్షిపదంబు టావయిది బ్రిహ్మస్థానమం టందును
న్నదియేసూ! ధ్రువమండలంబటఁ బ్రిసిద్ధాత్ము ల్చిరంజీవులా
చు దివి న్రిక్కలరూపుల న్నిలిచి సంశుద్ధాంతరంగంబు సం
పద సొంపారఁగ జీవుల న్సుఖమునింప న్జాతురం బెప్పుడున్. 5

మ. అదిగో! తొమ్మిదిరంగుల న్దశదిశావ్యాప్తంబులై వెల్గ న
మ్మదముంగొల్పెడిచుక్క యొం డమృతసంపద్భాసియై పొల్చు న
య్యదియే సర్వరసాఢ్యకావ్యసుధ నిండౌ సత్కవిత్వప్రివా
హదశన్ భూస్థలిఁగొల్పు భారవిసుమీ! యన్నన్ బొసంగుంగదా!

శా. ఈనక్షత్రిము పుట్టుటెప్పుడో? ధరన్ హేరాళధారాళతన్
దా నెన్నాళ్లు చరించి దివ్యకవితాధారాసుధారాశి కి

ట్లీనాడెంబు ఘటించెనో? మరలనిట్లే జ్యోత్స్నల న్నింపి కా
వ్యానూనప్రభ వ్యక్తుల న్నినిచి చేయంజాలునో సత్కృతుల్ ? 7

మ. అలప్రాచేతసకాళిదాసముఖు "లౌరా"! యంచు నాశ్చర్యవా
క్కుల మెచ్చంగ రసార్ద్రసంభృతమహాకూపారసౌహార్ద్యనౌ
కల ధారాబహుళోద్గతు ల్పొలయఁ జెంగల్డాఁకి మిన్నంటు వా
గ్లలనాచిత్రవిలాసపాలనకళాలంకారుఁడౌ భారవిన్. 8

మ. కనుఁడీ! మఃజ్జనినట్టి సత్కవులకు న్గావ్యంబుల న్నూత్నశో
భనము ల్సాధ్యముగాటఁ దెల్పి పిదపన్ వర్తిల్లువా ర్స్వప్రసా
ధనము ల్గైకొని మేలుపొంద దివి నందర్సేరి యుగ్గింప సొం
పున నిష్కంపసుఖప్రవృత్తిఁ గవుల న్మూర్ధన్యుఁడై నిల్చెఁబో ! 9

మ. కలిగె న్బాంచశతాబ్దము ల్చనినవెన్క న్వింధ్యభూప్రాంతసీ
మల నిర్మాన్యకవిప్రకాండుని రసోన్మాదప్రపంచంబుఁటుం
చలఘుల్ప్రాసిరి తారకాణ గన మూహ న్నమ్మఁగాఁ నెట్లు? ని
ష్ఫలయత్నంబుఁ గాలయాపనము శంసాయోగ్య మెట్లయ్యెడిన్ ?

శా. శ్రీమద్భారతవేదమందు వనరాజి న్వాసముంగాంచి శ్రీ
సోమాఖండకృప న్ధనంజయుఁడు శ్రేయోదానశీలం బనో
ఘామేయాస్త్రమునొంది మించెనని వ్రాయన్ దానిఁ గైకొంచు నీ
ధీమంతుం డొకకావ్యమే యొసఁగె నెంతే నేర్పు దీపింపఁగన్. 11

ఉ. ఆదలఁదోలు భారతము నాభగవానుఁడువ్యాసహాని యు
ష్టాదశపర్వధూర్వహత సల్పఁగదాయనియేమొ ? అంటుగా
నాదటఁ దాగ్రహించిన కథాంశముఁ బెల్లుగవిస్తరించి యు
ష్టాదశసర్గము ల్సలిపె డంబున భారవి యింబుదేఱఁగన్. 12

మ. తొలిరెండింటను రాజనీతి తెరవు ల్త్రొక్కాడ మూఁడింట వ్యా
సులమంత్రిం బొకబీజమై వెలయ మెచ్చున్ బంధ పైరెంట సం
ధిల నాఱింటఁ దపస్సుఁ జేరఁ బయినైదింటన్ బ్రలోభాదు ల
వ్వలి యేడింటను సంధి పోరు వరము వ్వర్తిల్లఁగాఁ గూర్చెచోన్.

క. అదివనమా ! కవనమ్మా !
అదినగమా ! వగయ ! క్రీడయా ! క్రీడయ ! య

ల్లదిదురమా ! భిదురమ్మా !
వదరుసినీమయు యన న్బ్రవర్ధిలుఁ బటిమల్. 14

క. కూలంకషమగు పాండితిఁ
బాలించె న్విషయయోగ్యభాషయు శయ్యా
జాల మలంకారము లు
ద్వేలంబులుగాఁగఁ గృతిఁ బ్రవీణత మెఱయన్. 15

గీ. చిత్రబంధకవిత్వవిశేషములను
మార్గదర్శకుఁడై కావ్యమధురిమలను
బానకములోని పుల్లలభాతిఁ జొనిపి
చెఱచెనందురు కవితావిశిష్టగతిని. 16

శా. అయ్యారే! యిదిసత్యమా? యితని "వైయాత్యంబు పైవార మే
మయ్యా!" యంచనురీతి బేలలయి కావ్యంబాతయు న్వానితో
డయ్యం జేసిన యాచితీరహితులుండ న్వారిదోషంబు న
య్యయ్యో! భారవిపైనఁ ద్రోయుటదిన్యాయ్యంబౌనె యోజింపుడీ!

ఉ. వ్రాసిన వాక్యకావ్యముఁటఁ బ్రౌఢిమ యెన్ని తెఱంగు లన్నియున్
భాసురలీల నాచితికిఁబట్టుగఁ బాండితి నందుఁజూపుట
ల్దోసమె?- కాదు భూషణమె-దుర్బలు లేమననేమి?, వ్రాయలే
దే సమయంబు భారవి కృతిన్? గనకుండిన నిట్లుచూడుఁడీ! 18

శ్లో. వివిక్తవర్ణాభరణా సుఖశ్రుతిః ప్రసాదయంతీ హృదయాన్యపి ద్విషామ్
ప్రవర్తతే నాకృతపుణ్యకర్మణః ప్రసన్నగంభీరపదా సరస్వతీ.
భవంతి తే సభ్యతమా విపశ్చితామ్ మనోగతం వాచి నివేశయంతి యే
నయంతి తేష్వప్యుపపన్ననైపుణా గభీరమర్థమ్ కతిచిత్ప్రకాశతామ్.
స్తువంతి గుర్వీ మభిధేయసంపదం విశుద్ధి ముక్తే రపరే విపశ్చితః
ఇతిస్థితాయాం ప్రతిపూరుషం రుచౌ సుదుర్లభా సర్వమనోరమా గిరః.
స ౧౪ శ్లో 3, ౪, ౫.

మ. ఎవరో యీపలివా ర్నిఘంటువుల నాయీశబ్దము ల్తీసి కూ
ర్చి విశేషంబుగఁ గష్టమొంది సహజశ్రీయున్ బ్రసాదంబుఁ గై
తవిడ న్నక్తుల ధారవోసి కృతి సాంతం బన్యదుర్గోచరం
బవురీతి న్నచరింపఁగా బహుముఖంబౌ నద్దమై డిందదే ? 19

ఉ. ఊరక నోటివాఁడి తమకున్నదఁటం చెదియేని వాఁగు నీ
శ్చౌర్యభటు ల్దలల్ముడువ నల్లన సౌమ్యత మేల మన్నియుం
జేరిచి సూరిభారవి వచించినసూక్తి వినంగ లేదె ? త
త్సార మెఱుంగరాదె ? సరసంబది, చూడకయున్నఁ జూడుఁడీ! 20

శ్లో. గుణాపవాదేన తదన్యరోపణా ద్భృశాధిరూఢస్య సమంజసంజనమ్
ద్విధేవకృత్వా హృదయం నిగూహతః స్ఫురన్నసాధో ర్వివృణోతి వాగసిః.
స ౧౮ శ్లో. ౨౨

ఉ. ఎక్కడి భారతీయకథ యెట్టులఁ దా మొదలెత్తె! సుంత యా
చక్కన తోఁపదే! యడవిచక్కని కృత్యము దిక్కుఁ దక్కట
న్జిక్క యుధిష్ఠిరున్ బ్రణిధి చేరిన నాటకరంగతుల్యమా
షక్క విరోధివృత్తమును బల్కెడివాక్కు మనంబు గుంజదే !. 21

మ. పిదప న్ద్రౌపదిరోషవాక్చయమునున్, భీమప్రగల్భోక్తి, యు
క్తిదళంబౌ నృపు సాంత్వనంబు, మునిశక్తింగాంచు పెన్దోహదం,
బుదుటున్గొల్పెడి రాణి పోటునుడి, మార్గోద్ఘాటనంబుం, దపం,
బదిరా! రంగపరంపరత్వరలఁ జిత్రాకాశము న్నిండవే !. 22

మ. అదిగో! యచ్చరమచ్చకంటుల ధరాన్యాసంబు ; రా రండు రం
డిదిగో! వారివనీవిహార ; మరయుండీ! తజ్జలక్రీడ ; లా
మదనోత్సాహము దండిపండుగసుఁడీ! మానందలంత్రేమొ! వే
డుదుఁడీ! శకునినీతులన్వినఁగ నాపైఁ బార్థు శక్తింగనన్. 23

శా. జోతన్ శంకరదర్శనంబుఁ గొనుఁడీ!, చూడుండి! పెన్వేఁట, మూ
కాతంకంబుఁ, గిరీటితర్కము, శరన్యాసంబు. దూతోక్తి, రా
ట్స్వాతప్రత్యభిభాషితంబు, నరశే! సైన్యప్రయాణంబు, లు
ద్భ్రాంతల్గొల్పు ననేకమారణరణోద్యోగాదిధారాళతల్. 24

చ. కరుణము వీరము న్జమిలిగా వెలయించెడి యాజ్ఞసేని బం
ధురతరపాత్రపోషణముతోఁ బరి జంటగఁ దేరు శాంతవీ
రరసమునించు పార్థు నికరంపుప్రదర్శనమందుఁ బెంపు, న
వ్యరసవిజృంభణౌచితిఁ, గనంగన మైమఱువంగ నౌఁగదే !. 25

మ ఉపమన్ హెచ్చఁట మేఘవర్తి కరుణన్ యోగ్యండఁటాభూతి,మె
ట్టిపటాటోపమొ! భారవిం జదువరండీ! యొక్కలంకారవా

రవటిష్ఠత్వమెకాదు, సర్వరససాంద్రిప్రిస్ఫురత్వంబెకా
దు, పురే!, చిత్రికవిత్వమాధురియు చిందుల్గొల్పు నత్యంతముల్.

చ. "జగము తెలుంగు భావనికి జందెమదే" లనునట్లు భూమిఁ బూ
ర్తిగయశమొందు భారవిని దెల్పఁగ మాటలురాని నాదుదం
డుగరాదలేల? తత్కవిత ద్రాల్లిన యెక్కువ నొక్కకొంతయే
నిఁ గలిగెనా? తెనుంగుకృతి? నిగ్గఖిలం బెటులున్న నేనియుల్.

ఉ. దండివిశృంఖలప్రతిభఁ దద్దయు రోదసి నాటలాడు ను
ద్దండుని భారవీంద్రు ముకుఁదాఁ్రిడిడి యట్టిటు నేగనీక క
న్గొండు తెనుంగునన్ నిలుపుకొంటె నిదేయొకసంతసంబునా,
కుండుట కాతఁ డెంతయిఱుకొందిన నాకదియేల తెల్పుఁడీ! 28

శా. నాటుంగాఁబడె నోటిగింజ మహదానందామృతావృష్టి వా
తోటన్లోహదమీయఁ గ్రిందుడిగి యెంతో విప్పునన్ మొక్క మే
త్రేట న్మొల్చి చిగిర్చి పూఁదొడిగి పిందె ల్కాయలున్ దేనెపె
ల్లూటల్వారెడి పండ్లునై దటియు మీ రొక్కింతమూహూడరే! 29

శా. ఓహో! భారవియూపణంబొకో? రసాత్యుత్కర్ష చే నాచవు
ల్బాహాటంబగు కైపొసంగునని యుల్కన్బోకుఁడీ! చొటి నా
వ్యాహారంబుల కల్పు మెండగుటచే నాగాటు పోమీటి మీ
కేహాని న్దరిఁజేరనీయదిది, రండీ! యానుఁడీ! నానుడిన్. 30

ఉ. ముక్కకుముక్కగాఁ దెలుఁగుమూసకు దింపఁగ లేదు, భావమం
దెక్కువమార్పునుం గలుగ దేటికి ముంజెయికంకణంబుకై
చక్కనియద్ద మంతయును సమ్మతి మీదరిఁజేర్చినాడ నా
యెక్కువతక్కువ ల్తెలుప నింగితవేదుల కార్యమానుఁడీ!. 31

మ. నిరతోత్సాహముఁగొల్పి కైతకళ నంతేనాకుసంధించు, మ
ద్గురుతుల్యుండగు సోదరు న్గవివరు న్గోదండపాణిన్, లస
త్తరనాదెళ్ళకులాబ్ధిచంద్రుఁ గవి మేధాదక్షిణామూర్తి వి
ద్వరు న్మామిత్రుని, సూరిశేఖరుల సంభావించుచున్నాల్పెదన్. 32

గుంటూరు,
30-4-1934.

విధేయుఁడు,
భువనగిరి విజయరామయ్య.

ఈక్రింది సవరణలు ముందుగాఁ జేసికొనఁ జదువరులు ప్రార్థితులు.

| పుట | పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| అవతారిక:— | | | | |
| 1 | 2 | 3 | మేలం | హాస్యం |
| 2 | 6 | 1 | నాయకి | నాయిక |
| 3 | 13 | 10 | దెస్గించిన | దెల్గించిన |
| | 16 | 3 | గొప్పదన | గొప్పతన |
| 6 | 30 | 1 | తెలుఁగాణెల్వాలి | తెలుఁగాణుల్వాల |
| | | 3 | న్మాటునున్ న్నేఁటి నియోగులన్ | న్మాటును న్నేఁటి సన్మంత్రులన్ |
| 7 | 33 | 2 | గాణె | గాణి |
| | | 3 | రాయి | రాయ |
| | | 5 | లావ్వారివారణాశి | లవ్వారివారణాసి |
| 8 | 41 | 1 | కాండఁగానిజ్ఞాన కాండనుగాని | కాండమునను జ్ఞానకాండ మునను |
| | 44 | 3 | ట్లగుపించు | ట్లగుదెంచు |
| 9 | 45 | 4 | దివురదాత్మతన్ | దివురన్ దాత్మతఁ |
| 10 | 52 | 4 | బ్రాకినన్ | ప్రాకినన్ |
| | 55 | 4 | జేసనప్పుడుతదియే | జేరఁదత్ప్రిళకృద్ధే |
| | 56 | 2 | దోషరు | దోఁపరు |
| 11 | 61 | 4 | స్ద్రీర్స్నేయ | స్త్రీర్స్నేయ |
| 12 | 62 | 1 | వారితల | వారిఁదలఁ |
| | 65 | 3 | బఱుగు | బరుగు |
| 13 | 69 | 8 | యథేచ్చ | యథేచ్ఛ |
| | 71 | 2 | బుట్టము | పుట్టము |
| | 72 | 2 | పెరిగి | పెరిఁగి |
| | 73 | 4 | ల్లేనిదా | ల్లేనిఁదా |
| 14 | 78 | 1 | దాగుచున్ | దాఁగుచున్ |
| | | 3 | బ | ప |
| | | 4 | పేటనుఁజే | పేటనుజే |

| | | | | |
|---|---|---|---|---|
| 16 | 90 | 3 | దాటించి | దాటించుచు |
| 18 | 97 | 3 | యిష్టా | నిష్టా |
| | | 4 | వినుతుత | వినుతుఁడ |
| | 100 | 5 | కర్మిష్ఠియు | కర్మఠుండ |
| 19 | 107 | 2 | బ్రాప్తిం | బ్రాపిం |
| 20 | 108 | 3 | నేఁచి | నేచి |
| | 111 | 7 | పుత్రునిక | పుత్రునిఁగ |
| 22 | 120 | 2 | వికాసిలు | ఁబ్రకాశిలు |
| | | | దెన్గు | దెల్గు |
| | | 3 | దేకువ | దేఁకువ |
| | 121 | 2 | నాఁక | నాక |
| | | 4 | మొగదా | మొకదా |
| | 125 | 1 | తార్కాణ | ఁదార్కాణ |
| 23 | 128 | 1 | దలఁచిత | దలఁతున |
| 24 | 135 | 4 | జేరు | ఁజేరు |
| గర్భితకందము | | 2 | మానికము | మానికము |

కిరాతార్జునీయము.

| | | | | |
|---|---|---|---|---|
| 10 | 10 | 4 | దెఱుఁగని | మొఁదని |
| 14 | 34 | 2 | బఱగు | బరఁగు |
| 15 | 39 | 2 | జెడఁదూఁకు | జెడదూఁకు |
| 20 | 16 | 1 | లయవిభాతి | లయహారి |
| 26 | 51 | 4 | ననుపగ | ననుబగ |
| 31 | 19 | 2 | గజ్జాని | గగ్గాని |
| 33 | 24 | 1 | కనుపింప | కనిపింప |
| 38 | 27 | 2 | నాగపుపాగ | నాగపుఁబాగ |
| 50 | 8 | 3 | రపి | రవి |
| 55 | 1 | 4 | వాంఛుతై | వాంఛతై |
| 57 | 15 | 2 | బెన్దము | బెన్తము |
| 60 | 34 | 4 | బూనె | పూనె |
| 61 | 44 | 2 | బెంచు | పెంచు |

| | | | | |
|---|---|---|---|---|
| 64 | 8/2 | 1 | రూపు | రూప |
| 65 | 15 | 2 | వై చెవ | వై చేఁబ |
| 77 | 14 | 1 | ఉ. | సీ. |
| 81 | 41 | 1 | ధృఢాస్థ | దృఢాస్థ |
| 84 | 60 | 8 | చెదిరించు | చెదరించు |
| 85 | 8 | 1 | ల్గురుతు | ల్గుఱుతు |
| 86 | 9 | 3 | ద్దాదట | ద్ధాదట |
| 87 | 22 | 1 | సమర్ధనకు | సమర్ధునకుఁ |
| 92 | 51 | 1,2 | డావృత్తఛాయా దుర్గాద్రిహాకభూజముఃఁ | డావృత్తవృతాదిచ్ఛాయల వైఖరిఁ |
| 94 | 70 | 4 | తోపాట | తోఁబాట |
| 95 | 74 | 3 | నంచుఁగాన | నంచునుంట |
| 100 | 25 | 4 | గదులుల్వలి | గదులున్వలి |
| | 26 | 3 | మెటింగిం | మెఱేఁగిం |
| 102 | 39 | 1 | బోమె | బోయ |
| 110 | 40 | 1 | బ్రాతి | బ్రాఁతి |
| 111 | 42 | 3 | దన్నాశ్వయ్యు | దన్నాశ్రయ |
| | 46 | 3 | మస్వుల | మనస్వుల |
| 115 | 2 | 3 | గ్లుప్తము | గ్రుప్తము |
| 119 | 30 | 4 | రేగిన | రేఁగిన |
| 122 | 51 | 1 | నిగిడ్చు | నిగుడ్చు |
| | 53 | 2 | పగుపింప | పెటుఁగాన |
| 133 | 1 | 1 | వాడి | వాఁడి |
| 145 | 13 | 1 | దిగ్గిజ | దిగ్గజ |
| 154 | 16 | 2 | లుండ | లుండు |
| | 15 | 4 | మస్క | నమస్క |
| | 11 | 3 | నద్రిరి | నగ్గిరి |
| 155 | 19 | 4 | విలసెల్లె | విలసిల్లె |
| 156 | 25 | 2 | మోక్షనిత్య | నిత్యమోక్ష |

తక్కుంగల ద్విచతర్థవర్ణాదికములు రేఫశకాలు, వరసున్నలు నితరప్రమాదములు చదువరులే దిద్దుకొనఁ బ్రార్థితులు.

గుంటూరు)

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# ఉపోద్ఘాతము.

విశ్వశ్రేయోదాయకంబును సుస్థిరయశఃప్రతిపాదకంబును నఖి
లార్థసంపాదకంబునౌ కావ్యసృష్టికిమూలము, 'శక్తిర్నిపుణతాలోక
శాస్త్రకావ్యాద్యవేక్షణాత్ । కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతిహేతుస్తదు
ద్భవే' యని యాలంకారికులు వల్కియున్నారు. అట్టిశక్త్యాదిక మన
ల్పంబుగానొప్పి ప్రౌఢతమీఱఁ గృతిసెప్పిన ప్రాచీనగీర్వాణకవులందెల్ల
భారవి యగ్రగణ్యుఁడు. తత్ప్రతిభావిశేషం బిట నెన్నఁబూనిన దివా
కరునింజూప దివ్వెఁగొన్నట్లైనగు. పెక్కేల? మాఘమహాకవియంతటి
మేటి కీతఁడు వెట్టినదే వరవడియయ్యె.

ఇట్టి కవిలోకైకప్రతిభ భారవిచారిత్రంబు జ్ఞాతవ్యంబ కాని మన
కయ్యది యగమ్యంబుగఁ దోఁచెడు. ఐహోలుశాసనముం గాశికోదా
హృతియుం బరికించిన యాధునికవిమర్శకు లీతఁ డాఱవశతాబ్దియందుండి
యుండునని మాత్ర మూహించుచున్నారు. తత్కర్తృకము లెన్నియుం
డెనో కాని మనమెఱింగిన దొక్క 'కిరాతార్జునీయమే.'

ఇందలియితివృత్తము మహాభారతారణ్యపర్వాంతర్గతమగు న
ర్జునపాశుపతాస్త్రసంపాదనముం గూర్చినది. శైలి 'నానానిబంధవిష
మం'బై 'నారికేళఫలసమ్మితం' బన నొప్పెడు. అయినను, 'అవిదిత
గుణాఽపి సత్కవిఫణితిః కర్ణేషు వమతి మధుధారా' మనవినమే?
ఇఁకఁ దరిచినకొలఁది నంతర్మార్దవము భావగాంభీర్యము నర్థగౌరవమును
గోచరించెడు.

ఏమైనను, 'తేజవరాలు చెఱ్కు గీఁటిన వసవల్చు' బాలకుఁడు
జెందమునం గలఁగంగనేర్చునే?' యని శ్రీనాథమహాకవి వల్కినట్లు
భారవిభట్టుప్రౌఢవాక్కు లశిక్షితుల కలవడునవి కావు. ఇట్టియీతని
కృతి యాంధ్రీకృతినందిన నందలిభావము లందఱకు సుగమములై
రసానుభూతికిఁ దోడ్పడనయ్యెడు. కాని యట్టిదేర్పడి యుందనుకఁ

బ్రసిద్ధిపడసియుండదమ్యో. మఱియు ననర్గళకవితానైపుణ్యమునకుం దోడు జంకులేని సాహిత్యపటిమయును విసువులేని కార్యదీక్షయుం గల్గినంగాని 'రసగర్భనిర్భరం' బౌ భారవి కావ్యబంధంబును భేదించి యనువాదం బొనర్పంగాదు.

ఇపు డిది తెలిఁగింపనూనిన 'భువనగిరి విజయరామకవి' పండిత వంశసంజాతుఁడు. రసవత్కవితావిచక్షణులౌ బ్రహ్మశ్రీ మూకోదండ పాణిగారి కనుజన్ముఁడు. ఈతఁడు కైతసేఁతం గృతహస్తుండనుట కిందలి 'తొలికలుకే' తార్కాణ. తదుపార్జితవిద్యాసంపత్తి కీతని 'యువ తారక' లోఁ బేర్కొనఁబడిన గురూత్తంసులే సాక్షులు. ఇక్కవి యవిజ్ఞాతచారిత్రుండౌ భారవిం గూర్చి తాను విన్న యేదోకథఁ జేకొని యిచ్చమైఁ బెంచి 'ప్రథమభాగ' మని ప్రచురించినకృతి నాకందించిన పజి నందలికవితా ధారాళతం గని,

చ. భువనగిరిప్రసిద్ధకుల ♦ పూర్ణసుధాకర! మీరచించు 'భా
రవిఁ గవితాప్రవాహము సు ♦ రాపగతోఁ దులఁదూఁగసాగమా
ర్గవమున నింపు నింపెడు సు ♦ ధారుచిరోక్తివిధాన, మైన 'భా
రవి' యనకున్న నౌచితి క ♦ రమ్మధికమ్మగుసుమ్మి యెమ్మెయిన్ ॥

అనిపల్కియుంటిని. ఇఁక నిది యాంధ్రీకరించునెడఁ గొంతభాగముఁ గొనివచ్చి నా కీతఁడు వినిపింపఁగాఁ దొలుతటి స్వతంత్ర కృతి యందువలెనే సాగినకొలఁది నిందును ధారాళగతియొప్పి సరసముగా నుంట,

కం. వినిపించితివి 'కిరాతా
ర్జునీయము' తెలుఁగునఁ బలుకు ♦ చున్ రుచులొలికిం
చినవాఁడ 'వర్ధగౌరవ
ము' నిలువఁ గవి! విజయరామ! ముద మెదఁగదురన్.

అనియుంటిని. అనతికాలంబునన గ్రంథపూర్తిఁగావించి తెచ్చి మూలము దరినుంచికొని పరికింపుమని కోరఁగా నట్లొనరించి యథానుకూలముగా సవరించియిచ్చితిని. తుదకిప్పుడు, 'గుణినామపి నిజ

రూపప్రతిపత్తిః పరతఏవ సంభవతి ’ యను నార్యోక్తిని బాటించుటం
గావలయు నన్ని ప్రస్తావమునకుం గడఁగింప భ్రాతృభావమున నొడఁ
బడి నానేర్చినమై నిందుంగూర్చి నొడువువాఁడనయితిని.

కవి, తన ‘ తొలిపలుకులో ’ ‘ముక్కకు ముక్కగాఁ దెలుఁగు
మూసకు డింపఁగలేదు భావము దెక్కువమార్పునుం గలుగ ’ దని
మాత్రము సూచించి ‘చకోరా ఏవజానంతి మాధుర్యశ్చంద్రరోచిషా’
మని రసజ్ఞలోకమే పరికించుఁగావుతమని విడిచె. మఱియు బాలకులు
కస్తివడకుండ మూలముతోఁ బోల్చిచూచికొనదగునట్లు సర్గవిభాగ
మును శ్లోకానుసారపద్యసంఖ్యయు నగపరచియున్నాఁడు. ఏదేనిశ్లో
కముఁగొని యీయనువాదము ‘ తు, చ ’ తప్పకుండ సరిపడియు
న్నదా యని పరికించు విషమదృష్టిని గాక విశాలహృదయముతోఁ
జూచుతరి నియ్యది, ‘ శబ్దంబునను సరించియు నభిప్రాయంబుగుఱిం
చియు భావంబుపలక్షించియు రసంబుఁబోషించియు నలంకారంబు
భూషించియు నౌచిత్యంబాదరించియు ననౌచిత్యంబుఁ బరిహరించియు
మాతృకానుసారంబునం ’ జెప్పిన ప్రౌఢకవుల పుంతలనే చాలవఱ
కనుసరింప యత్నించినట్లు గోచరింపకపోదు.

భారవి మున్ముందుగా వ్యంజనావృత్తి ననుసరించి రాజనీతినుప
దేశించువాఁడై వ్యాసకర్తృకమునలేని వనచరప్రవేశముతోఁ గథాము
ఖంబున నిజానల్పశిల్పవైచిత్ర్యమాత్ర మగపఱచినాఁడు. ఈయనయను
వాదకుఁడన్ననో, కృత్యాదినే ‘రాజరాజ’ శబ్దగ్రహణంబున విశే
షార్థసంపాదనముఁగావించి కావ్యార్థసూచన మొనరించినవాఁడయ్యె.
పిదప, ద్రుపదాత్మజాకృతోపదేశవాక్యంబులం దొక్కెడ మూలగ్రంథ
కారుఁడు, ‘ అమర్షశూన్యేన...జంతునా’ యని ప్రయోగింపఁగా
మమ్మటభట్టు దోషస్వరూపనిరూపణముఁగావించువాఁడై యిందలి
‘జంతు’శబ్దము ‘నవాచకము’న కుదాహృతిగాఁ జూపియున్నాఁడు.
అందున కీతఁడు 1-33 ‘ కోపముడిగినవాఁ ’ డని దోసముబారినుండి
తొలఁగి నడచినాఁడు. పైన, 1-44 ‘ ఏలా ? జడత న్ప్రభుత్వమున
కవ్వల ముక్తికి రెంటికిం జెడక’ అను ద్రావిడీకృతామూలకోపసంహా

రోక్తి మనమున నాటఁదగినదైనది. పెండియు 2-6 'కొట్టినపిండి' గా
మొదలిడి 2-18 'మహాపురుషుండు కీర్తిసంక్షయముగ ముండబత్తెము
మొసంగుచు నన్యభృతిం జరించునే' యన్నది యాభీమున్నకే తగియు
న్నది. అట్టి యాతనికిఁ గ్రోధోపశమనంబుఁ గావింప సాధుమూర్తియా
ధర్మజుని 'నతితితిక్షాసమ మస్తిసాధన'మ్మను మూలోక్తికి, 2-43 'ప్ర
కృతిజనుండువోలె ధృతిఁబాయకుమన్న! భవిష్యదర్థదీ। పకత పురా
కృతోరుకృతిబద్ధముగాఁ గనుమన్న! ముప్పలోం। దక పరిపంథినాశన
మొనర్పఁగ నోర్పును మించు మేలిసా। ధకము లభింపదన్న! విహి
తంబిది యెన్నఁగదన్న! పావనీ!' యనున దెంతసాదుసేయఁదగిన
ప్రోది నొప్పెడినో చూడుఁడీ. ఇంక, వ్యాసోపదేశానంతరము గాండీ
విని ద్రోవది 3-54/2 యమూలములో నిద్దపువాక్కుల 'దిద్దు' చో
నాతనిఁ గార్యసాధనకై బద్ధకంకణుఁజేయఁజాలినదైనది. అంతం దప
శ్చరణంబుకై యింద్రసూనుం డింద్రకీలాద్రి కేగుతఱి నాతని ననుస
రించిన యక్షుని శరద్వర్ణనమున గోపీమజ్జస్వనాకర్ణనైకదృష్టి నొప్పిన
గోవులు 4-33 'మ। ల్లినరాబామ్మలునా మలంగుతలలఁ శ్రీలోల్క
పీనొగ్గడిఁ' అనునది గాంధర్వాభిజ్ఞుల నెంతయు పీనొగ్గఁజేసెడు. ఆపై
నచ్చర లచ్చోడిగ్గునెడ 7-14 'వాయుభుజంగుని తెరమీటుల'లోనె
'నాంది'యై 9-34 'అమ్ముద్దియల తొంగిచూచుటలలోఁ బ్రస్తావనకాఁగా
9-47లో శృంగార 'రంగ' ప్రదర్శనము మనోహరముగా నెఱపఁ
బడినది. ఆపట్టున, శృంగార నైషధకర్త 'కలకంఠిఁ గూడి
వక్త్రసవ మాని యాని' యనఁగా నీకృతి, 'విశేషమోదము న్పొఱసిరి
సుందరు ల్పతుల పుక్కిటిశీధురసంబుఁగ్రోలుటఁ'. అని పలికి, తద్ర
సానుభూతికై 10-33 'వలపుల భాస్కరుం డధరపానముఁగోరుచుఁ
దారసిల్లఁగాఁ బాలయులుక న్సరోజినియు మోమటునిట్టు మఱ'ల్పఁ
జేయునెడ నది మఱింత వన్నెఁదెచ్చినది. అటుపై, 10-51 'భాగ్య
హీనయగు తొయ్యలి సంగతి జాగు నోర్వదయ్యె' యని మార్చియు,
'నేర్పున న్పలకరంగ వచించె విపంచికాధ్వనిఁ' అని చేర్చియుం బి
దపఁగూర్చిన విప్రలంభశృంగారవిషయకోక్తులం దూర్జస్వలం బూర్జిత

పఱపఁబడినది. **14-5** లో భారవిసూచితనిజార్థగౌరవము నిలుపఁబడి నది. **14-26** శంకరదూత 'బెదరించుపోల్కి రొమ్మునగచి శీర్ష మూఁచి భుజముల్ఘుళిపించి కనుల్నిగిడ్చి తేజోనయఁగ గిట్టిన న్మాటలి' నది మనకుఁ గన్నులఁ గట్టినట్టులయ్యెడిని. తుదకుఁ గదనరంగంబునం దలకవ్వడి నెవ్వడిం జరించుచో 'శశివ దోషావృతలోచనానా' మను మూలమునకు 'సంధిఁగలలల్లే' యనికూడఁ జేర్పఁబడుటఁ దద్వాచా తీతత్వము బాగుగా గోచరింపఁజేసెడు. ఇట్లెన్నియనియెత్తివ్రాయ నగును ? 'కవితాయాంపరిపాకం హ్యానుభవరసికో విజానాతి' యని యింతతో విడిచి, యాతఁ డటనట లోకోక్తులఁ బరిగ్రహించుటచే మూలముకంటె రసవిశేషసంపాదనమొనర్చినఘక్కికి, **2-13** 'ప్రియ ముచ్చైఃపద మారురుక్షతః' అను మూలమునకు, 'తాఁడినెక్కువారి న్నెగయింతు రెందనుక ?' ననియు **14-19** 'భవ త్యపాయే పరి మోహినీమతిః' అనుదానికి 'వినాశకాలమునఁ బుట్టెనురా విపరీత బుద్ధి' యనియు ననువదించినది దిఙ్మఖముగాఁజూపి యింక నలంకా రాదివిశేషములంగూర్చి ముచ్చటింపఁగడంగుదును.

భారవికృతి 'కావ్యం రమ్య మలంకారా' త్తను న్యాయమున బహూళాలంకార(శ్రీ)కృతపరికరంబై కరంబుడంబుమీఱెఁడుగదా. అట్టి మూలశ్లోకరత్నము లీతని తెలుఁగుమూసలోఁబడి వికృతినందెనేమో పరికింపవలసియున్నది. అందు ముందు

(i) సవిశేషముగా నర్థాంతరన్యాసము లిం దేపాంటిక నందెనో చూతము : **1-45** 'అరిషుహి విజయార్థినః క్షితీశా విదధాతి సోపధి సంధిదూషణాని' యను మూలోక్తి, 'ఆహా ! యెక్కడలేదు? గెల్పుఁ గోన రాజ్యప్రక్రియ న్సంధితవ్యాహారంబుల రంధ్రముల్నెమకి స్వార్థా వాప్తిఁ బెంపొందుటల్ ?' అని యంతతోఁబోక, 'మాముఖములందే ప్రొద్దు వొడ్పొత్తెనే?' యనుటలో నింకస్వాతంత్ర్యము వెలయ నల రింపఁబడినది.

**14-22** 'గోమాయుసఖా నదంతినః' అనుదానికి, 'ఎటు ల్గభీరతా ! పూర్ణము దంతి నేస్తమునుబొందఁ దలంచును గుంటనక్క

తోఁ' అను ననువాదము సామాన్యసమర్థనరూపమున సమర్థము గానే యున్నది.

14-43 'నిండు తేజున నసదులు బెండువడవె ?' యనునది కూర్పులోను 16.24 'చిన్న పామునైనఁ జంపం బెద్దఁబాకే తగుఁ' అనునది మూలముకంటె మార్పుగాను, 'నిండుబండికిం జేటభరంబె' యను శ్రీవాక్యోక్తిని స్ఫురింపఁ జేయఁజాలెడిని.

(ii) ఇంక నిందు సమర్థనీయార్థసమర్థనరూపకావ్యలింగాలంకారంబును దఱచుగాఁ గాననౌను: 9-62 'భోగచిహ్నము ల్పాయని స్త్రీల కేల పయివన్నెలు భూషలు సోయగం బిడుఁ' అనునది, 'తరుణికి ధాత్రీపతికిని బరిచుంబనవేళ దంతపరిపీడన మిక్షురసంపుఁ బానకములో మిరియపుఁగారంబువోలె మె చ్చొనరించెఁ!' అను పద్యమును మదికిఁదెచ్చుచు నింపులుగొల్పుచున్నది.

4-6 వాహినీవనిత కీడ్పడనైన కతంబు 'తనహృదయేశుఁ డబ్ధిశరదంబుల నన్యకృతాభిలాషఁ జిక్కె' టగా నొనర్చిన హేతుసంపాదనము రసజ్ఞహృదయాకర్షకము కాకపోదు.

(iii) 5-46 లో రవిరశ్మి సోఁకిన తీవియలకును దటిద్విలాసరీతులకును సాదృశ్యలక్ష్మి యొప్పింపఁబడిన యుపమయు,

(iv) 9-57 'మదవతీముఖచమకసంపదల' లోని విషయవిషయ్యభేద తాద్రూప్యరంజనమా రూపకమును,

(v) 15-15 'చెన్నుపట్టు' నఁగల సమానవిషయారోపబింబప్రతిబింబభావవిలసితదృష్టాంతాలంకారంబును,

(vi) 17-45, 46 నఁ దనుత్రిమేగిన నరుఁడు, 'ఒఱవిడువాఁడి కత్తి' యు 'బొరయూడిన తాఁచు' నైన పదార్థవృత్తినిదర్శనాలంకారంబును గడురమణీయములుగా నొప్పుచున్నవి.

(vii) 6-8 'హేమసానువుల హారంగురంగు' సంక్రమించిన 'యుత్తుంగతరంగపాళి' యందలి స్వగుణత్యాగాన్యదీయగుణగ్రహణతద్గుణాలంకారంబును,

(viii) 14-3 'పలుకుజవ్వని' యొక్క ప్రస్తుతాప్రస్తుత వస్తు పరిస్ఫూర్త్యాత్మకసమాసోక్తియు

(ix) 2. 32లోని గృహీతముక్తరీత్యర్థశ్లేషయా నేకావళియుం బరికించుచునది.

(x) 9-21 'వెన్నెలల్! గదుముట నేఁపుడక్క మలఁగ స్వశదిగ్వనితామణు ల్చెలల్! వదలి ముదంబుల న్నిమువుశ్వాసములం గొనుట' యసిద్ధవిషయహేతూత్ప్రేక్ష కుదాహరణము.

(xi) 6-42, 7-16, 12-7 మున్నగు తావులందలి యయోగయోగకల్పనాత్మకసంబంధాతిశయోక్తి పరితలకే వేద్యమయ్యెడు.

(xii) జాత్యాదిస్థస్వభావవర్ణనాత్మకస్వభావోక్తినే 4-10 యం దీకవి తన 'బొజ్జ'లోఁ జక్కఁగా నిముడ్చికోఁగలిగినాఁడా యె. ఇం కెన్నెన్ని యలంకారములం జిత్రింపలేఁడు ?

తుదకు భారవివ్యాకృతిపక్షపాతిత్వము 13-19 'ప్రకృతిప్రత్యయ యోరివానుబంధః' అని సాదృశ్యలక్ష్మిని గల్పించువఱకుఁ బోఁగా, 'గమికర్మీకృతనైకనీవృతుఁడ' నన్నట్లు 'ప్రత్యయప్రకృతులందలిబంధమురీతి' ననకతప్పినదికాదు. 1-24 'తవాభిధానా' త్తను దానిలోని విశేషార్థ మనువాదమున స్ఫురింపదయ్యెనందు రేని, 'దేవః పతిర్విదుషి నైషధరాజగత్యా' యను శ్రీహర్ష శ్లోకమువలె నస్పష్టము కాలేదుగదా యని యున్నపొందికకే యింపొందెదరుగావుత.

మఱియు నీతఁ డేమయినఁ బ్రకర్షముకొఱకే పాటువడిన వాఁడు కాఁడుగాని యచ్చటచ్చటఁ బెచ్చునియమములతోఁగూడ వాక్రుచ్చి మెచ్చుఁగొన నెంచకపోలేదు. మచ్చున కచ్చ తెలుఁగులు 6-13, 25 లును 8-28, 30, 31, 32, 40 లును జవిచూడఁదగును. ఇఁక, మూలమున 15 వ సర్గమెల్లఁ గొల్లగాఁ జిత్రబంధాదిసందర్భములతోనిండి యుండ నీతఁడు నదికాంచి తనకబ్బమునఁ గొన్నివైచిత్ర్యముల నటునట నగపఱచినవాఁడయ్యె. ఇం దీతని 15-43 చతుర్థపాదగోపనవిధానము నవీనము. ఏదైననగుఁగాక. రసలోలుభు లీబంధాదులపస నెన్నరనుట

వాస్తవము. ఏలన, నివి యద్భుతావహములైనంతగా నానందసంధాయకములుం గానేరవు, అగుంగాక. ఇది యొకశిల్పము. ఇట్టిది నశింపకుండ నానేర్పునోర్పుం గలకూర్పరు లేవేని సంధింపంగా నన్యావిని సాధింపంజాలమిని, 'నిందతికంచుకమేవ ప్రియ శ్శుష్కస్తనీ నారీ' యన్న చందానం బల్కుకుందురుగాత.

ఇంక నిది యొక్కొక్కశ్లోకమున కొకపద్యముగా వ్రాయుటచే నిర్వచనమైనదేకాని యదియొకయుద్దిష్టనియమముగాదు. మూలము వివిధవృత్తవిలసితమౌటం గాంచి యిందును సనామకానామకానేక వృత్తసంవిధానం బొదవింపంబడినది. ఇందనామకములకిచ్చవచ్చి నట్లెల్ల నూతననామకరణములొనర్పమియ మేలనుకొనందగినది. ఎటనేనిం గానరాక, మమైత్రిమున్నగున వాధునికకవిసమ్మతి ననుసరించి ప్రయుక్తములయినవి.

వీనికేమి ? మొత్తాన స్వతంత్రకృతియనందగిన వైఖరి ననర్గళధారతో నోజఃకాంత్యాదికావ్యగుణయుక్తముగా ద్రాక్షాపాకమున వెలయింపంబడిన యీ 'యాంధ్రకిరాతార్జునీయము' విజయప్రతిష్ఠిత విజయవాటీమల్లేశ్వరార్పితమౌట మఱింతప్రశంసార్హము కాదే ?

మ. సుజనారాధ్య మనన్యసాధ్యవిబుధ స్తోతవ్య కావ్యాగ్ర్యమా,
విజయాఖ్యానము భారవిప్రథితవా క్పీయూషజోషం బిడన్।
విజయాఖ్యాత మిదాంధ్రభాషను రసా ప్తిన్మించు నంచద్యశో
విజయంబందఁగ నేలఁజాలవె? మృషా భిల్లేశ! మల్లేశ్వరా!

బందరు
భావాధిక
వైశాఖము

ఇట్లు
సుధీవిధేయుఁడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.

# శ్రీమదాంధ్ర

# కిరాతార్జునీయము



## అవతారిక



శ్రీవిజయాద్రిధాము, గుణశేఖరసోముఁ, గళాభిరాము, నా
ర్యావహదర్ధదేహు, నభయప్రదదక్షిణబాహుఁ, గృష్ణవే
ణీవిశదాంబుధౌతపదనీరజుఁ, బాశుపతారజున్, జగ
న్నావికు సంస్తుతింతు భువనక్రమణద్రివిణంబు పెంపుగన్.

మ. పలుకో? మాటయొ? యెప్పుడున్ దపమె లేవన్ భిక్షుకుల్ లాగుఁగా
ఖులు మీ, కద్దిర! నేఁడు క్రొత్తకథ భిల్లుం డౌటయున్ దెచ్చికో
లలుకన్ భక్తునితోడఁ బోరుటయు [illegible]బూను టన్గారిగే
లులచిర్నవ్వున వాలుఁ గ్రీడి కిడుసుశ్లోకుండు మమ్మేలుతన్. 2

ఉ. అంజలిఁబట్టి యానతవరాంగుఁడనై భజియింతు నిత్యమృ
త్యుంజయసర్గ, శ్రీకనకదుర్గఁ, గృపామృతదృష్టిపుష్పవ
గ్రింజితభక్తవర్గ, నపరాజితమార్గఁ, బ్రహృష్టభర్గహృ
త్పంజరదుర్గ, శ్రీవిజయపట్టణచిత్కళ, సర్వమంగళన్. 3

ఉ. అన్నిటనుండి జన్మ మెదియైనను రోయక పొంది యెందు నా
పన్నులఁ గంటిరెప్పవలెఁ బ్రోధి భరించు పరాత్పరుండు, సం
పన్నగృహస్థు, మావలపుఁబంట, రథాంగధరుండు, శార్ఙ్గి మా
తెన్నుల గెల్పుఁ గొల్పి వినుతిన్ బ్రణతిన్ గొని సాకుఁ గావుతన్.

చ. జతనముపంట ప్రోవు సరసంబులుగా విలసిల్లు నేదయా
వతిదరహాసచంద్రిక లవంబయినన్ బ్రసరింప నట్టిమా
త, తెలివి కూఁత, లోకవిహితంపుముదంబులనేఁత, లక్ష్మి సం
తతకరుణాసమృద్ధి నిడుతన్ భువనాన్వయపాళికిన్ సిరుల్. 5

ఉ. నాలుగుమోముల న్వడలు నాయకిసుస్వరధార సోనలై
కాలువలై మహానదులు కంధులునై సకలప్రపంచవా
గ్జాలములన్ గృతిక్రమైకస్వరరూపములన్ నటింప నా
లీలకుఁ జొక్కు ధాత విరళించుత మాకు మహాయురున్నతుల్. 6

ఉ. చంపకముఖ్యవృత్తగణజాతుల నూహలఁగొల్పి యందము
ల్నింపునలంకృతు ల్నినిచి నిగ్గయి సేయఁగ మూఁగువారి ని
ద్దంపుసుధాకటాక్షములఁ దద్దయు నాదృతిఁ జూచి ప్రోచి పే
ర్పొంపిడుతల్లి! వాణి!! యిడవే రసవేష్టితవాక్చమత్కృతుల్. 7

శా. శ్రీయంబు ల్నమకూర్చుయత్నము లిలన్ స్వేచ్ఛానుకూలస్థితు
ల్డాయ న్జాలని యంతరాయముల పాల్గాఁబోవ నిర్వ్యాజతో
కాయస్త్రాణకళావిహారముల నాయడ్డంకులన్ దీర్చు జే
జే యిచ్చున్ గణరాజు లోకములకున్ శ్రీయంబు లెల్లప్పుడున్.

మ. సురభాష న్నైరవాణుల న్నుడులసంచు ల్మేటికమ్మచ్చులై
తరువాతన్ జనియించువారి కృతిసంతానంబు మేల్పొందిక
న్దిరమౌన ట్లొనరించు గౌరవమున న్దీపించుగ్రంథాళి బం
ధురతన్ నిల్పిన సద్గురూత్తములకు న్గూర్తు న్నమోవాకముల్. 9

క. తొట్టుకొనుప్రేమ నాపయి
నుట్టిపడన్ బ్రథమవిద్య నొసఁగినజనకున్
బట్టాభిరామసోమపు
నెట్టుకొనెడిభక్తి నాత్మ నిత్యముఁ గొలుతున్. 10

క. పూర్ణాంధ్రభాషలన్ నెఱ
జాణ ల్తరగతులవరుసఁ జదివించిరి నన్
గాణేయగురుకలాపధు
రీణులు దేశికులు వారికృపఁ గీర్తింతున్. 11

క. మొదలుతొలిఫార మెప్పే
తుదగా సంస్కృతగురుండు దొడ్డబుధుఁడు మే
ల్చదువరి శిష్టాన్వయకో
విదు సీతారామశాస్త్రి వినుతింతు నెదన్. 12

సీ. ఆయుశ్శాస్త్రములందు నందెవేసినచేయి
లౌక్యనిర్వాహకులఁ దురాయి
వేదవేదాంతార్థవిజ్ఞాతులఁ మేటి
వాదరంగస్థలవాక్కిరీటి
శిష్యులపైఁ బ్రేమఁ జిలుకు సాత్వికమూర్తి
సాధువైదికకులాచారవర్తి
హాస్యరసాంచితవ్యాహారచతురుండు
రమ్యసాహిత్యధురంధరుండు

గీ. కళలఁ దనతోడఁదుల్యుఁడై కాళిదాస
మేఘదూతఁ దెన్గించిన మేలియొజ్జ
శ్రీనృసింహునిజనకుండు శిష్టకులుఁడు
నాగురుండు సీతారామనామబుధుఁడు. 13

శా. నాకున్ నాల్గవఫారమందు గురుఁడై నాఁ డొక్కఁడేఁ డాకవి
శ్రీకళ్యాణుఁడు కాశి కృష్ణబుధుఁ డాశ్రేష్ఠత్వమున్ దెల్ప నా
కేకా దేరికి డెప్పరంబునుమి తత్కీర్తిప్రభల్ ప్రాగ్ధరన్
మోకల్వారి తలిర్చి సాగి విరిసెన్ బో జర్మనీభూములన్. 14

ఉ. ముప్పదిమైదువర్షములమున్న వికారిని గోత్రగోత్రయై
యప్పటికప్పు డేర్పడిన హైందవనూతనపాఠశాలలో
నిప్పురుషుండు సంస్కృతపుటొజ్జయుఁడుఁగా విలసిల్లువాఁటి కీ
చొప్పున సర్వతోముఖత చొప్పడ దంతనిగూఢమయ్యెనన్. 15

చ. పిదప స్వయంకృషి న్నడఁకఁ జేర్చుట నేర్చి నితంపు గానమం
దొదుగు ఘటాదుల న్మిగులనొప్పను బిల్లనఁగోవిపాటమే
ల్కుదురు వధానకౌశలము గొప్పతనంబును వాఙ్మఖాఢ్యతం
బ్రిదులమి పాండితీగరిమ విజ్ఞులు సత్సభలందు మెచ్చఁగన్. 16

సీ. కంఠంబు సారింపఁగా సభాస్తారుల
“గ” మ్మను విద్యుత్తు క్రిమ్మినట్లు
లీలగా మేలంబుపాలింప సభ్యులు
కిలికించితులలీల కేరలవలయు

వ్యాసంబుఁ బలుకుచో వాగ్ఝరి గంగాప్ర
　　　　వాహంబుగా నూఁపివైచు సభల
హరికథారంగంబునం దుబ్బి నవరసం
　　　　బులు తరంగములుగాఁ బొలుచునెపుడు
　గీ. తనదు ప్రతిబింబమోయనఁ దనరు వ్యాస
　　సూరి యొక్కఁడ, నల్లుండు భూరిగుణుఁడు
　　పూర్ణుఁ డింకొక్కచోఁ బ్రౌఢిఁ బ్రోదిఁ గూర్చ
　　వెలయు శ్రీకృష్ణకవికిఁ గావింతు వినతి. 17

సీ. ప్రత్యక్షసాంగత్యబలము లేకున్నఁ బ
　　　　రోక్షమా నెఱుక గురుల్పలువురు
వావిలాలాన్వయవాసుదేవబుధుండు
　　　　వఝ్ఝాది సుబ్రాయపండితుండు
శ్రీపాద కృష్ణశాస్త్రిమనీషి నాదెళ్ల
　　　　పురుషోత్తమార్యుండు భూరియశులు
తిరుపతివేంకటేశ్వరకవిగ్రామణు
　　　　ల్బహుకావ్యకర్తలు ప్రౌఢకవులు
　గీ. గాక నవయస్కులై చిన్నలై కవిత్వ
　　లోకమునఁ బ్రాఁకువారు లనేకు లిపుడు
　　కలరు ప్రతిభలఁ దగురీతిగాఁగ వారి
　　వారి కర్పింతు నిం దభివాదనంబు. 18

సీ. అమ్మా ! సరస్వతీ ! యానాఁడు నేనాఁడొ
　　　　కనినగొప్పల కేమిగాని నేఁడు
వాక్యవీథులలోన వాహ్యాళి వెడలు నీ
　　　　కమరుపూజలు వేలు నద్భుతములు
గ్రాంథికగ్రామ్యసంకరభాషలఁ దెల్గుఁ
　　　　గైతఁ గైసేఁత చేసేతఁ గొనెదు
కలమాన్నమందుఁ గూరలు పచ్చడు ల్బజ్జు
　　　　లప్పడా లుప్పుచులూర్చునట్లు గాంచి

గీ. యహహా! నీప్రేమ కింతని యంతు కలదె?
తల్లి కనదలబిడ్డలఁ దగులు హెచ్చు
కాదె? దయ నాదుచిఱునుడి గౌరవింప
కుందువే? నామనస్ఫూర్తి నుత్సహించి. 19

ఉ. ఇమ్మెయి సర్వరూపముల నెమ్మెలఁజూపు పరాత్మ నిండుచి
త్తమ్మున భక్తిఁ దత్తదుచితక్రియలన్ బరిచర్యఁ దెల్పి వం
శమ్ముపరంపరన్ మనవిసల్పెద దీవనఁగోరువారు గో
త్రమ్మునఁ బేరుఁ దారె తొలుతన్ వచియించుట నైజమేకదా!

శా. భారద్వాజసగోత్రమున్ విమల మాపస్తంబసూత్రంబు వే
దారంభం బలకృష్ణయాజుషము యజ్ఞాదిక్రియాశీల మె
వ్వారిన్ ధన్యులఁజేసె లోకమున సంపత్సౌఖ్యము ల్గొల్పి సాం
పారన్ బూర్వమునుండి యాభువనగిర్యాఖ్యాతవంశంబునన్. 21

గీ. చదువఁ జదివింప జన్నంబుసలుప సలుపఁ
జేయ దానంబుఁగైకొన నీయ నేర్చి
నిగమమయమూర్తు లగుచుఁ బాండితి గడించి
పెక్కు రందు రాట్సభలలోఁ బేరుఁగనిరి. 22

గీ. భువనగిరి గుజరాద్దేశమునను గలదు
కలదు నైజామునలో భౌనగర్నమాఖ్య
తొలుత నటనుండి యిటకు వా ర్వలసఁజనుటఁ
గావలయు నామసామ్యంబు కలిగె నట్లు. 23

గీ. హైదరు షరాసులు శివాజియనుఁగుదొరలు
నాంగ్లసేన నిజాము రాజ్యాశఁ బెనఁగు
నపుడు దినగండములును దీర్ఘాయువగుచు
దక్షిణాపథమంతయుం దద్దరిల్లె. 24

క. ఆవిప్లవముల జనతా
స్థావరములు నిలుకులేమి దాఁటు నదుల దం
ల్లై వెడలి యలజడిన్ జను
లావైపీవైపు నాక యాగిరి దెసలన్. 25

చ. భువనగిరిక్షమాసురులు మున్ దమరున్ దొలి యాంధ్రభూపతుల్
యవనచళుక్యపల్లవధరాధిపముఖ్యు లొసంగియున్న మే
లివసతులెల్ల రాజ్యము చలించుటతోడ నశించుచుండఁగాఁ
జివరకుఁ గోవలై చనిరి చింతపలీధరచుట్టుపట్లకున్. 26

ఉ. వారలనొక్కశాఖ తమ బాంధవు లాప్తులుఁ దోడరాఁగ గుం
టూరున రామచంద్రుఁ డను యోగ్యుఁ డొసంగుట వానిపేరఁ జె
న్నారు మహాగ్రహారమున నాఁగి కుదుళ్ళు, కుదుళ్ళుగాఁగ సం
స్కారులలోఁ బ్రధానులయి క్రాలిరి వైదికలౌక్యవృత్తులన్. 27

ఉ. శంకరభట్టు మూలపురుషప్రథ మాకొక బ్రహ్మపుత్త్రుఁడై
పంకజసూతి సృష్టి కగు వైఖరిఁ దానును వంశకర్తయై
బింకముఁ బొంకమున్ వెలయ పేరుప్రతిష్ఠలఁగాంచి మించె నే
ణాంకకళాఢ్యుఁడై కువలయాధిపసూరిసభాగ్రదీప్తియై. 28

ఉ. భట్టను ఔత్తరాహుఁడని వైదికలౌకికజాతిభేదముల్
ముట్టనివాఁడటంచుఁ దెలుపున్ వరభారవిభట్టముఖ్యులై
నట్టులు దక్షిణాపథమునందు నివాసము కల్గువెన్క నె
ప్పట్టున వానివంశములు వైదికరూఢినిఁగాంచి మించెనో. 29

మ. తెలుఁగాణ్యు ల్వెలినాఁటివారు ననఁగా దేశాఖ్యలన్ వైదికు
ల్పలునామంబుల వేఱువేఱు తెగలై వర్తిల్లిరో లేదొ? నాఁ
డులవేర్పడిన నిచ్చిపుచ్చుకొనఁ జాటున్మాటునున్ న్నేఁటియ
ట్టులు ప్రత్యేకత నూత్నజాతమయియుండున్ సంఘదార్ఢ్యంబునన్.

శా. ఈభేదంబులమాట యెట్లయినఁగానిం డగ్రహారంబునన్
శోభన్ నాఁడు వసించు వైదికులయందున్ మాత్రమేకాక నిం
డౌభూతిన్ విమలైకమత్యమును సౌఖ్యం బుండె నియోగులన్
శ్రీభవ్యు ల్వరవైష్ణవాగ్రణులలో శ్రీమాధ్వవంశంబులన్. 31

శా. అన్యోన్యంబిటులై మతత్రయవిపర్యాసంబు లే కెందు సౌ
జన్యంబొప్పఁగ బ్రాహ్మణోత్తముల సంసారంబు లుర్వీశసం
మాన్యప్రౌఢిమ నగ్రహారమున సంపద్వృద్ధి వర్తింపఁగా
నన్యు ల్వారిని దేఱిపాఱఁ గన ధైర్యం బూన రెప్పట్టునన్. 32

సీ. మాకుటుంబంబుతో మచ్చిక నక్కాల
ముండిరి తెలుఁగాణ్యయుర్వీసురులు
గుంపు రాయప్రోలు కూరెళ్ల పన్నాల
వెల్లంకి దేవరపల్లి సూరి
భారతు లోవ్వారి వారణాశి ప్రయాగ
వ్యాకరణము చల్ల వంగల కొల
చలపు మన్నగువారు వెలినాఁడులోఁ దాడె
పలి చల్ల యడవల్లివారు మంత్రి
గీ. లంకఁ బోలూరు దినవహి యక్కరాజు
కేత లక్క కోటంరాజు పోతరాజు
మంచికంటి పొత్తూ ర్వాంకమామిడి వెల
గపుడి తోలేరు వెన్నెలకంటివారు. 33

ఆ. వైష్ణవులఁ గిడాంబి వంగిపురం కొమాం
డూరు తిరువళూరు వారె మాధ్వ
లందుఁ బత్రి కాశి యద్దనూ ర్బాడిద
బోడి ఘనగ చిలకపురపువారు. 34

క. ఈమొదలు మతత్రయము లగు
భూమీసురశేఖరులను బొలుపు చెలిమి పెం
పామువెలయంగ సంతతి
తామరతంపరగ మాపితాళ్లు మను నెడన్. 35

ఉ. శంకరభట్టువంశమున జన్మమునొంది సిరిన్ బురిన్ ధరన్
శంకరసోమయాజులు యశంబున సోమకళాఢ్యుఁడై నిరా
తంకసమగ్రపండితవిధానములన్ దనయంతవార లే
వంకల నేరు లేరను ప్రభావమునన్ ముని రగ్రయాయులై. 36

గీ. అత్రిమూర్తులవరుస నా[illegible] సుతులు
మువ్వు రుద్భవమొందిరి పురుషవరులు
వారిలో రాయపాధ్వరి వంశకీర్తిఁ
బ్రబలమొనరించెఁ బాండితీపటిమ దెసల. 37

మ. వరుసన్ వారికిఁ గల్గి రిద్దరుసుతుల్ పట్టాభిరామాఖ్యుఁడున్
బరదేశిప్రథితుండు వహ్నిపతిజిహ్వాద్వంద్వమో నాఁగ ని
ర్భరవేదప్రభ సోమయాజులయి వార ల్లౌక్యయోగంబులన్
జిరకీర్తిం గడియించి మించిరి బుధశ్రీవారిధిన్ జంద్రులై. 38

క. అం దగ్రిముండు పారద
ముం దెగడెడు బుద్ధియోగము ల్వెలయఁగ నిం
టం దెసల మ్రోఁగు పేరుప
సం దండడి వర్ణ్యుఁడయ్యె సమాప్తులకున్. 39

ఉ. ఆయమరావతిన్ మిగులు నాయమరావతి ముఖ్యపట్టణం
బై యెసఁగన్ నిజామునకు నండగఁ గృష్ణయుఁ దుంగభద్రయున్
బోయెడిసీమలన్ బ్రభుతఁబొందిన శ్రీయుతవేంకటాద్రిరా
ణ్ణాయకుకోర్కి నోలగమునన్ గనె నీతఁడు లోకమాన్యతన్. 40

ఆ. కర్మకాండ~~[illegible]~~ (మునకు) జ్ఞానకాండను~~[illegible]~~ (మునేను)
దాయభాగనయపథములఁగాని
బహుపురాణకథనపటిమలోపలఁగాని
చెప్పవలయు వీనిఁజెప్పి రొరుల. 41

ఉ. నాటకరంగ మేర్పడనినాఁడు పురాణకథల్ వచించు నీ
మేటి నుడిన్ రసంబుల కమేయవిశృంఖలతన్ ఘటించి యా
నాఁటిక్రియల్ జనంబులమనంబుల నాటి స్వకీయగాథగాఁ
జాటిలి పాల్గొనన్ బఱచు వైఖరిఁ గూర్చనటండ్రు నేర్పునన్. 42

మ. తలిరున్నెవళమున్ బసిండికళ సౌందర్యంబుపొంకంబు పూ
ములుకుల్గా రమణీహృదంతరములన్ మోహంబుఁ గల్పింప నా
వ్వులకుప్పల్గద దండికం డెలని భూపుల్మెచ్చిచూడన్ జవుల్
చిలుకు న్వాక్కని యెల్లరు న్గదియ వాసిన్ మించు పెన్నంబడున్.

ఉ. పాళెపుగుత్తగాండ్రకడఁ బన్నుఁగొనంగ హళాహళిన్ హరిన్
హాళి దువాళిమై నరుగునప్పుడు చిల్కహుమాయిపైన వా
హ్యాళిఁ జరించు మన్మథునియట్లగుపించు నటండ్రు, పెన్ దొరల్
గూళలుఁగూడఁ దత్ప్రతిభ లొంగి కరం బిడునండ్రు వారికిన్. 44

క. పువు పద్మం బయినప్పుడు
మివులు సుగంధంబు లోఁచె ? మేలిగడన కా
పవుపాండితితో సీవియుఁ
దివురఁదాతృతన్ బ్రసిద్ధి దీక్షితుఁ డమరెన్. 45

క. ఆవేంకటాద్రి రవియై
యీవితరణశీలి పద్మమే యయియుండన్
ధీవరులకు నిగమాఢ్యుల
కేవలన్ లోప ముండునే యొసకమునన్. 46

ఉ. వాణియనుగ్రహంబును లవంబయినన్ గలవారు, వేదపా
రీణులు నాశ్రయించుచుఁ జరింపఁగ నాతనియిల్లు నిత్యక
ళ్యాణముఁ బచ్చతోరణమునై భువిఁ బండితగేహముల్ దరి
ద్రాణములన్న సామెతకుఁ దార్చె దరిద్రిత భూరిలక్ష్మిచేన్. 47

ఉ. కేసరభాసురంబయి ప్రకృష్టరుచిన్ దగు తమ్మిదిమ్మకై
సేసిన రేకు లందముల చిన్నెలవన్నెలఁ జుట్టునిల్చి సం
తోసముఁ గూర్చులాగతనితోడున జీవనము లభింప నెం
తో సుఖులై భజించిరఁట దొడ్డకవుల్ వరపాండితీఘనుల్. 48

శా. పౌత్త్రార్యన్వయకాళిదాసుఁడు కడున్ బూజ్యుండు గుంటూరువాఁ
డుత్తుం డన్నిఁట వేంకటాద్రిసభలో నుండెన్ మహామంత్రియై
క్రొత్తల్సేయుచు నాదధీచిముఖకీర్తుల్వారికిన్ వీరికిన్
బా త్రంతంతకుఁ బ్రేమమై ప్రబలె నాప్తుల్మెచ్చి యగ్గింపఁగన్.

క. ఈతని లేఁతవయస్సున
భూతలనేతలనుఁ జూచుమున్న ప్రళయజం
ఝూతీవ్రమైనయాపద
పాతగలన్ దగిలెనండ్రు భవహారణశివా ! 50

శా. తాతల్తండ్రులు మున్ గడించినస్థితుల్ ద్రవ్యంబులున్ బ్రాపుగా
నీతం డబ్బ గతింపఁ బెద్దయయి తానే సోదరున్ సంస్కృతిన్
జేతోమోదముగా భరించు నెడ నాచెన్నొంచి చూపోవ న
ట్లాతోల్లింటికృతిప్రపంచఫల ముగా బ్రపత్తుఁ జేకూరిచెన్. 51

శా. నూత్నాయాతవధూనవప్రణయసంతోషంబులన్ దేలుచున్
బ్రత్నావద్విషయంబులన్ మఱచుచోఁ బైవచ్చుచున్నారు దు
ర్వృత్తుల్ ఘోరకిరాతకృత్యముల సంరంభంబు లొప్పంగ సే
షత్తుల్ భాగ్యము లుండనీర నెడి దుర్వార్తల్ దెసల్ బ్రాఁకినన్. 52

క. ఘోరంతయు గ్గోత్రా
యారాటము దిగులు మిగుల నట్టుడికినటుల్
తారాడిరి జను లట్టిటుఁ
బోరాఁ బోరాడ శక్తి పొసఁగనికతనన్. 53

చ. ధనముల మాటువారు వెలిదారుల నైళము దాఁటువారు గొ
ల్లున విలపించువారు ధృతి లోఁబడఁ గూలి కృశించువారు తెం
పున గుమిగూడువారు ధనము ల్గొని బీటులడాగువారు నై
జనములు నాఁటిరేయి భయసంభ్రమకర్షితులై చలింపఁగన్. 54

శా. మ్రోఁగెన్ సూరెలఁ బెట్టుదిమ్మలు రవమ్ముల్ దద్దడన్ బెల్లుగా
రేఁగెన్ దప్పెటలున్ గ్రముంబుగను బర్వెన్ సింహనాదధ్వనుల్
సాగెన్ సందుల నేమ్ము లంతకకళల్ ల్సాధించు పిండారిదం
డీ గుంటూరునఁ జే[illegible]రాళధారాళతన్. 55

మ. మిడిగుర్లన్ మిణుగుర్లు లేచి కొలిమిన్ మిట్టాడు నట్లాగతు
ల్గడియింపన్ గడిదోపరు ల్గరములన్ గత్తు ల్కళ ల్కాగడా
ల్గొని వా డ్లిండ్లు గుడుల్ పొలా ల్గుడిసెలున్ దోఁపల్ నగళ్లించు లె
క్కడ కెందున్ దమమారకక్రియలతో స్వేచ్ఛన్ విజృంభింపఁగన్.

ఉ. వారక కోటదిబ్బకయి వారలు పార్లడరింపఁ బాతగుం
టూరును జుట్టుపట్లు విడి యొక్కమొగిన్ దెగి బందిపోటుగుం
పారభటిన్ బురంబు వెలియంచులపేటలు నగ్రహారముల్
ఘోరత దోఁచి రప్పు డనఁగూడనిచర్యల మారితీరునన్. 57

క. అడిగినవెంటనె దిగదో
పిడిగా సకలంబు నిడక వెనుకాడుప్రజల్
పడిన పలుపాట్లు తలఁపునఁ
బడ దడదడ నొడలు వడకఁ బాఱి చెమర్చున్. 58

సీ. అనుకంప విడి కంపలను గొంపలను దింపి
యగ్గి కుటుంబంబు లార్పువారు
సలసలయునునూనె వలవల మెయిఁబోసి
నిలువెల్ల సున్నంబుఁ గొలుపువారు
నూనె గుడ్డలు మేనఁ బూని చుట్టినకొన
మంటఁ గొల్పి బిరాన మాడ్చువారు
ముసికుచ్చుచబుకు దండడి విచ్చుపాల చింద
గుదిగ్రుచ్చి పొరపుచ్చి వదలువారు
గీ. కత్తికండలు బంతులుగాఁగ నెగురఁ
గాలువలుగాఁగ నెత్తురు గాఱఁ గొట్టి
తిక్కడిగఁ బీన్గుతిప్పలఁ దేర్చువారు
నైరి, గోరాలమారిపిండారివారు. 59

సీ. అటుకలు చిటికలోఁ బటుకునఁ దుస్టియించి
మాడువు ల్గోడలుఁ బాడుచేసి
కొట్లు గోలెంబులు మట్లు మల్లడిగ్రొచ్చి
కూలము ల్దొడ్లను గుద్దలించి
పాతఱ ల్పెకలించి నూతులెల్లఁ గలంచి
తుక్కతిప్పలు చించి తూరుపెత్తి
వాములు వెదచల్లి తూములగల గుల్ల
గూన వెల్లగిలంగఁ గుళ్ళగించి
గీ వెండిబంగారునాణెముల్ విలువసొమ్ము
లున్నగింజలు పాత్రిలు వన్నెచీరె
లది యిదియు నాఁక చేతుల కందునన్ని
కొల్లగొనె నష్ట పిండారిగుంపు లెగచి. 60

శా. పిండారుల్ చెలరేగి యిట్లు లోకచో పీడెల్లఁ గొల్లంగొనన్
గండం బెట్టులదాఁటువార మనుజిజ్ఞాసన్ నరుల్ వేఁచుచో
గుండెల్ నిబ్బరమూని, త్రోవఁగని, తుక్కున్ దూసరుల్ వీథులన్
నిండన్ దోఁపిడి యాపెసన్ నడిచెన స్థిర్సేయు చుప్పన్ జనన్. 61

గీ. తాఁడిఁ దన్ను వారి తలదన్ను వారలుం
గలరటంట నిజముగాఁగ నిట్టి
యుపమ నూరిలోని యొకకొన్ని చోటులు
వొద్దవోక నిలిచెఁ దొంటిపోక. 62

ఉ. చొచ్చిరి యగ్రహారమునఁ జూరులపై కెగఁబ్రాఁకి యిండ్లలోఁ
గ్రుచ్చిరి శూలముల్ గృహులఁ గ్రూరత దాఁచటికంబుఁదెల్పఁ గో
ల్పుచ్చిరి యాండ్రసిగ్గుఁ బారిపుచ్చిరి బింకముఁ జూపువారలన్
గ్రొచ్చిరి చాట్లుమాట్లు నతిఘోరకృతాంతభటప్రచండతన్. 63

క. అదె వచ్చిరి యిదె చొచ్చిరి
గుదిగ్రుచ్చిరి పెనఁగునరులఁ గుదురులకొల్లన్
మదమత్సరములు హెచ్చఁగఁ
గదలిరి మాపీధి దోఁచఁగా నని తెలియన్. 64

చ. గుడికడ బావినీరు గయికోఁ జనియుండిన భార్య నూతిలోఁ
బడుటయుఁ దమ్ముఁ డింటఁ గనుపట్టమి గుమ్మము నడ్డగించి దో
పిడిపజ పైఁబడన్ బఱుగువెట్టుట గొబ్బునఁ దాళపుంజెవుల్
పుడికి గృహస్థు తాఁ బెరటిపుంత బహిర్గతుఁడౌచుఁ బర్విడెన్. 65

ఉ దైవవశంబుచే నెదిరితాఁకెడువారలు కానరామి నా
ధీవరుఁ డట్టియాపదకు దీనత పైకొనుచుంట ధైర్యముం
జేవ విదిర్చి యుందఱకుఁ జెట్టలిటుల్ ఘొనరించుమూఁకలన్
దైవము సైఁచునే యెదియొదారిఁ గనంబడఁజేయకుండునే ?" 66

మ. అనుచున్ దారులు డొంకలున్ విడిచి తోడైవచ్చువాఁ డ్లేక యొం
టిని జేల్పెట్టులు గుట్టలున్ మఱుగు సంధింపంగ శ్రీనర్సరా
ఘ్టనదుర్గంబు దెసన్ వెసన్ జనియె భక్తత్రాణపారీణుడై
వనుతుల్ చిత్తమునం దొనర్చుకొను చాపట్టాభిరాముం ; డటన్.

శా. బావిన్ దూఁకినభార్య ధారుణివయిన్ బత్తెంబు పాలుంటనే
మో, వారిన్ బడి చాక, దైవకృపపెంపున్ జేసి మెట్టందుఁబ
ట్టై వారంబులు పుచ్చుచుండె జలమాత్రాహారయై, యంతలో
నావీ డెల్లను దోఁచి దొంగగుమి వాయవ్యాశఁ బ్రస్థానమై. 68

సీ. కుళ్ళాయ లెగపుచుఁ గేళ్ళువాఱుచు వెఱ్ఱి
        లొల్లాయిపదముల నల్లువారు
ముల్లుగఱ్ఱల మేనినల్ల గాఱఁగ బందిఁ
        గుళ్ళువారలఁ దోలి తుళ్ళువారు
వల్లదప్పి ధరిత్రి డొల్లినవెట్టులన్
        గల్లగాడిదెలంచు గిల్లువారు
కల్లుకైపునఁ బాదు వెల్లగిల్లినతెంపు
        కొల్లగాఁగ యథేచ్ఛఁ దెళ్ళువారు
గీ. సుళ్ళుగా ధూళి దెసల గుంపిల్లువాఱ
జాళ్ళుగా మావులున్ బంట్లు వెళ్లుఁబొంక
నల్లిబిల్లిగఁ బయ్యెరపిల్లఁ డాడ
నల్లనల్లనఁ బిండారు లరిగి రపుడు. 69

క. పట్టాభిరాముఁ డచ్చట
బట్టబయలు బాటఁ దొలఁగి పఱచి నరసరా
ట్పట్టణమున కుత్తరమునఁ
దొట్టిన కాఱడవి దారి దొరకకయుండన్. 70

మ "గ్రహచారం బదిరా! సహోదరుని, భార్యన్ నాకుఁ బాపెన్ నను
గ్రహనిర్యాతు నొనర్చెఁ, గంటకమయోర్విన్ ద్రిప్పి మేన్ బుట్టము
న్బహుధా చీల్చె, దగన్ వగన్ గొలిపె, నబ్బా! డప్పి పెల్లుబ్బ ని
స్పృహ సంధించె, దయామయా! వరద! రావే! దీనసంరక్షకా! 71

మ. తొలిబా మేవిధిఁ బుచ్చియుంటినొ! ముహూర్తన్ జూచి పొమ్మంటినో!
కొల యిప్పట్టున ఘోరమై పెరిగి నాకున్ దాయమై డాసె, నా
కులపాటింతయు లేని నిన్నటి తెఱంగున్ నేఁటి భంగిం గనం
గలగుండున్ గొను మానసంబు, నిగమాంకా! దారిఁ జూపింపవే!

శా. దిక్కున్ మాలినపక్షినై యిటఁ గడున్ దీనంబుగా సుక్కి న
ల్దిక్కుల్ నాకు యిఁ దాము నందుకొని చింతింపంగ సాగెన్ వృథా
పెక్కారాటమటంచుఁ దెల్పుగతి, నీపేర్సెప్ప నెందేని నే
యిక్కట్లెని దొలంగిపోవలదె? తండ్రీ! శాంతి సంధిల్లఁగన్. 73

మ. అనినన్ "సత్యముసత్య"మంచు గగనవ్యాహారముల్ మ్రోఁగు పో
ల్కి నటన్ దాపునఁ దద్ధనార్తనినదాళిక్షుబ్ధమై పైకి లే
చిన నీర్కాక్కరగుంపుకూఁతలు చెవిన్ జేరన్ ముదాయత్తుఁడై
చని కాంచెన్ బలుపౌతటాకము నతిస్వచ్ఛాంబుసుశ్రీకమున్. 74

ఉ. చల్లనినీరుఁద్రావి సరసన్ గలవృక్షము నెక్కి నర్సరా
ట్పల్లజుదుర్గ మచ్చటికి దక్షిణమౌ దొకక్రోసుదవ్వునం
దుల్లసిలంగఁ జూచి పురుషోత్తము నాత్మఁ దలంచి మ్రొక్కి సం
ధిల్లినయుబ్బునన్, జనఁగఁ దేకువఁ జెట్టు దిగన్ దలంచుచోన్. 75

శా. ఆగ్నేయంబునఁ గూఁతవేటుడమురథ్యన్, మించుకొందళ్కు సం
లగ్నంబై నిగుడన్ ధరన్ గురియు వెల్లంబారు మబ్బోయనన్,
నగ్నాస్త్రప్రభలన్ దుమార మెగయంగాఁ బోల్చి "పిండారులా!
భగ్నం బౌనొకో! నాప్రయత్న"మని యప్పాటుండు సంరంభియై.

చ. ఉసుకుమసంబు నిబ్బరమె యూఁతగ దందడివాయ "సూర్యుఁ డి
ట్లాతు చరమాద్రిఁ గ్రుంకెను రిపుల్ చెలువానుగ రేయియెల్ల ని
క్కడఁ గడపన్ గలారు కడఁకన్ జని నర్సపురీశుసేనతో
దుసు కడరంగఁ జైఁబడక దొంగలపైకని నాకుఁ దీఱునే?" 77

మ. అనునిర్ధారణ మూని చెట్టు దిగి యందంద డాగుచున్ బెన్బొద
ల్లనకున్ మాటుగఁ దామసించుకొనుచున్ దండెల్ల నీర్లెంకిదా
పునకున్ జేరి గుడారముల్ బలుచుటన్ "బోరింక వీ"రంచు ను
న్నముఁడై పేటనుఁజేరెఁ బమ్మినడకన్ మైఁ జెమ్మటల్ గాఱఁగన్.

మ. ఎఱుకన్ గోటఁబ్రవేశమొంది నరసాధీశుండు కొల్వీయఁ దె
ప్పిఱి, పిండారులయాగడంబులుఁ జెఱల్ బీభత్సకృత్యంబులున్
గొఱ లేకుండ వచించి, క్రొత్తసేడమునన్ గొల్లంతయున్ గూడరా
వెఱపేమాత్రము నొంద కాఁగియుట సుప్తిన్ జెందుటల్ దెల్పుచున్.

మ. "కనులారన్ గనినాఁడ తేఁడ! దయచిక్కన్ రేఁగి పిండార్లొన
ర్చినఘోరంబుల గర్తశట్టణమునన్ జెప్పంగ నుంకింపఁ గ
న్గొనుఁ డిమే నెటులన్ వడంకెడినొ! మీకున్ మీప్రజాసంస్థకున్
బెనుముప్పున్ దొలఁగింతు రేని యిపుడే ప్రేలెందు దండింపఁగన్. 80

సీ. మసలుమానియులోన మాటాడనేరని
వారి ముంచిరి వేల్పుఁ బాఱఁగనుచు
సెలసి యిలాయిచుట్టలు మేన ముట్టించి
తోలి వ్రేలిరి "మేలుమే"లటంచుఁ
గొంపలఁ జిచ్చు దాఁకొల్పి యాల్మగల బి
డ్డల నందఁ ద్రోసి రవ్వాలఁ బొగడుచు
నొకనల్లపూస చిక్కకయుండ నూఁచము
ట్టుగ దోఁచి రెల్లమాటులుఁ గడంక

గీ. మారిమసఁగనో యుప్పెనవాఱెనో క్రొ
నాఁగఁ బురి పాడుబీడయ్యె నోగుణాఢ్య!
సంశ్రితావనవీర్యవిశాలహృదయ!
భూపచంద్రమ! పిండార్ల మూప లెమ్మ! 81

శా. నాతమ్ముం డెచటన్ గనంబడఁడు ప్రాణంబూని యున్నాఁడొ లేఁ
డో! తీఱెన్ వలయున్ మదీయసతి! యిల్లో! కొల్ల గాసిల్లనో
జ్ఞాతు ల్బంధులు మిత్రులన్ జెడక యుండన్ గల్గునే? యింక నా
కే తెఱవున్నది? యాకిరాతులను మాయింపంగఁదక్కన్ నృపా! 82

సీ. ఇల్లుగుల్లనొనర్చి యింగలం బిడిన యీ
కష్టులవసతులు కాలవలదె
కడుసౌమ్యు లగుప్రజన్ గాల్చిపేల్చిన యీ కి
రాతశరీరము లాఱిలవలదె
పచ్చనికాపురా ల్పాడొనర్చిన యమ
దూతలు ధూళిగాఁ దూలవలదె
కళకళలాడు ప్రో ల్గసిమసిచేసిన
వీరి గుడారముల్ వ్రేలవలదె

గీ. తోఁకఁజిచ్చానురిక్కనాఁ దుడిచిపెట్టి
రెన్నియో గ్రామముల వీరి నిప్పుడైనఁ
గాలకర్షితుల నొనర్పఁజాలకున్నఁ
గలదె కలయూరులకు నిరాకులత భూప! 83

శా. ధౌర్త్యంబున్ దోలఁగింప ధౌర్త్యమె కదున్ దక్షంబు, సిద్ధాసురా
మర్త్యాత్మైనతము పోరులన్ విజయసంపద్భాజులై రీక్రియన్
కీర్త్యావేశము రాజలక్షణము, లక్ష్మీప్రాప్తి సిద్ధంబు, మీ
మూర్త్యాబద్ధమనంబునన్ సిరి యటన్ బొంచున్ ధరానాయకా!

మ. మనకున్ మార్మసలంగ లేరను నహంభావంబునన్ రాత్రిఁ గా
ననసీమన్ జెనకంగ నెవ్వ రిటులనాఁ బోవ రన్నమ్మకం
బును నిండార సుషుప్తినొందెద రుపాంశుస్థానబుద్ధిన్ బరా
కునఁ బిండారులు గెల్వ తేలికగఁ జిక్కున్ రాజచూడామణీ!" 85

భు. అన నేలతేఁ డప్పు డౌఁగా కటంచున్
జనత్రాణదాక్షిణ్యసంజాతరోషం
బునన్ క్షీరవార్ధిప్రభూతాగ్నిపూరం
బునా రేఁగి సేనానిమోమున్ గనంగన్. 86

ఉ. అంతకు మున్నె బ్రాహ్మణునివ్యాసమునన్ గదనంపుటుబ్బు చే
నంతకతుల్యమూర్తియగు నాపృతనాపతి "చిత్ర"మంచు నా
క్కింతన సర్వసాధనసమృద్ధముగాఁ బెనుదండుఁ జేర్చి "ది
ష్టాంతముఁ గూర్తుఁ జోరుల" కటంచు నిగూఢతరప్రయత్నుఁడై.

శా. పాఱుండున్ దనతోడ రాఁగ ధ్వజినీపాలుండు పెన్సేనతో
గాఱున్ గంచెలు బీళ్ళుమిట్టలును బోకన్ జాటుసంధింపఁ గాం
తారంబందుఁ బులు ల్సివంగులో యనంగన్ బొంచి నిశ్శబ్దసం
చారంబొప్పఁగఁ జేరె నేర్పుకడిమిన్ సంకేతితస్థానమున్. 88

క. ఆవాహిని తస్కరలం
కావాసముఁ దగిలి పాయరై ముట్టి యెటుల్
పోవంగనీనిపొంగై
వావిరి ముంచెన్ బ్రవాహవైభవ మొప్పన్. 89

మం. కల్లుంగ్రైపొప్పఁగ వికలతన్ గ్రాలు పిండార్లగుంపుల్
తెల్లంబోవన్ రభసముడఱన్ దేజులన్ సాధనాళిన్
గొల్లన్ దాఁటించి నరసరాడ్ఘోరసేనాసమూహం
బల్లంతన్ దొంగలను వడి వెంటాడి చక్కాడెఁ బ్రౌఢిన్. 90

శిఖ. తెగెఁ జేతుల్కాళుల్ తెకముకగఁ బెన్దిప్ప లగుచున్
బుగుల్కొనెన్ నెత్రుల్ స్ఫుటితగళనిర్ముక్తి దొనలై
యెగుర్లన్ జెంగ్లోనా నిటునటుఁ దలల్ స్వేచ్ఛగొరలెన్
పగుల్కొనెన్ డొక్కల్ కటుతరరణవ్యాప్తిసచటన్. 91

శా. వాలున్ వ్రేట్ల శిరంబు లుర్లి కడఁ బైఁబైఁ జిందులన్ దూఁకు పెన్
గీలాలంబులు యోధగాత్రముల సంకీర్ణంబుగా వ్రాలి ర
త్నాళిస్థాపితవర్మముష్టులయి యుద్యత్సూర్యరశ్మిచ్ఛటన్
గీలల్గాఁ దులకించె ఖడ్గరుచితోఁ గేల్గల్గు విద్యుంబులన్. 92

మ. జయమున్ బొందు చమూపతిన్ గలిసి నర్సారాయునాస్థానికిన్
రయమొప్పన్ జని చోరనష్టసకలద్రవ్యంబు లేకాక యె
న్నియొ సత్కారములొంది యందలమున న్జేరెన్ సకేసోదరుల్
భయముల్వాసి కనంగ గర్తపురి నప్పట్టాభిరాముం డటన్. 93

ఉ. ఆయమరావతిన్ దెగడు నాయమరావతి వెంకటాద్రిరా
జ్ఞాయకుఁ డీయుదంతము వినంగనె పేరినిఁ బిల్వనంపి త
ద్ధీయుతు మేధకున్ ముదము దెప్పరమై విలసిల్లఁ గొల్వుచం
దాయనఘున్ మహాపదమునం దుపవిష్టునొనర్చె శిష్టుగన్. 94

చ. పరమశివాలయంబుదరి బావికి నీరముగోరివచ్చు వా
రరయుటకల్గి సాయమిడఁ బ్రాణము నిల్చిన భార్యతోడఁ గా
పుర మొనరించుచున్ సవనము ల్పొనరించి జగత్ప్రసిద్ధుఁడై
పరఁగెనతండు మంగయను బట్టిఁగఁగాంచి సుఖంబులబ్బఁగన్. 95

సీ. తనపుట్టుకకుమున్నె దత్తుగా జనకుండు
కైకొన్న శివరామఘనయశునకుఁ
దనదు పుత్రత్రయంబునఁ బెద్దవానిఁ బ
ట్టాభిరామునొసంగి యాగవర్త్మ
రుసహాసనంబునఁ బసకెక్కు శాసన
దీక్షితుండౌ పరదేశిసోమ
యాజి సీతారాము లనువారెపుడుఁగొల్చి
ప్రోదిఁగూర్పఁగ వాసిఁబొందె జగతిఁ

గీ. దండిపాండిత్యగరిమ యింతయును లోటు
పడనిప్రౌఢిమ కెల్లరు 'బా'గనంగ
దాత మంగయ్యశాస్త్రి విద్యాగురుండు
గృహము నిత్యాన్నసత్రమై రహిఁ జెలంగ. 96

గీ. క్రమత శివరాముపట్టాభిరామునకును
వారిపినతాతకుదుటిలోవాఁడనైన
నేను దత్తుండనైతి యిష్టానుపూర్తి
వినుతు తద్వంశకథ విను విశ్వనాథ. 97

క. ఇట్టులపుసూరిసభలం
దుట్టంకితగురుయశోమహుండు, ప్రథముఁడౌ
పట్టాభిరాముతమ్ముఁడు
దిట్టరి పరదేశియజ్వ దేశికకళలన్. 98

క. మృత్యుంజయుఁ డాతనిసుతుఁ
డత్యంతాగమపటిష్ఠుఁ డధ్వరి భక్తి
ప్రత్యయపూర్ణుఁడు మహితా
పత్యంబుల నిరువురన్ శుభంబులఁ బడసెన్. 99

సీ. వారిలో రాయపాధ్వరి మంత్రశాస్త్రవి
జ్ఞాతయై నిగమనిష్ణాతుఁడగుచుఁ
గాంచిన సుతులలోఁ గడవాఁడు వేంకట
సూర్యనారాయణుం డార్యనుతుఁడు
కర్మఠుండయ్యు సాంగ్లప్రాభవమునఁ ద
హశీలుదారుఁడై యశముఁ నొందె
ఈతని పినతండ్రియే నాదు జనకుండు
శ్రీరామభక్తివిశేషయుతుఁడు
మిగుల సాధుచరిత్రుండు మేటియొజ్జ
భూమిఁగొలుచుపనిన్ దొల్తఁబూని పిదప
బాలికాపాఠశాలాధిపప్రశస్తి
శాంతజీవనమున సౌఖ్యవంతుఁ డయ్యె. 100

చ. అనుదినదేవతార్చనములందును బర్వములందు భక్తిపా
హిని పరవళ్లువాఱ వెలయించు లయల్స్మరయించి రామనా
మనిరుపమానగానబహుమానితకావ్యకళాతరంగము
ల్మనుకలబంటెఁగూర్చి జగముల్ మఱచున్ మహితాంతరంగుఁడై.

ఉ. పోరులజాడఁబోఁడు నయపూతచరిత్రము వీడఁబోఁ డసం
స్కారులఁ గూడఁబోఁడు బయకారిపడంతులఁ జూడఁబోఁడు సం
సారమహారిషట్కవిరసంబులకున్ ధృతి వాడనీఁడు నీ
డేరును లేరు లేరు ఋజువృత్తిని పేరికి లోకమం దనన్. 102

ఉ. ప్రేమకుఁ బ్రాపు, శిష్యులకుఁ బెట్టినభిక్ష, ప్రసంగమందు ను
ద్దాముఁడు, సత్కథాకథనదక్షుఁడు, తీర్పరి, రాజభూతవై
ద్యామలకీర్తిశాలి, బహుశాస్త్రవిదుండును, సంఘకర్త, నే
నేమనియెంతు నీవెఱుఁగవే? పరమేశ్వర! తద్విశేషముల్. 103

క. ఈ బ్రాహ్మణునకు సతియగు
టబ్రమె? వరసాధుచరిత, యఖిలాండాద్వై
తబ్రహ్మేశ్వరి, యోగక
ళాబ్రహ్మసనవిధావిలాస, మహేశా!. 104

గీ. భర్తపట్టాభిరాముండు వైష్ణవాభుఁ
డాలి బ్రహ్మేశ్వరి సతీమహార్హచరిత
యఘటనాఘటనాదక్షుఁ డౌర! బ్రహ్మ
చిత్రచిత్రంబులన్ సృష్టిఁజేసి చూచు. 105

క. నాడీపరీక్షలోపల
నీడెవరున్ లేనికీర్తి నియ్యమ భర్త
న్గూడుకొని వైద్యయోగక
ళాడంబరమున మహార్తులన్ రక్షించెన్. 106

మ. "సతి రుద్రాంశలఁ బ్రీతిఁగాంచు" ననువిశ్వాసంబుచేనేమొ భ
ర్తతుపానున్వలెఁ గోపమూనఁ "బతి సత్వశ్రీకి మూర్ధుండ" ట
న్మతిఁగాఁబోలును సాధ్వి మాఱనక సంసారంబు సౌఖ్యానుసం
గతి సాగంగఁ జరించు నోర్చి బహుసంతానంబుఁ బ్రాప్తించియున్.

చ. హరిహరగీతము ల్బహురసాంచితము ల్పతిసల్పఁ దత్ప్రవి
స్ఫురణలగేయము ల్బహుళము ల్రచియించెఁ దదీయపత్ని యి
ట్టిరువురు భక్తియోగముల నేఁచి ప్రచారమొనర్ప శిష్యులై
పురుషులు స్త్రీలు నెందఱొ విముక్తిగడించి రనంగ వింతయే? 108

చ. గురుతరరాజవైద్యమున గొప్పతనంబునుబొందె భర్త, భా
ర్య రమణులొందు కాన్పువివరంబులలోని చికిత్సలందు నే
ర్పరితనమొందె "కుగ్గురు"ను "బాగుసెబా" సన, వీరిసేవచేఁ
బురుషులు స్త్రీలు నెందఱొ విముక్తిగడించి రనంగ వింతయే ?

మ. ఎవరేకష్టములన్ వచించినను సుంతేన్వార్తచేరన్ మహో
త్సవముం గూర్పఁగ సిద్ధమయ్యెదరు వీసంబైన మార్గోర కీ
ర్తివదాన్యోత్తములందు నెల్లరకు పోటిన్ భక్తితాత్పర్యము
ల్స్మవుపాటబ్రిమె ? నాఁడునాఁటికిని కల్మిన్ లో టదేల్లుండినన్.

సీ. వీరికిన్ బ్రథమకుమారుండు మృత్యుంజ
యాభిధుం డతులహాస్యమున దక్షుఁ
డనవద్యకవితావిహారియై త్రిపురసం
హారకృతి న్గాంచె భూరియశము
పితృభక్తి సుంత తబ్బిబ్బులేకయ పోస్టు
మేస్టరై తనలోని మేలిగుణము
లమరు పుత్రుని కవిన్ హాస్యవిదున్ బుచ్చి
పరదేశిసోమప్పుం బడసిమించె
రెండవకుమారుఁడైన కోదండపాణి
సబ్రిజస్ట్రారు బహుకావ్యచణుఁడు పుత్రి
కాద్వయంబును సుతుఁడును గ్రాల వెలయు
చున్నవాఁడు యశోభూతు లొప్పమీఱ. 111

చ. వరుస ముకుందరాముఁడనువాఁడు తృతీయుఁడు రామభక్తిబం
ధురుఁడు ఘనాంగ్లవేతనముతో విలసిల్లెడు పుత్రిపుత్రికా
గురుసుఖవంతుఁడై యతిథికోవిదనిత్యసమర్చకుండునై
సురుచిరగానశక్తి కొకసాంపిసు చక్రనికంఠ మొప్పఁగన్. 112

గీ. వావిలాలాన్వయమున శివావధాని
మున్నబున్నాంచెఁ బెద్దన్న పుణ్యచరిత
రాజ్యలక్ష్మి మహాభాగ్యరాజ్యలక్ష్మి
తల్లిమాఱుగ మాకెల్లఁ దల్లియగుచు. 113

గీ. ఈపె చెలియలు కామేశ్వరీపురంధ్రి
యాపురాణవేంకటార్యుయ న్వరించి
వారిదాత్మత కింకొక్క వన్నెఁ దెచ్చె
పుత్త్రికయుఁ బుత్త్రులిద్వరుఁ బోరిఁ గూర్చ. 114

క. వీరి కనుంగుందమ్ముఁడ
సారాద్వైతమునఁ దమినెసంగెడి వాఁడ
న్నేరి సమర్పింతు నమ
స్కారము శ్రీవిజయవాటికావిజయేశా!. 115

ఉ. ఓగురుమూర్తి! సర్వభువనోద్యమసత్ఫలరూప! సేవకో
ద్యోగములోనఁ జాఁబ్రతుకుతోవలఁ గుక్షికి నంతయింతరాఁ
గా గడనన్ దొడంబడి చికాకులఁ దాటితిలు నాకు నీకథా
భాగము నుంతఁ బల్కుకొను భాగ్య మొసంగితి గా కృపానిధీ! 116

చ. ఒకకవియాట పైఁబయిననున్నదె? భావముఁ దెల్పుకోలు పై
లికి రసపుష్టి కెట్లొ ముదలించిన నేనియు రేఫఱాలగో
లకు నఱసున్నలీలకు నలంకృతిమాలకు వృత్తహేలకున్
దికమక లేక పారదగతిన్ దగి వాక్కు వశంబు కావలెన్. 117

క. తృణమాదాయముఁ దీఱిక
క్షణమే యగుచున్న జీవికన్ భాషానై
పుణి గడన కెట్లు? కావ్య
పణములు మాదృశుల కందుబాటగునవి యే? 118

ఉ. రిక్తుఁడు రాజుఁ గాంచి విపరీతకుతూహలమూనురీతి నే
శక్తియులేని నేను కవిశౌండులఁ జూచి కృతిన్ గడంగితిన్
భుక్తియొ ముక్తియో యశమొ భూతియొ చూచెదఁ గాక నేఁటి కా
సక్తి నెట్లొ పూన్కికొనసాగి ఫలించుటె మోదమీనెడిన్. 119

చ. తగుమనటంచు భారవికృతంబయి యెందును నారికేళపా
కగరిమ సంస్కృతంబున వికాసిలు నీకథఁ దెన్గుసేతఁగా
దిగి కృతకృత్యతాస్మయపుఁదేకువ నీకవ్వగింటి కీకృతిన్
సుగుణ నొసంగినాఁడ నెటు జొబ్బిలు ప్రేమల నేలుకొందువో. 120

మ. ప్రతిబింబంబొకొ? ఛాయయేనొ? అదియు న్నాలేదొ? మిశ్రంబొ? జా
ను తెఱుంగో? సరసంబొ? కాదొ? గుణమానో? నాఁక, సర్వజ్ఞ! భూ
పతి గోపాలునికాన్కఁ గైకొను దయాభాగ్యంబు నోక్కింతచూ
పి తలిర్పంగదె, చిత్తశుద్ధియొగదా ప్రేమానుబంధాఢ్యమా! 121

ఉ. భారవిభట్టుజీవితము పైఁ గలగౌరవమూఁతగాఁగఁ ద
త్సారకథన్ గవిత్వపదసంగతముం బొనరించునాకుఁ జే
కూరదె వారికావ్యమునుఁగూడఁ దెనుంగొనరింపనంచు ధై
ర్యారభటిన్ దొడంగితి నయజ్ఞులప్రేరణ మేలిప్రాపుగన్. 122

మ. పసలేకున్నను ధీయుతార్యకరుణాప్రావృట్సుధాధారలన్
బస ప్రత్యక్షరసానుభూతి వెలయన్ బ్రహ్మప్రసాదంబుగా
సుసమర్థత్వముసంక్రమింపఁ బరమాశుప్రౌఢి (శ్రీ) భారవి
శ్వసనం బాంధ్రకళన్వహించె మురువెచ్చన్ మూఁడుమాసంబులన్.

ఉ. పాండితి సుంతలేదు మఱి పల్కుల కొంచొకవింతరాదు వే
ర్దండికి చింతకాదు కవితాకళ పైఁగల రంతుపోదు నీ
కొండను వంతుపాడెనఁగ దోయి! యొసంగెడి మంతునాది యే
కొండల చెంతచేదుఁ గయికొన్న సుఖంబె? దిసంతువాదెకా!. 124

శా. నీవు న్నాకృతిఁగోరియుంటివనఁగా నిద్దంపుతార్కాణ లె
న్నో? వర్తిల్లె నెఱుంగవే? సకలమందు న్నిల్చునీ వోగుణా
ఢ్యా! విన్నంతనె "బాగుబా"గను కవీశాస్యంబులన్ నీదువా
క్కే వాసించెననంగ సత్యమున కొక్కింతేని దూరంబొకో?. 125

శా. తా నాదెళ్ళకులాబ్ధిచంద్రుఁడగు మేధాదక్షిణామూర్తి యిం
దేనాఁడెంబు గ్రహించెనో వినిననాఁడే భ్రాంతభావంబునన్
దా నందందుఁగలట్టి దోసములపుంత ల్లూపి దిద్దింపఁగాఁ
బూనెన్ వ్యాజవిహీనుఁడై ; సుజను లెప్డున్ మేలె సంధింత్రుగా.

మ. వినినంతన్ గడుమెచ్చి ప్రేమతొలుకన్ వేమూరిశ్రీరామశా
స్త్రి నితాంతప్రతిభుం డనేకబిరుదశ్రీశాలి నావాణి ను
న్మనుఁడై పొంగు చుదారవాక్యముల నానందంబుఁ జూపించి యి
ట్లనియెన్ "నీకృతి యేరి కీఁదలఁచి తయ్యా! తెల్పు వీలున్నదే ?

గీ. దాని కే "నీశ్వరున కీయఁ దలఁచి" తనుచుఁ
జెప్ప ముఖసీమ మోదంబు చెంగలింప
"సాత్వికులబుద్ధి దైవసాక్షాత్క్రియాప
రంబు కావుటె యెట సహజంబుసుమ్మి. 128

చ "విజయపదంబు నీయభిధ పేడకయుండిన దానికర్థము
ల్విజయప్రతిష్ఠితేశ్వరుఁడు వేలుగఁ దానిడకున్న నేరిదుర్?
విజయకవీశ! సంస్కృతిని వేత్కృతచే జయకాములందఱున్
భజనలు చేసి మావిజయవాడకుఁ జేరి తరించుచుండుటల్." 129

చ. అనివిజయేశుపైఁ దనకు హత్తినభక్తిని బ్రోత్సహింప నా
కు నది సమంజసంబగుచు కొండొకసంతసముస్ఫుటింప హె
చ్చినకుతుకంబు మేఱ నినుఁ జేరి యొసంగెద ప్రేమపెంపునన్
గొనఁగదవయ్య శ్రీవిజయకోవిద! శ్రీవిజయేశ! యీకృతిన్.

ఉ. ఇంపున కిచ్చుమెచ్చుకొని యీకృతికన్యవరించి తెంపునన్
బంపితి రాయబారమును బ్రౌఢతరుండగు రామశాస్త్రిచే
జంపొనరింపనేల కయిసాచిగ్రహింపుము మంగళోక్తిమ
న్నింపుము హావభావపరిణీతకృతీద్యవధూవిలాసమున్. 131

ఉ. వర్ణము వృత్తమంచు బహుభంగుల నెన్నియొ పెండ్లికెంతు రో
కర్ణవమంతశాస్త్ర మదియంతయు నేఁ డొకతంతెయయ్యె, న
భ్యర్ణమయీవివాహ మిఁక నన్యము లెంచఁగనేల కన్య సం
పూర్ణకళావిలాసిని, యహోహాలె నీదెన వర్ణవృత్తముల్ ? 132

మ. అదిగో! సూరెల సూరికోకిలము లయ్యారే! పురే! పెండ్లి యం
చుదితానందముతోడఁ గూడుకొని నీవ్వారేగ దీవింతుర్, సం
పదనిండార నవోఢతో సుఖకళావ్యాసంగముల్మీఱ భూ
మి దివిన్ గిరితిపిక్కటిల్లఁ దమిఁ గొమ్మీ మోద మాతారమున్.

—* చంపకపుష్పమాల *—

హిమసుమదామముల్ రహివహిన్చి హితామరవార మారజం
బమర మణీమరీచిలత లగ్గలముల్ల దిశన్ దిశన్ దిమిం
దిమలు మహిన్ మనన్ స్తుతిఁ గృతి న్నతి నీకొసఁగన్ సరాసరిన్
విమలమహామనోజ్ఞవిధి విక్కవివేకముగోము నోముమిా ! 134

—* కందద్వయగర్భితచంపకబద్ధనాగబంధము *—

కనికరమున్ నిదాన మెసఁగన్ సరిభిల్లుఁడవై రణంపుసా
కున నరుదారుమానికము గోము రసమ్మునిగార మాభిము
ఖ్యనికరమున్ గనన్ నడిచి కాంచి రతిస్మరులూరఁగా నసిన్
మనవెరవుండ గానిడవె మావెరపుర్దిగ జేరు శాంతి వే. 135

—* గర్భితకందములు *—

కరమున్ నిదానమెసఁగన్ సరిభిల్లుఁడవై రణంపుసాకున నరుదా
నరుదారుమానికము గోము రసమ్మునిగార మాభిము ఖ్యనికరమున్
కరమున్ గనన్ నడిచి కాంచి రతిస్మరులూరఁగా నసిన్ మన వెరవున్
వెరవుండ గానిడవె మావెరపుర్దెఁజేరు శాంతి వే కనికరమున్.

సీ. హాయ్యంగపీనసామ్యాంత రంగుఁడ ! నీకు
రాద్రిముద్రామహోన్నదri! నీకు
కరమయోగాభ్యాసపారంగతుఁడ ! నీకు
దారుకావనరసాధార ! నీకు
కామహారి ! నీకు కంజధారి ! నీకు
గౌరీసురాపగాకలిత ! నీకు
విజయనగావాస ! విజయావనా ! నీకు
సత్సుధాకలితదృగ్జాల ! నీకు
భవ్యకృతి దీనినర్పింతుఁ బరమభక్తి
నవధరింపఁగదయ్య ! నీదైనలీల
నాఁటిభారవిసంస్కృతపాటవంబు
తెనుఁగునన్ విన్నవించెదఁ దెలిసినంత. 136

# శ్రీమదాంధ్ర

# కిరాతార్జునీయము

## ( భారవి )

### తృతీయ భాగము

## మొదటి సర్గము

శా. శ్రీదైవారెడిరాజరాజధర లక్ష్మిన్ దత్ప్రజావృత్తిఁ గ
న్గో దీక్షన్ వటుభూమికన్ మెలఁగుచున్ గూఢార్థము న్గాంచి యా
యాదృష్టంబు శ్రుతంబుఁ దెల్ప నలద్వైతారణ్యమధ్యంబునన్
దా దర్శించె యుధిష్ఠిరున్ వనచరోత్తంసుండు బద్ధాంజలిన్. 1

ఉ. ఆసమయంబునన్ బ్రణిధియాస్యమునందు వితర్కనిశ్చయో
ద్భాసకభావవీచికలు పర్వ యుధిష్ఠిరు డాయుచో నరుల్
మోసముఁ జేసి కొన్న సిరిపొందిక వాస్తవమున్ వచింప; సం
తోస మొసంగునంచు విహితుండు ముఖస్తుతి రజ్జులాడునే. 2

చ. "అరిఁ బరిమార్పఁగల్గు టెపుడా"యని, "యేమొనరింతు"నంచుఁ దాం
దరపడుభూపతిన్ మఱుఁగుతావునఁ జేరి యనుజ్ఞ నొంది యు
క్తిరచనఁ బొందు నర్థబలదీప్తి హొరంగుఁ బ్రమాణశాస్త్రబం
ధురతకు విందుగాఁ బ్రణిధి దొడ్డనుడిన్ వచియించె నిట్టులన్. 3

మ. మనుజేంద్రా! భృతిపెంపు క్షేమమును నాత్మన్ గోరువాఁడౌటచేఁ
బనులన్ వేగరి చారచక్షు నృపతిన్ వంచింపఁగాఁ బూనఁ డిం
పు నిసంధించుసువార్తయే కలుగ దెప్పున్ జింత్యమైయున్నఁ గా
వున మంచిన్ జెడు గన్ని నానుడి నసంపుష్టంబు మన్నింపుమా.

మ. యజమానున్ దగురీతి దిద్దనియమాత్యత్వం బదేపాటి ? స్నే
హాజమంత్రింబున మేలుఁగాంచనిన్నృపుం డాతండు నేపాటి ? రా
జ్యజయోత్పాదకభూరిసంపదలు తామై చేరుఁగాదే కడున్
నిజమౌ పొందిక కూరిమిన్ వెలయుమంత్రిన్ మానవాధీశ్వరున్. 5

గీ. సహజదుర్గమ మగురాజచరిత మేడ ?
జ్ఞానవిరహితమాదృశజన మదేడ ?
కలనె గూఢారిషాడ్గుణ్యకలన మెఱుఁగఁ ?
గాంచుకొంచెము మీకృపన్ గలుగుఫలము. 6

గీ. అడవిపా లైతి రీరు రా జయ్యెఁ దాను
గాని మీవల్లఁ గీడు శంకఁగొని యునికి
కతన దుర్ద్యూతవిజితజగంబు ధర్మ
పరతచే నిల్పుకొన మేలుపాటుఁ బడెడి. 7

చ. చెడుగులఁ గూడి నిన్ను గెలిచెన్ గొనె రాజ్యముఁ గౌరవేంద్రుఁడి
ప్పు డనువు మేలిపాలనముఁ బూని నయోన్నతిఁ గూడ గెల్వఁగాఁ
గడకఁ జరించు; లబ్ధరమఁ గావఁగ దుష్టులచెల్మికంటె న
క్కుడుగద స్పర్ధ సత్పురుషకోటులతోఁ బురుషార్థసిద్ధికిన్. 8

మ. మనుధర్మంబుల శ్రద్ధతో నడపు సమ్మాన్యావనీనాథులం
దనఘుం డీఘనుఁ డన్నకీర్తిఁ గనఁగా నాసించి షడ్వైరిశా
సనుఁడై రచ్చకు రేఁబవ శ్యనువృత్తై సంధిల్ల భాగించి పా
ల్పు నయం బొప్పఁగఁ బౌరుషక్రియల నాభూజాని సాధించెడిన్. 9

గీ. సేవకుల మిత్రులట్ల రంజించుఁ బ్రీతి
మిత్రులను బంధులట్ల కామించి తేర్చు
బాంధవుని దుల్యరాజన్యభాతిఁ జూచు
గర్వకపటంబులకు లోనుగా కతండు. 10

గీ. కడఁగి యొనరించుధర్మార్థకామగతుల
గుడుసువడ దాతనిమనంబు కొంచెమైనఁ
బక్షపాతంబు విడి సమవర్తి యగుట
చేఁ ద్రివర్గంబు లొంటొంటిఁ జెంది వెలయు. 11

గీ. ఈవిఁ జూపని సాంత్వన మొనయఁ జెప్పుడు
నాదరణలేని యేదానమైన నీయఁ
డధికసత్కృతి గుణహీనునందుఁ జూపఁ
డతఁ డుపాయజ్ఞుఁడై రాజ్యహితముపొంచె. 12

గీ. ధర్మము నతిక్రమించినఁ దనయుఁగాని
పగతుఁగాని గురుప్రోక్తభవ్యశిక్షఁ
బఱపు లోభకోపంబులఁ బట్టువడక
నిర్జితేంద్రియుఁడై రాజనీతి వలచి. 13

చ. వికలులు గాక శాత్రవుల స్వీయులఁగా నొనరింపఁజాలు వా
రి కలిమి మెంతు, నమ్మఁ జెవరిన్ మనసిచ్చినయట్లు దోఁచు, నొం
డ్లకుఁ గలతల్ ఘటించి స్వబలంబును బెంచు, సమర్థులైనసే
వకులకుఁ బ్రాప్తసిద్ధి సిరిఁ బాలిడి ప్రేమ విభూతిఁ జేర్చెడిన్. 14

గీ. వారివారికిఁ దగినసత్కార మొసఁగి
యుచితగతిఁ బనిఁ గొనునేరు పొనరియుంట
నతనిసంపద స్థిరమై మహార్ఘ్యఫలవి
శేషదాయకమగుచుఁ బ్రసిద్ధి నొందు. 15

ఉ. రాజులు వాజులున్ రథపరంపరలున్ గడు మూఁగియుండు త
ద్రాజసభాగృహాంగణపదంబులఁ గానుకగా ధరావతుల్
భ్రాజితభక్తి నిచ్చుగజవారమహోత్కటదానధారలన్
రాజిలు సప్తపర్ణమధురచ్ఛదభవ్యసుగంధవాసనల్. 16

లయగ్రాహి॥ కేవలము వర్షములపై వెలయఁబోని పెను
జీవనము లుండుటఁ గృషీవలులఁగష్టం
బేవలన లేక దునకే విరిసి పండునటు
లై వెలయుఁ బైరు లెపుడే విరివిగాఁగన్
గావునఁ గురుప్రజలకైవసములై సిరులు
లావొసఁగ నానృపునిచేవ యనదానే
భూవర! చిరప్రతిభతో వరలువృద్ధి నిఖ
లావసరముల్ కళలతో విడిసియుండున్. 17

చ. ధనదసమానసంపద నుదారయశోనిధి జాలిగుండెవాఁ
డనుగ నటన్ సుయోధనుఁడు టొంపులు పోఁకనిజాగరూకతన్
బనిఁగొని కావ నీతికటుబాధలు లేమికి నార్ద్రయై ధరా
జనని సమస్తసంపదలు జల్లుఁగఁ జేసి తనంత నీనెడిన్. 18

సీ. అతిబలశ్రేష్ఠులు నభిమానధనులుఁ బు
ష్కలధనంబులఁ దుష్టిఁగనినవారు,
శస్త్రోపజీవులు సమరంపుఁగాకల
నారితేరినమహాయశులు ఘనులు,
స్వార్థపరులు గాని శౌర్యసంపన్నులు
స్వామికి ద్రోహ మెంచనిమహాత్ము,
లాసుయోధనునకై యసువులనైన న
ర్పించి మేలోనఁగూర్ప నెంచువారు,

గీ. నేను నే ననుమేల్స్వార్థఁ బూని యధిపు
మన్ననకు నెప్పు ముందంజ మలయువారు
వానిరాష్ట్రంబుదశదిగ్వితానములను
బలువు రున్నారు బహుళసంపదలు పొదల. 19

గీ. రాష్ట్రమును దిద్దుకొని యన్యరాజకృతుల
నమ్మఁదగువేగు తెలుప నంతయు నెఱుంగు
బ్రహ్మవ్రాలట్టు లతనితంత్రములగుట్టు
ఫలసమాప్తిదాఁకఁ దోఁపనిదిసుమ్ము. 20

శా. చాపం బెత్తఁ డొకప్పుడైన నెపుడున్ జ్యావల్లి సంధింపఁ డే
కోపం బాస్యముపైనఁ దేఁడు, గుణసంగుల్ గౌరవం బుంచుచున్
భూపశ్రేష్ఠులె వానిశాసనము నెప్డున్ మౌళిపైఁ దాల్తు రిం
పౌ పూదండను శీర్షమం దునుచునట్లై రాజకార్యంబులన్. 21

శా. ఆదుశ్శాసను నాత్మయౌవనమదవ్యగ్రున్ గఠోరాజ్ఞునిన్
సోదర్యున్ వరయౌవరాజ్యపదవీశోభన్ బ్రతిష్ఠించి య
జ్ఞాదిన్ బ్రౌఢపురోహితాజ్ఞఁ గాని సమ్యగ్రీతి నుత్సాహియై
మోదంబొప్ప యజించు నాహుతులఁ బెంపున్ గూర్చి వైశ్వానరున్.

గీ. చతురుదధివేష్టితావనీశత్వ మొంది
యెదురులేని రాజాధిరాజీతఁ డనఁగ
స్థిరత నొందియు మీరాక చింత వనరుఁ
దెగనిబలియురపగ గుండెదిగులు గాదె. 23

గీ. నీపరిసంగంబు జనులలో నిగిడినంతఁ
బ్రబల మగుక్రీడి పృథుపరాక్రమము గుండె
లవియఁ జేయుంగఁ దలవాల్చు నధికభీతి
గారుడము విన్న ఫణి ఫణాగ్రంబుభాతి. 24

ఉ. కావుట నెద్దియే న్గపటకల్పన మి మ్మలయింపఁజూచెడున్
గావున శత్రువర్తనముఁ గార్యములున్ విని యెంచిచూచి యా
లా వటుఁగాఁ బ్రతిక్రియ విలంబన మూనక సేయుమయ్యా! వా
ర్తావహనంబె మాదృశవిధానము వైకృతి మీ యధీనమే. 25

గీ. వనచరాగ్రేసరుం డిట్లు పలికి మేలు
పసదనం బంది వెడలినఁ బాండు నగ్ర
తనయుఁడును ద్రౌపదీగృహాంతరముఁ జొచ్చి
సకల మెఱిఁగించెఁ దమ్ములనికటమందు. 26

—* ధర్మజునకు ద్రౌపది హితోపదేశము *—

ఉ. ద్రౌపది వైరిపెంపు విని తాఁ బలికెన్ మును ధార్తరాష్ట్రరా
జాపశదుం డొనర్చినమహాపదలున్ గురురాణ్మహాసభా
వ్యాపృతి రాజసూయసవనావభృథస్నపనాతిపూతకే
శాపహృతిన్ ఘటించినయనర్థము ధర్మజురోష ముబ్బఁగన్. 27

చ. వనిత స్వతంత్రయై తెగి భవాదృశపండితసన్నిధిన్ వచిం
చిన దెదయేన్ దిరస్కృతిగఁ జెల్లు టెఱుంగుదు శాసనంబు నై
నను నరిదుష్కృతుల్ మనమునన్ బడి ప్రియ్యుడ వాఁగలేక యి
ట్లనియెద, సాధ్వి కిట్టి దసదైన క్షమింపు నమస్కరించుచున్. 28

శా. మీ వంశంబున నింద్రతుల్యు లగుభూమీనాయకుల్ దీర్ఘకా
లావిచ్ఛిన్నవిభూతి నేలిరొను రాజ్యం బిట్లు చేసేతులన్

బోవఁ బీడితి రీవు, మత్తకరి పూవుంబో ల్విసర్జించు నా
తేవఁ, గ్రిమ్మఱఁ గైకొనన్ దగినధాత్రిన్ గల్గు టం చెంచెదన్.
గీ. మాయదారులదెసఁ దాను మాయదారి
కానిమూఢున కగునవమాన మెపుడు
కంకటము లేనిమైఁ జొచ్చుకఠినశరము
గతి శరుఁడుఁ గాఁడె ప్రాణవిచ్యుతికరుండు. 30
చ. అనురతసాధనంబు, కులమం దభిమానము, ధాత్రి మున్న యే
జనపతి-తాము దక్క— కులజన్, గుణసక్తను, జిత్తహారిల
క్ష్మిని, నిజభార్య నట్లు పరిశీలనఁ గావక యొండ్లచేతులన్
దనకుఁ దనంతఁ బోవిడిచి తాలిమి నిల్పఁగలండు భూపతీ. 31
ఉ. వీరుల కేవఁ గొల్పు చెడువీథికిఁ ద్రొక్కడియుండుమీాహృదిన్
ఘోరరుషానలంబు దరికొందె? దహింపదె? యెండుజమ్మికిన్
బారిన దావవహ్నివలెఁ బ్రోద్ధశిఖాప్రచయంబుఁ గొల్పదే?
యీాఅనిచిచ్చు లోన వెలయన్ గుములన్ దలకొంటె భూభుజా!
గీ. నిగ్రహానుగ్రహసమర్థ నిశితకోప
సరళికిన్ లొంగు స్వయముగా జంతువితతి
కోప ముడిగినవాఁ డిటు కొలుచుజనుల
నటు విరోధుల యాదర మంద లేఁడు. 33
సీ. సమరాంగణంబుల జవనహయాంచిత
గురుతరస్యందనకోటు లందుఁ
బ్రస్ఫురదాహితాగ్నిస్ఫారతేజంబు
తో గుండె లవియంగఁ దోఁచువాఁడు
నేఁ డద్రిగుహాలలో నీచస్థితిని ధూళి
ధూసరం బగుమేనితోడ, రక్త
చందనాంకముఁ దాల్చి సగము సచ్చినరీతిఁ
గాల్నడన్ దిరుగ నక్కసము లేదె?
గీ. గిరిరథము, రక్తచందనాంకితముఖంబె
యగ్ని తేజంబుఁగాఁ బొంటిపోయి తనకు

నిలిచెనని తృప్తిఁబడునొక్కొ? కలఁక వీడి
యరిభయదకేలి, భీముఁ డహంబు మాలి. 34

సీ. అద్వితీయపరాక్రమావేశమున ఘోర
సంగరరంగస్థలాంగగతుల
సవ్యాపసవ్య భాస్వజ్జ్యానినాదముల్
భూనభోంతరముల బోరుకొలుపఁ
బ్రళయమేఘాసారపటిమ శిలీముఖ
వర్షముల్ పఱపి తీవ్రింపుటలుక
నుత్తరకురుభూము లొక్కమ్మడిగ గెల్చి
హేమరాసులఁ దెచ్చియిచ్చె నాఁడు
గీ. నేఁడొ? ఋషిశిష్యుఁ డగువటునియతి మీకు
గుడ్డ లారిచి యిచ్చెడిఁ గుత్సితవిధి
శక్రసముఁ డైనయాధనంజయుఁడు, దీని
కైన మీమది గోపంబు నూనవలదె? 35

క. నవకోమలాంగు లీకవ
లు వనాంతరకఠినశిలలలోఁ దను వవయక్
సవు రతి శిఖ కటిఁ బడఁగ న
డవి యేన్గు లటుండ ధృతిఁగడంగెద రవురా. 36

ఉ. ఇంతటిదుర్దశన్ ధృతి వహించెద రేమని మీతలంపొ! మీ
స్వాంతము వృత్తి యబ్బుర మసాధ్య మగమ్యము, ముల్లు సోఁకువం
తంతయుఁ జింత యేర్పడ దహా! కఠినాపద లిట్లు మిమ్ము నీ
క్రింతలఁ ద్రిప్ప నాదుమది క్రచ్చుటి బ్రిద్దలుగాఁగ వ్రీలెడిన్. 37

సీ. అభినవవికసత్సుమారామపరివృత
ప్రాసాదసురుచిరాభ్యంతరముల
హంసతూలికలఁ దూఁగాడునూయెలలలోఁ
బవళించి యిరుగడ బహుళగంధ
పరిషిక్తవీజనల్ పరిచారికలు వీవ
హాయిగా నిదురించి రేయిఁ గడపి

వైతాళికోద్గీతవంశకథాస్తుతి
మంగళాదుల నిద్ర మాని లేచు

గీ. మీర లందఱు శిలలపైఁ గారుకుఱకు
దర్భపైన శయించి యుత్తటి శివారు
తంబుల నె మేలుకొనుట కెంతయును వగపుఁ
గినుక మది రేఁగు నెట్టులు మనెడిదాన? 38

చ. పలుచవు లుష్ణతిల్లు రసబంధుర మన్నము బ్రాహ్మణప్రసా
దలలితమై యొసంగి శ్రమదంబు లొసంగఁగ నారగించు మీ
ర లిటులు వన్యమూలఫలరంజితులై పడియుంట మీయశో
విలసన మట్లు దేహములుఁ బెంపఱ నోర్చెద నెట్లు భూవరా! 39

చ. మణిమయపీఠికాళి నృపమండలమౌళికిరీటచారుతో
రణజచిరత్నరత్నరుచిరంజితతావకపాదపద్మముల్
వణకుచు వన్యసత్త్వమునివల్లభసంతతఖండితాగ్రముల్
తృణములు దర్భ లుండు వనదేశముఁ ద్రొక్కుట కెట్లుసైఁచెదర?

ఆ. వైరికృతము గాక భగవద్విధానమా
పాటు పీరుఁ డుత్సవముగఁ గాంచు
నీవిపత్తు శత్రుకృత మాట రోసంబు
పెల్లు నామనంబుఁ బెల్లగించె. 41

ఆ. శాంతి వదలి మారల శౌర్యంబుఁ బాటించి
యరులఁ జంపఁ గరుణ నాజ్ఞ నిండు
పగఱ శమముతోడఁ దెగి సిద్ధిఁ గొన భూమి
పతులనా నిరీహ యతులఁ గాక? 42

గీ. తేజమున మిన్నలై కీర్తిదీప్తులైన
వారు మీబోంట్లై యిట్లు దుర్భరపరాభ
వాగ్నిశిఖ శాంతి వరియింప నయ్యొ! నిలువ
నీడ లే కభిమానంబు నీల్గ దెట్లు? 43

ఉ. రాజకులోచితం బగు పరాక్రమము న్గొను తెంపు లేనిచో
నీజయలక్ష్మిచిహ్నితము లిందఱుఁ గార్ముకముల్ త్యజించి వి

భ్రాజితపావకాహుతుల భక్తి యజింపుఁడు మానివృత్తి; నే
లా? జడతన్ బ్రభుత్వమున కవ్వల ముక్తికి రెంటికిన్ జెడన్. 44

శా. ఆహా యెక్కడ లేదు? గెల్పుఁగొన రాజ్యప్రక్రియన్ సంధిత
వ్యాహారంబుల రంధ్రము ల్గనుటకే స్వార్థావాప్తిఁ బెంపొందుటల్?
బాహాటంబునఁ జాటఁ గండముల నుత్పాదించుశౌర్యంబు నెం
దేహంపీరుఁడు సైఁచు? మాముఖములందే ప్రాప్తము వ్యాప్తనే. 45

ఉ. ఎండయు వెల్గు మాయ సమయోచితసద్విధి సద్ధిఁ గ్రుంకియున్
వెండి తమంబుఁ జెందురవిఁ బ్రొద్దుటితో దినలక్ష్మి చేరున
ట్లుండఁ దొఱంగి పెన్నకథ మారయ నుగ్రవిపత్తులందు ని
ట్లుండిన మిమ్ము రాజ్యరమయున్ మరలన్ వరియించుఁ గావుతన్. 46

---

# రెండవ సర్గము.



పంచ. హితోపదేశమై మహార్థహేతుయుక్తమై మనో
హితానుసారమైనసప్రియోచితంబు యోగ్యమన్
మతిన్ వృకోదరుండు రాజమాళితోడఁ బల్కె యు
క్తితర్పితం బుదారసారదీపితంబు వాక్యమున్. 1

ఉ. క్షత్త్రకులాభిమానవతి చాన సమస్తముఁ జక్క నెంచి స
న్మైత్రి చెలంగ దేవగురుమానము మించిన మేలివాక్కు స
ర్వత్ర మహాద్భుతంబుగ నవారితమాగతి నొప్పఁబల్కె నే!
పాత్రము శాస్త్రబద్ధము శుభప్రతిపాదకమై యెసంగఁగన్. 2

స్ర. గంభీరావర్తనక్రగ్రహణభయసమాకాంతకల్లోలదుఃప్రా
రంభం బంభోధి దాఁటన్ బ్రబలుఁడును ఘనత్రాసమున్ జెందునట్లే
సంభావ్యానేకసంధిశ్రమయుతకటురాజ్యవ్యవస్థార్థనీతిన్
శుంభత్పాండిత్యశౌండుల్సైర వెఱతురనంజోద్యమీయర్థవాక్కుల్.

చ. ఘుటిక యొకింతయే యయినఁ గోటిగుణంబు గుణంబు పథ్యసం
కటమున కేమి? యుక్తి సతి కర్జముగాఁగ వచించుసూక్తి ని
క్కటముగ రాజ్యసంపదలఁ గొల్చఁగఁ జాలినదాట దాన నొ
క్కట నొకయింతయుద్ధమును గల్గిన నేమగు గ్రాహ్యమౌఁ జుఁడీ!

ఉ. త్వాదృశపండితు ల్గుణహితప్రవణు ల్గద; లోకమందు "బా
లాదపి" యన్నసూక్తి ప్రబలంబ సుసంగత మైనన్యాయని
ష్పాదన మూను స్త్రీజనవచస్తతులన్ గ్రహణాతియోగ్యముల్
పైదలివాక్య మర్థరసబంధురమౌటఁ బ్రపంచనీయమౌ. 5

ఉ. కొట్టినపిండ్లు మీకు నృపగుహ్యచతుష్కళ; లెందు కట్టి సం
ఘట్టనలన్ వివేకమునఁ గ్రాలు భవన్మతి నిండువాఁడిఁ జే
పట్టినమేల్మి; నో నృపతిభాస్కర! నేఁడిట రొంపిఁ జిక్కి యు
ట్టిట్టనలేని హస్తిగతి నిట్లు కలంగి నశింప నేటికో? 6

గీ. దేవతలుఁగూడఁ బొగడెడు నీవిధిజ్ఞ
వృత్తి నిటఁ గొద్దిపగఱ నికృష్టచర్యఁ
బురుషకారంబు నశియించిపోయెనేని
నింతకంటెను గష్ట మింకెద్ది కలదు? 7

గీ. అరులసంపద తుదిఁ జెడునట్టిదైన
నైఁచు విజ్ఞుం డొకప్డేని నైఁపఁబోఁడు
కడకుఁ బెంపిడుతాత్కాలికక్షయంబు
నదనుఁ గని నైఁచుఁ బ్రతికృతి నాచరించు. 8

చ. కుశలుఁ డుపేక్ష సేయుఁ దనకొంచెపుదుర్గతి శత్రుఘోరదు
ర్దశ కవలన్ గదున్ దడవుగల్గ జనించు టెఱింగెనేని; నా
కృశత తొలిన్ ఘటిల్లఁ దనకేనని తోఁచినఁ దత్క్షణంబె త
త్ప్రశమనకృత్యమున్ సలుపు; పార్థివ! యీమనపాటు సహ్యమే?

వృత్తము. సకలవిధముల శాత్రవుఁడు బలశాలియై పెనుపొందఁగా
వెకలులగుచు నుపేక్షఁ గొను పృథివీపతు లెవ్వడ కుందురే?
ప్రకటశుభగుణరక్ష వెలసెడు రాజ్యలక్ష్మి త్యజింపదే?
వికలమతులయి విలుకడఁక వివేకమెఱుఁగనిమూఢులన్. 10

ఉ. ఏవిధిచేతనో యొకట హీనత నొందినదైనఁ దెంపు స్వా
భావిక మైనయుత్సుకతఁ బాయనినిష్ఠురకార్యదక్షుఁడే
నావిభునిన్ బ్రజల్ గడు సహాయ మొనర్చి సముద్ధరింతు రే
త్రోవనొ పూని శుక్లశశితోఁడగు భూత్యభివృద్ధి యొప్పఁగన్    11

గీ. చారుసప్తాంగవృద్ధికిఁ గారణంబు
భవ్యపంచాంగనిర్ణయపటిమ సూవె
దైవనియతిని జనులట్లు తద్బలంబె
పనుల సమకూర్ప దక్షత ననుసరించు.    12

ఉ. ఉన్నతముల్ బ్రియంబునయి యొప్పుమహాపద మొందఁగోరు శా
త్ర్యోన్నమితాభిమాని పతనోగ్రితఁ బాపఁగ నాత్మశక్తిసం
పన్నతయున్ స్వయంకృషియె పట్టని నమ్మును; తాఁడి నెక్కువా
రి న్నగయుంతు రెందనుక? భృత్యభృతుండును శౌర్యవంతుఁడే?

ఉ. విక్రమహీను నాపదలు పెల్లుగ సోఁకు; విపన్నభావికా
లక్రమమెల్ల వక్రమగు; లగ్గలువాని కగౌరవంబు ని
త్యాక్రమణంబున్ ముసురు; నట్టినికృష్టుని రాజ్యలక్ష్మి యెం
దేక్రియ మెచ్చి కోరు నొకయింత హసించి తొలంగకుండఁగన్    14

గీ. ఉన్నతికిఁ జేటుఁ గూర్చునుద్యోగశూన్య
జడత చాలును జాలును జాలునయ్య
పటుపరాక్రమలభ్యసంపత్సమృద్ధి
చెడి నిరుత్సాహు లగువారిఁ జేరునయ్య?    15

క. సమయావధి చనునంతకు
శమ మూనుద మన నరేంద్రసంపదఁ జిరకా
లము రుచిఁ జూచి సుయోధనుఁ
డమరించునె మనకు? వానియనయ మెఱుఁగమే?    16

గీ. కాదు, తనయంతనే వైరి నీదురాజ్య
మంతయు నొసంగు ననుకొంద మపుడు జగము
లెఱుఁగు మాభుజపుష్టి కహీనపౌరు
షంబునకు నుంతయుఁ బ్రయోజనంబు కలదె ?    17

చ. స్వయముగ మన్నిగొన్నగజసారమదాంచితభూరికుంభసం
చయములఁ గాదె వర్తనము సల్పు మృగేంద్రము? శూరలోకసం
తయుఁ దనదీప్తికిన్ లఘుతఁ దాల్పు మహాపురుషుండు కీర్తిసం
క్షయముగ ముండబత్తెము మెసంగుచు నన్యభృతిన్ జరించునే?

త. జని క్షణాత్మక మానుషంగికసంపదల్ ఘనతుల్యముల్
మనుఁ జిరంబుగఁ గీర్తి యొక్కటె; మానియా పృథివీశ్వరుం
డనయ మన్యనృపాలశౌర్యభయావహం బగు నిత్యకీ
ర్తిని వరించును గాని యుద్ధగతిన్ ద్యజించునె జంకునన్. 19

గీ. బూడిదను గాలుసేతులఁ బోగుఁజేయు
జనుఁడు మండెడువహ్నిని జెనకఁజనఁడు
మాని సుఖముగ దేహంబునైన వదలు
శౌర్యసంపచ్ఛరీరంబు జార్చుకొనఁడు. 20

చ. ఉదుటున మిన్నుముట్టెడుపయోధరపంక్తులఁ జూచి మించుటు
న్మదమున మాఱుగర్జనల మార్కొన రేఁగు మృగేంద్రి మేటికో?
యెదుటియశోవిశేషము సహింపమి యొందుఁ బ్రతాపదీప్తి కా
స్పదు లగువారినైజ మనవద్యమహోత్కటకీర్తిఁ గోరుటన్. 21

గీ. మీ నిరుత్సాహమునఁ బూన్కి మిడుకకున్న
నింత కరులు విపత్ప్రాప్తి వంతఁ గనరె?
మాంద్యముఁ ద్యజించి గురువిక్రమప్రకర్ష
కుత్సహింపుఁడు విహితజనోత్సవముగ. 22

స్ర. ఆశామత్తేభముల్ 'ఛీ' యనుచు నిజకరన్యాసతన్ దాఁకుప్రోల్తి
న్నాశంబున్ గూర్చుతీవ్రోన్నతగతి వెలయ న్వచ్చునాల్గబ్ధులో నాఁ
గా శక్రోరుప్రతాపుల్ ఘనులు నలువు రుగ్రంబుగా నీడుతమ్ముల్
పాశాదుల్ దాల్చి చెండన్ బరులు రణమునన్ బార కేరుండువారల్

గీ. అరికృతావజ్ఞ మీహృదయంబునందుఁ
బ్రజ్వలించినక్రోధాగ్ని పరవధూరు
నేత్రనిర్యదమంగళనీరపాత
ములఁ బ్రశాంతిని బడయంగవలదె చెపుము. 24

—* ధర్మజుఁడు భీమునకుఁ గ్రోధోపశమనంబుఁ జేయుట. *—

ఉ. మత్తగజేంద్రయుగ్మము౯ గ్రమత మావటివాఁడు శమింపఁజేయు న
ట్లుత్తఱిఁ గోపఘూర్ణితు మహోత్తరమన్యువశీకృతఘోరవా
గ్వృత్తుని వాయుపుత్త్రుఁ బృథివీపతి సాదృతి శాంతమానసా
యత్తు నొనర్చెఁ బల్కి బహుళార్థరసాయనభవ్యమాధురి౯. 25

చ. మసకలు లేక పైమకిల మాపినయద్దమునందు బింబము
ల్లసకలసత్ప్రమాణకము లోపము లేనిసమగ్రసౌష్ఠవ
ప్రసరకమై మనోజ్ఞరసబంధురమంగళసూచకంబునై
యెసఁగుత్వదీరితోక్తి భవదీప్సితము౯ వెలిపుచ్చె నిమ్ముగ౯. 26

గీ. విశదపదమై మహార్థసంవేష్టితమయి
మహితసందర్భశుద్ధితో మలసి, యొందు
నేని బునరుక్తి వ్యర్థోక్తి లేనియట్లు
పల్కితి సమర్థహితవాక్యపటిమ మెఱయ. 27

గీ. యుక్తినిగమావిరోధంబు నొప్ప నిట్లు
శ్రౌతవిహితపరిసంగంబు సలుప నున్న
యున్కి నెవ్వని కగు? నీదుయోజనలకుఁ
దమ్ముఁడా! మెచ్చుకొంటి స్వాంతంబునందు. 28

ఉ. ఐనను సంశయంబు విడదయ్యెడుఁ గార్యము నిర్ణయింప; నిం
తైనవిభూతి నున్నయభిమానినృపాలకుఁ డంతసుల్వుగాఁ
బూనునె భేదకారణముఁ బోలిచి సంధి నొనర్ప? రూక్షమా
మానసవృత్తి రెంట నఱుమ౯ దగునిశ్చయ మేమి చిక్కెడి౯?

గీ. మంచి సెడు గెంచకయ సాహసించువాని
కగు ననర్థోదయములు ప్రత్యంతరమున
బాగు నోగెంచి పనిఁబూనువాని సంప
దలు వరించు గుణాకాంక్షఁ దమకుఁ దామె. 30

గీ. కావ్యబీజాళిని వివేకకంకణముల
నించి పాలించువానికే నిండుఫలము

లంబుదమువలె వారె లోకాగ్రపీఠ
వర్తియై సంతతసుఖంబుఁ బడయుచుండు. 31

గీ. సాంప్రదాయికశ్రుతమె భూష యగు నరున
కాశ్రుతమునకు శాంతియే యాభరణము
ఉచితవిక్రమమే నగ యోర్పునకును
న్యాయసిద్ధియె తొడవు శౌర్యానుగతికి. 32

ఉ. ఎక్కువగాలి సోఁకఁ జలియింపనిదీపము చేతఁ జీఁకటిం
జిక్కినవస్తువుల్ తెలుపఁ జెంది కనంబడునట్లు కార్యపుం
ద్రొక్కటఁ జిక్కుబుద్ధికి సురూపిగ నర్థాకృతిన్ వచించుఁ బెం
పెక్కువివేకబద్ధగతు లెందు బహుశ్రుతశాస్త్రవాక్యముల్. 33

మణిగణనికరము. అనుభవపరు లగునధికగుణులతో
వని నడచుకొనినఁ బలుగును శుభముల్
కను గలిగిననడకను విధిహితిచేఁ
గను నసుఖములు సుఖము లనవలయున్ 34

చ. గెలుపుతలంపె యున్నఁ బరకీలితదుష్కృతినైన కోపమున్
మలచి, భవిష్యదర్థఫలమానముఁ జక్కఁగ నెంచి యోగ్యవే
ళల ననుకూలపౌరుషబలంబుల మేలియుపాయమున్ బ్రవ
ర్తిలఁ జరియించి పూర్ణజయదీప్తిని నేర్పరి సిద్ధినొందెడున్. 35

మందా. భానుండైనన్ జగ మఖిలమున్ బ్రాము నిండౌ తమంబున్
బోనూకున్ దా నుదయశిఖరిన్ బుట్టు మున్నే; యటుల్ మే
ధానైశిత్యం బమర మొదలన్ దాల్మిమైఁ గ్రోధజాతా
జ్ఞానంబున్ బో నడఁపఁదగు నిష్టప్రవృద్ధిన్ గనంగన్. 36

గీ. సహజకోపంబు గలబలశాలి మోహ
జనితకోపప్రకోపంబు జార్ప లేఁడు
కృష్ణపక్షేందుకళఁ బోలి కృశత నతని
సకలశక్తులు సంపదల్ సమయుఁజూవె. 37

మ. ఋతుకాలంబుల యోగ్యదీప్తిఁ గొని యర్చిష్మంతుఁ డై ట్లీజగ
త్స్థితి నౌన్నత్యమునన్ జరించు నటు ధాత్రీజానియున్ రాజ్యప

ద్ధతులన్ మిక్కిలిక్రోవ నెక్కువమ్మదత్వంబు బూని కాయాపరి
స్థితులన్ మేలగున్యాయవృత్తిఁ గొనిరన్ శ్రేష్ఠత్వముం జెందిరిన్.

చ. సిరి శరదభ్రచంచల, వశీకృతి కందక యింద్రియంబు లు
ద్ధురమదవాజిరీతిఁ జెడఁదూఁకుస్వభావమునన్ జెలంగు, సు
స్థిరత సిరుల్ గనం గలవె ? తెంపు, వివేకము, మంచి, నిండుని
బ్బరము, వహించి రెంటిఁ దగుపాటునఁ బాలనఁ బూనకుండిరన్.

గీ. తత్తఱించుమనంబునన్ దఱి నెఱుంగక
పొలుచుసంక్షోభ మునుపంగవలయు మేటి
ధీరతన్ దాల్చి ; యబ్ధి గంభీరవృత్తి
శ్రేష్ఠుఁ డనుకీర్తి నెట్టు లార్జించెఁ గనుమ. 40

గీ. శ్రితముఁ గల్గియు దేహశత్రుల నడంప
లేనివాని సిరుల్ పట్టలేక పేరు
మాలి నశియింపవే క్షణమాత్ర? పవన
తనయ ! కసి కింత స్వేచ్ఛ నిచ్చినను మేలె ? 41

చ. అరికృత మైనపాటున మహత్తరకూపమునందుఁ జిక్కి ని
బ్బరము వహించి కల్గినయపాయము దాఁటునుపాయ మెన్న కా
తురమునఁ దివ్రికోపమునఁ దుందుడుకుల్ రచియింప మేలె? మా
యురె ? యధరోష్ఠపీడనము నున్నదె లాభ మశక్తకోపికిన్ ? 42

చ. ప్రకృతిజనుండు వోలె ధృతిఁబాయకు మన్న ! భవిష్యదర్థదీ
పకత పురాకృతోరుకృతిబద్ధముగాఁ గను మన్న ! ముప్ప లోం
దక పరిపంథినాశన మొనర్పఁగ నోర్పును మించుమేలిసా
ధకము లభింప దన్న ! విహితం బిది యెన్నఁగ దన్న ! పావనీ! 43

మ. మనకాప్తుల్ సహజానురాగపరులై మానోగ్రు లాయాదవుల్
మనలన్ వీడి సతంబుఁ గౌరవులసమ్మానంబె యాసింప రే
పునఁ గాలానుగతిన్ దదుజ్జ్వలబలమ్ముల్ మఱిన్ విజృంభింప మీ
ఘనశౌర్యంబును దోహదంబిడ నశక్యం బుంతునే సోదరా! 44

ఉ. కాలవిరోధతన్ మనకుఁ గల్గినదైన్యము నాత్మసిద్ధి గాఁ
బోలుటయున్ సుయోధనునిఁ బొందినయట్లు నటించుచుండ్రి గా

కోలములందుఁ బ్రాఁతతు లుండుననుసు న్మిట యాదవాళిచు
ట్ట్రాలకు మిత్రకోటి కిచటన్ గలతక్కినవారివారికిన్. 45

ఆ. మనము వైరి కొప్పకొనినకాలావధి
కొడవఁదగునె? తీఁజఁ గడపిరంత
నిసుఁము పొడిచి వచ్చినని దేర్చుగతి వీరుఁ
గలనఁ బొడిచి తేర్చఁగలరు మనల. 46

మ. ఎఁటికిన్ సులువైన కొంటి కొంటి ధర నా కేపూని నిర్జింప సం
పదఁ గొల్పోయినరాజు లంద ఱిపు డస్మత్పక్షమై రన్నదు
ర్మదుఁ డీయాదవులన్ దదీయహితసమ్మానంబునన్ జూచునే ?
యది వా రైనతు రె? మానవంతు! లోకమర్త్యవ్యక్తి సైఁపం డనన్.

ఉ. భూరిరమన్ వరించి కడుఁబూనికఁ దాల్చినస్వల్పసామ్యతన్
జేరినకొద్దిసంపదలచే వినయప్రతిబద్ధపూర్వవి
స్తారమదంబుపొంగుల మనంగు నిసర్గదురాత్ములందుఁ జే
కూరునలంతియున్ మరలఁ గొంచెపుకాలమునన్ నశింపఁగన్. 48

క. తప్పక మూఢుం డగును గ
కుప్పతి మదమానకలితకోపనుఁ డగునే
నొప్పదు నయ మతిమూఢున
కెప్పుడుఁ ద్యజియింతు రి ధర్మహీను జనంబుల్. 49

క. ప్రతికూలఘోరపవనా
హతి సడలి కలంగు వేరు లమరుతరువున
ట్లతిబలుని వైరి నపరా
గతిరస్కృతప్రకృతివర్గ క్షుమగలఁ డార్చున్. 50

గీ. ఆంతరంగికమంత్రిజనాళిలోన
నుంతయుప్రీతి వఱలిన సుమచు నధిపు;
కొమ్మ లోఁజయుటఁ గల్గినకొలఁదివహ్ని
యద్రివన మెల్ల దహియించునట్లు గాఁగ. 51

చ అనయము దుర్వినీతిపరుఁడై పయిఁబూనిన శాంతమేని పీ
డినతనశత్రుభూపతి గడించిననశ్వరసంపదున్నతిన్

మనమున నెంచుఁ బ్రాజ్ఞుఁడు, ప్రమాద మొకింత దురాత్మవృత్తిసో
కినఁ గడుసుల్వునన్ దనకు గెల్పు లభించు టెటింగియుండుటన్.

క. సారకోఁత నొరగుతీరము
నురువేగనదీప్రవాహ మొగి ముంచునటుల్
పరిభావితబహిరంతర
నరు భువి విజిగీషు వల్లనన్ గ్రాంతిఁగొనున్. 53

—♦ ధర్మజునొద్దకు సాత్యవతేయు లరుదెంచుట ♦—

చ. సిరిఁ గొని సిల్గులన్ బఱపుచెన్నఁటిఁ జాపుట యొప్ప దెప్పుడన్
త్వర క్షుభితాత్ముఁడై సనుజుఁ బావని సౌమ్యు నొనర్పఁ గష్టబా
హిరము నయానుకూలముగ నెంచి మృదూక్తుల దిద్దధర్మభూ
వరుదరి కేగుదెంచె భగవానుఁడు వ్యాసుఁ డభీష్టసిద్ధినాన్. 54

గీ. పాపములఁ గాల్పఁగా దావవహ్నిశిఖలు
క్రూరతిర్యక్కులకు శాంతిఁగొలుపుచలువ
లరయ నానంద మిడునమృతాంశుకరము
లామునీంద్రునిచూడ్కు లత్యద్భుతములు. 55

గీ. తలఁపనితలంపుగా హఠాద్దర్శనమున
మ్రోలఁ బొడసూపునాపుణ్యమూర్తి నఘుగ
ణాపవారకు మునివృషభాగ్రగణ్యు
నబ్బురంబున ధర్మజుం డట్టె చూచి. 56

ఉ. బంగరుకొండకొమ్ముపయిఁ బచ్చన యొఱ్ఱన చుట్టుఁగాయ క్రొ
విం గనుపించుప్రొద్దువలెఁ బింగళదేహరుచుల్ నవారుణా
భం గొనువల్కలప్రభలపై నొలయన్ జటముల్ చలింప ను
త్తుంగవరార్ఘ్యపీఠమునఁ దొందర నుద్ధతుఁడై నిలంబడెన్. 57

ఉ. భక్తియు శ్రద్ధయున్ వెలయఁ బార్థివుఁ డాపిదపన్ మహాగురు
ప్రోక్తవిధంబునన్ నియమిపుంగవు నర్హసమర్చఁజేసి యా
సక్తిఁ దదాజ్ఞఁ గైకొని వెసన్ దనపీఠ మలంకరించె ధీ
యుక్తులయందు విద్య వినయోద్గతిభాతిగఁ గీర్తికాముఁడై. 58

చ. నగవునఁ దోఁచుదంతరుచి నాణెములై పెదవు ల్వెలుంగ, ధం
డిగఁ దన తేజ మెల్లెడ నటింపఁగ వానికి నాభిముఖ్యమూ
ర్తిగ నట నున్నధర్మజుఁడు దీప్తబృహస్పతి కున్ముఖుండుగా
నగవడుపూర్ణ చంద్రరుచిరాధికలక్ష్మిలఁ గూర్చెఁ బెల్లుగన్. 59

## మూడవసర్గము.



### వ్యాసులు మంత్ర ముపదేశించుట

సీ. శరదిందుచంద్రికాసమమనోజ్ఞప్రభా
పటలి యుబ్బునఁ బ్రాంశుభాతిఁ దోఁచి
నీలాంబుదచ్ఛాయ నెగడు మేనున జాళు
వావన్నెజడ తటిద్భ్రాంతి నీన
భూతిరేఖలతోడఁ బొందినమైచాయ
మింటియాగడపమేల్మిని రహింప
మందహాసము సుధాస్యందికటాక్షంబు
సురభిశ్వానిలముమచ్చునఁ జరింపఁ

గీ. దనువుఁ దాల్చినశుద్ధసత్త్వం బనంగ
మహిని బ్రత్యక్ష మగుచంద్రమౌళి నాఁగఁ
బరమసౌఖ్యానుసంధానవరపవిత్ర
మహితసుజ్ఞానశోభతో మలయువాని. 1

గీ. నిండుసాధుత మోమునఁ దాండవింప
రూపవిస్ఫూర్తి యతిలోకరూఢి నింప
ము న్నెఱుంగనివారుఁ గన్గొన్నతోనె
స్నేహసంపూర్ణచిత్తులై చేరువాని. 2

మ. తనయంతఃకరణప్రవృత్తియును శాంతంబాట సౌమ్యాకృతిన్
ఘనతన్ వెల్లడిగాఁగ నేర్పునఁ గటాక్షశ్రీలనే రూఢిఁ జెం

దినవిశ్వాసము నైజసౌమ్యతయు సందీప్తంబుగా భాషలన్
వినుపం జాలుమహాత్ముఁడై వెలయువానిన్ భద్రసంధాయకున్.

గీ. ధర్మనిర్ణాయకము లఘదళనపదము
లైనవేదంబులను దక్షుఁడైనవాని
నట సుఖాసీను వ్యాసమహర్షిఁ జూచి
రాకకును హేతు వెఱుఁగ ధర్మజుఁడు పూని. 4

కవి. కలుగఁగఁబోయెడుకర్మఫలంబు లఖండజయం బిడఁగాఁ దగు మీ
విలసితదర్శనభాగ్యము మాకు లభించుట మేఘము లేనిజపుల్
గలసవనక్రియ లెల్ల మహత్తరకామదముల్, ద్విజులున్ ఋజువా
క్కులు, పలుకాఁపురముల్బహుమానితకూటములయ్యె మునిప్రవరా!

మ. అరవిందాసనుభాతి లోకగురువిఖ్యాతాభులౌ మీమహా
త్తరసందర్శన మొం దమోఘమగు నర్థార్తిన్ సిరుల్ పొర్లు, దు
స్తరదుఃఖంబులు తగ్గు, సర్వపురుషార్థంబుల్ శుభాంతంబులౌ
గురుకీర్తుల్ విలసిల్లుఁ గాఁదగనికోర్కుల్ గల్గ వందేనియున్. 6

ఉ. చల్లనిచందమామ వెదచల్లెడివెన్నెల నామనేత్రముల్
చల్లఁబడంగ లే దిపుడు శాంతతఁ గైకొనె, నైన నుల్లమున్
బె ల్లలయించు బంధుజనవిప్రతిపత్తివియోగమున్ మునీ
ట్తల్లజ! తావకాంతికపదస్థితియున్ దయకల్మి నొందియున్. 7

ఉ. తాము నిరీహులైనజడదారులు కావుట నెద్ది కోరి మీ
రీపెయి రాక నాఁబొసఁగదే మదధీనముఁ గోరు దీరు మీ
ధీమహిమాంచితంబులును దీపితమంగళవృత్తికంబులౌ
శ్రీమహితోక్తులన్ వినఁగఁ జెందుఁగుతూహల మాత్మలోపలన్.

మ. సహజౌదార్యమహామనస్వి యగురాజన్యుండు మేల్మాటపొం
దు హితం బూని వచింపఁ దజ్జయమునందున్ దృష్టి సారించి నిం
డుహృదిన్ యోజన మూని యర్థగరిమన్ దొల్కాడువాక్యంబులన్
మహనీయుం డగువ్యాసుఁ డిట్లు పలికెన్ మాధుర్యధుర్యంబుగన్.

గీ. ఇహపరశ్రేయమును సంగ్రహించుజనులె
బాంధవులలోన వ్యవహరింపంగవలసె

నేని దుర్వ్యాకరివృత్తి వహింపఁ జలయు
కట్టిచోఁ జెప్పనేటికి యతులమాట. 10

ఉ. ఐనను దానవీనసుగుణాదుల ముగ్ధత సంక్రమించునా
మానస మిందు నీదెస భ్రమన్ గొని వ్రాలెడు; వీతరాగులై
పూనుముముక్షువుల్ పురుషపుంగవులున్ గుణపక్షపాతు లా
లే నిజ మంతమాత్ర వికటింపరసూ తమతుల్యవృత్తిలోన్. 11

శా. కారే మీరును బుత్త్రు? లర్హగుణులై కౌరవ్యులన్ మించరే?
సారం బాధృతరాష్ట్రచిత్తమునకున్ స్పష్టంబు గాదే? మిమున్
గ్రూరత్వంబున వీడు వానిజని మాకుం జూడ వ్యర్థంబ, దు
ష్ప్రారంభంబున భోగతృష్ణఁ గొన మోహం బంధుఁ గావింపదే!

మత్త. ఇట్టివానికి నర్థసిద్ధి రహించునే త్యజియింపదే?
గట్టిసంశయ మీఁగ దుష్టులు కర్ణముఖ్యులె యోజకుల్?
దొట్టుదుర్జనయోగముల్ జయదోషకారణభూతముల్
పుట్టుఁ బూర్వము మాపి యెప్పుడు భూరికష్టముఁ గొల్పెడున్. 13

చ. విన మిడి చీరె లూడ్చుకొని పీటికిఁ జిచ్చిడి కానఁ ద్రోసి వ
క్రసముగ ధర్మహీనులయి క్రౌర్యముఁ బూని యరుల్ శపింప నె
ట్టిసమయమందుఁ గష్టము ఘటిల్లనియట్లు మఱెంతపూన్కితో
నెసఁగెడుధర్మమందు భవదీయము నిద్దపుఁ బ్రేమ ధర్మజా! 14

మ. శమమే పూనిన నిన్ను మోసమున రాజ్యభ్రష్టుఁ గావించి వై
రి మహాధర్మపరిచ్యుతిన్ బ్రజలు గర్హింపన్ గనెన్ బైన ను
త్తమసాహాయ్య మొనర్చె నీకు భవదుద్యద్ధర్మమార్గానుగ
క్రమశీలాతిబలంబు దాన నతిలోకశ్రీల రాజిల్లుటన్. 15

లయవిభాతి. అరు లొడిచికొనినటులు మరలఁ గొన నగునె ధరఁ
బురుషశరబలములను బరఁగకయ నీకున్
బరు లిపుడు సకలబలధరు లగుచుఁ గనుఁగొనఁగ
నురుతరము వెలుఁగునను బరువమున నుండెన్,
బరికరము లఖిలములు త్వరితముగ నిపుడె బహు
తరములుగఁ గలఁతలకు సరిపడి చెలంగన్

వరమయిన జతనమున కరయుము, సిరుల గెలువఁ
బరమగురుబలమె గడుసరియగుచుఁ దెల్పెన్. 16

గీ. క్షత్త్రియుల రోసి ముయ్యేడుసార్లు చంపె
నస్త్రగురుఁడయ్యె గాంగేయునంతవాని
కట్టి భార్గవుఁడును శిష్యుఁడఱుము నోడి
యాశ్రయబలానుగము విద్య యని యెఱుఁగఁడె? 17

శా. ఏగాంగేయుచేఁ జేర నాత్మబలముల్ హీనంబుగా జంకి యె
ట్లో గర్వంబఱ నోడినట్లు శమనుండుల్ దవ్వనం దేగునో
యాగంగాసుతుఁ డల్కఁబూని రణరంగాగ్రంబునన్ ధన్వియై
పేఁగన్ గుండెలు జాఱి పార కెవఁ డుర్విన్ సుస్థిరుం డయ్యెడున్?

మహాస్ర. కరితఃపస్ఫారితోద్యత్ప్రబలతరశిజిహ్వప్రసారంబుగా నా
తురతన్ లోకాళిభ్రమింగన్ దొడరుప్రళయసంధుక్షితోగ్రాగ్ని పోల్కిన్
గురుకోపజ్వాల రేఁగన్ గొదకొని విశిఖాకోటిమంటల్ మహాజిన్
గురుఁ డాకల్పింప మీలోఁగుదురయి నిలువన్ గూడునే యెవ్వరికైనన్?

శా. ఆటోపాక్షినిపాతనంబున నె ధైర్యధ్వంసమున్ గూర్చువా
చాటుల్ "భార్గవశిష్యుఁడే" యనుచు నిస్సారత్వమున్ జెందు మో
మోటంబున్ గనుఁ బక్షపాతి యగు నెప్డున్ మృత్యు వాకర్ణునిన్
మీటన్ జాలుదు రేయుపాయగరిమన్ మీ రుగ్రయుద్ధంబులన్?

గీ. తపము కడుఁగష్టమైనను దత్ఫలమునఁ
బొందుసాధనసంపద్విభూతివలన
నొరుల కందనివీర్యంబు నొంది విజయుఁ
డల్లగాంగేయముఖ్యుల నడఁచుఁగాత. 21

ఉ. ధీరుల వారి గెల్వ, జగతీస్థలి దివ్యయశస్సు నొంద, దు
ర్వారమహత్త్వభాసిత మభంగురకీర్తికరప్రభావమున్
సారతరైంద్రమంత్రవిలసద్గురుసిద్ధిద మైనవిద్య నిం
పారఁగ మీరు యోగ్యు లనునాదృతిమైఁ దెలుపంగ వచ్చితిన్. 22

ఆ. అన నజాతశత్రుఁ డర్జునుఁ గొలుపుము
గెలుపు మనఁగ శిష్యచెలువుఁ బూని

యతఁ డతిప్రసన్నుఁ డయినసాత్యవతేయు
నంతికంబుఁ జేర నరిగినంత. 23

గీ. అప్పుడప్పుడె నిగుడుసూర్యాతపంబు
చెలఁగి వికసించునాసరసీరుహంబు
పోల్కి వ్యాసముఖోద్గతభూరివిద్య
తేజునన్ జేరె నర్జునోద్దీప్తముఖము. 24

చ. చిరమున నేర్వఁగాఁ దగి ప్రసిద్ధి నెసంగినయోగవిద్య త
త్పరమమునీంద్రశక్తి ననపాయత నప్పుడె సంక్రమింప గో
చర మగుదివ్యతత్త్వశుభసంగతి, నంధుఁడు దృష్టిఁ గన్నటుల్
నరునయనద్వయం బుదుటునన్ జిర మద్భుతదీప్తిఁ గైకొనెన్. 25

ఉ. సూచితభాగ్యలాభమున జొబ్బిలుకోర్కులమేర మేనునం
దేచినయుబ్బు రేఁగఁగ రణైకసముత్సుకుఁ డైనపార్థు-కా
ర్యోచితసత్తపోనియమ మూనఁగఁ జేసి "జయీ భవా"ది వా
చాచతురత్వ మేర్పడఁగ సాత్యవతేయుఁడు పల్కె నిట్టులన్. 26

చ. "విజయుఁడ! యుక్తయోగమున వృద్ధి నెసంగుప్రతాపమూఁతగా
నిజఘనపౌరుషం బరి కనిష్టకరం బగునట్టు లాయుధ
వ్రజము ధరించి మౌనిజనవైఖరి కర్హము లౌ జపోపవా
సజయకరంబు లౌవిధుల నల్పము శ్రద్ధ చలింపకుండఁగన్. 27

గీ. ఇంద్రు మెప్పింపఁ జాలునహీనతపము
విఘ్నరహితంబుగ నొనర్ప వీ లెసంగు
నింద్రకీలాఖ్యగిరిపైన, నిదిగో! వీఁడె
యక్షుఁ! డటఁ జేర్చు నిన్ను నాయత్తమగుమ". 28

క. అని యంతర్హితుఁ డయ్యెను
ముని యంతట గుహ్యకుండు మొనసి నిలిచె న
ర్జునుమ్రోల బాదరాయణు
ఘనవచనమె తనకు నాజ్ఞగాఁ గైకొనుచున్. 29

గీ. నరునకును జోతవెట్టి సాంత్వనము లాడి
సానురాగత యక్షుండు సఖుఁడపోలె

మెలఁగె; విశ్వాస మింతలో వెలయుఁగాదె
సాధుసజ్జనసాన్నిధ్యసంగతముల.　　30

గీ. మరల నుదయింపఁగ నినుండు మలయువేళ
ముసుఁగు వడుమేరుకుంజదీప్తులఁ దమంబు
పగిది, నభ్యుదయార్థమా పార్థుపోకఁ
జతురు లగుపాండవుల సోఁకె వెత క్రమమున.　　31

ఉ. కార్యఫలం బసంశయము కావుటఁ గల్గినకౌతుకంబుచేఁ
దిర్యగపాస్తమై సడలఁదేఱువియోగజమైనచింత సో
దర్యమహానురాగమునఁ దా నతిభారము నొందియుఁ గళా
ధుర్యులు నల్వురుఁ సమతఁ దోఁకొనఁ దేలికమై కనంబడెన్.　　32

చ. స్వయముగ ధీరశేఖరులు, వ్యాసమునీంద్రునివాక్యమందుఁ బ్రి
త్యయమును మెండు, వైరినిచయపరిబలీకృతకోపవర్ధితం
బయి జయశీలమై వెలయునర్జునువీర్యము జ్ఞాతపూర్ణని
శ్చయ మగుటన్ వియోగజవిచారము వారల నిల్వకే చనెన్. 33

ఉ. వారల నిల్వలే కడలి పారువియోగజదుఃఖ మేకమై
చేరెను " బిళ్ళపెట్టుగ " నుసింగొని కృష్ణను, వాసరంబునన్
దోరపువెల్గుతో నడుచుతొల్లిఁటినాలుగుజాములన్ గడున్
దూరత పీడి కృష్ణనిశ దూఱెడుచీఁకటిరాశియో యనన్.　　34

—♦ ద్రౌపది పార్థు నుత్సాహపఱచుట ♦—

ఉ. అంగన పార్థుఁ జూడఁ గడునక్కసమందియు మంచునీటితోఁ
బ్రుంగినవారిజంబులను బోలి నవాశ్రునిరుద్ధమైనక
న్నుంగవ మూయ దాజలమునన్ గెడపంగ నమంగళంబు శం
కం గొని ప్రేమ, కాంతుజయగౌరవ మిట్టటు నూఁప ధీరమై. 35

మ. సరసాన్నం బఱలేని ప్రేమ నిడ నంజల్యగ్రితన్ బాంధుఁడో
నరుఁ డాసంబళమున్ గ్రహించుగతి నందంబై పొరల్లేక ప్రే
మరసాపూరితమై మనోజ్ఞ మగుభామాదృగ్వితానంబు నా
నరుఁ డంతఃకరణప్రసన్నతఁ గొనెన్ బాధేయబుద్ధిన్ దమిన్. 36

ఉ. వేసఁగి వేఁడిఁ జిక్కినది భీకరవన్యమదేభఘట్టనన్
గాసిలుపోల్కి ధైర్యము కకావికలైనఁ జలించి దీనయై
యాసతి, రాజపుత్త్రిక, ప్రయత్నముతో వగ డించి యశ్రుప్ర
ల్లో సమయించి యారెలుఁగులో నుడి తొట్రిలఁ బల్కె నిట్టులన్.

గీ. శాత్రవులమాయచే వడిచనినభూతి
కట్లు మాకు నుద్ధారకుఁ డగుదు వీవ
కష్ట పాతక, మాసిద్ధి కనకు చిత్త
వికృతి మాయెడఁ బాటున వీరవర్య ! 38

ఉ. కాంతుఁడ ! నాయెడన్ మిగులఁ గల్గినప్రేమకు నిట్లు దూరమై
యెంతకు నోర్తునంచు నొకయింత చలింపకు, యోగవృత్తి సం
భ్రాంతి యసక్త లేని ధృతిమంతులకున్ గురుకీర్తి మేల్సుఖం
బంతికమా నమానుషమహత్త్వము సిద్ధియుఁ గల్గు రూఢిగన్. 39

ఉ. భూమికి రక్షగా నలువ పూన్చినరాజులకున్ ధనంబు లు
ద్దామబలంబు శాత్రవవిదారణచర్యయ సూవె, వైరి క
్ర్వ్బామి హరింప నోర్చుకొనురాజును రాజె తరాజు కాక, తే
జోమహితుల్ జయాఢ్యు లగుశూరులమానమె హెచ్చు మేనికిన్.

చ. అఱగొఱ రచ్చనైనతఱి నచ్చటిరాజులలో నసహ్యమై
వఱలదె కోప మొక్కమొగి వంశవిభేదములం దుపేక్షయే
తెఱఁగని యాదలల్ మలపి ధీరత నొందిరి కాదె దిక్కులన్
బఱ పగఁదిగ్వితానగతిఁ బాసి యశం బుఱులన్ సహించెదే ! 41

చ. ఎదిరిబలంబు హెచ్చు సహియింపనిమీమగపగ్గ వీడి యే
యదనున మున్న తేజఁ గనట్టు లనామకతన్ గృశించి యి
ట్లొదిగి భవిష్యముల్ గుదియ నొప్పితి రెట్టు లినుండు దీప్తిసం
పద కొదవో దినాంతమున వ్రాలి ప్రతాపము డిందునట్టులన్. 42

చ. కబరి గ్రహించి చేసిన నికారము లెల్ల స్మరింపరాని వ
య్యాఁ బరులొనర్పఁ జెల్లె, నయయో! మిము వీడుటఁ గ్రొత్తలై కలం
చు బహుళతన్ బ్రతిక్షణము చుఱ్ఱున నాఁటిపరాభవంబు లే
యుబుసుల మీరు నేఁగ నిట నుండెదనొక్క తదుగ్రవేదనన్. 43

ఉ. దంతము లూడ రూపఱినదంతివిధంబున స్వాభిమానని
ష్క్రాంతిని దేబె నావలయుఁగాదొకొ క్షత్త్రియునైన, వైరిచే
నంతరితప్రతాపులు ధరాధిపతుల్ శరదభ్రసంచయా
క్రాంతదినాదులట్లు పయికప్పులతో గుఱితింప నర్హులే?      44

ఉ. సిగ్గిలుమందుపోలికఁ ద్యజించినయస్త్రకలాపులైనమీ
వగ్గి కృశించునీరనిధిభంగిని రూపము మాఱె పోలె; నా
వగ్గగుదుస్ససేనుకృతిఁ బాడయి చిందినవేణి కీశుఁడే
దగ్గఱ యయ్యె, వీతబలదర్పుఁడ వెట్లు ధనంజయుండవో!      45

ఉ. సాములఁ గావలేనియెడ క్షత్త్రియుఁ డెట్లగు క్షత్త్రబంధువుం
గాఁదగఁ, డాజి శక్తి కొఱగానిది కార్ముక మౌనె కట్టెయుం
గా దనవచ్చు, మావలెనె కాఁగలమీవిజయంబుఁ గోరియుం
సాదనమాలి లెక్కకె యెసంగుభవద్గుణముల్ సమార్తితోం.      46

ఉ. ఏమఱి నిద్రనుండినమృగేశ్వరునిం బెదిరించి పిన్నటల్
సామజ మూడఁగాఁ బెఱుకుచందమునం నయమార్గమంచు లోఁ
బ్రామినముంపునం దెగువఁ బౌరుష మూననిమిమ్ము శాత్రవ
స్తోమము దూఱఁజెల్లె నహితుల్ క్షణకాలము సంతసింపఁగం.      47

చ. అది యటు లుండ మీయెడ సమర్థత నిర్వహణోరుశక్తిసం
పద గమనించి పైఁబడియె వ్యాసమునీరితకార్యభార మీ
యదనునఁ గోరి పై నొలయునట్టిదినప్రభ నర్కుఁడట్లు స
మ్మదఫలదంబుగా భవదమందధృతిం వెలయింపఁబూనుఁడీ.      48

కవి. ఒరుల సెవందుము బొందఁగఁజాలనియోగ్యత దుష్కరకార్యసమా
చరణఫలాంచితుఁ బౌరుషవంతుని సత్సభలం బ్రతిభాసహితుల్
నరవరులెల్ల రనర్ఘపదాగ్రఘునత్వ మొసంగి నుతింతురు శ్రీ
కర మయి సాటి యెసంగనికీర్తి జగంబుల మ్రోఁగు నిరంతరముం.

ఉ. “వారలనందఱిం విడిచి వచ్చితి యెట్టివిపత్తు సోఁకి యే
మైదొ” యటంచు నీదుహృదయంబునఁ జెంద కకారణవ్యథం
వారని మావ్రతంబులను వాసవుఁడుం ద[illegible]
చారమునం దొకప్పుడు విచారము గల్గినఁ దీర్పుఁగాఁపుత[illegible]      50

చ. వనములలోన నొంటరిగ వర్తిలునీ కొకచోట సంకటం
బును మఱియొంట సౌఖ్యమును మోఁపగుచుండుఁ; బ్రమాద [ మొంది యెం
దును భవదీయమేధ చెడుతోఁ ద్రవఁ జలింపఁగనీకు; సాధుతై
నను పగ మైత్రి చిత్తమున నాటిన దుర్విషయాప్తిఁ గూలరే? 51

ఉ. కావున మాని తెల్పినపరికారము పోయి తపంబొనర్చి మా
లావుమనోరథంబులఫలంబులఁ గూర్పఁగఁజూడు, మాప్తకృ
త్యావసరుం డినుం జనులయంకిలితీఱఁ గవుంగిలింప నా
భావము దూఁకుచుండు నెడఁబాటున నీయెదురుల్ గుణించుచున్.

ఉ. వ్యాసునిరాకయున్ దన కయాచితలబ్ధిగ నైంద్రమంత్రవి
ద్యాసమవాప్తి, తత్ఫలమునందఁ గుతూహల మొందుచిత్తవి
న్యాసబలంబుచే మఱపు నందినశత్రుకృతావమాన మి
వ్యాసమునన్ నవం బగుట నాతఁ డుదీచిదిసేంద్రదీప్తియై. 53

సీ. అభిచారహోమంబునందుఁ బురోహితుఁ
డగుధౌమ్యుఁ డొనరించునాహుతులను
హుతవహునురుశిఖాభ్యుదయదీప్తుల దుర్ని
రీక్ష్యయై పెనుశక్తిరీతి ద్రుపద
తనయాకృతారివర్తనసముద్ఘాటనఁ
గూరినమనమున ఘోరశత్రు
సంచయంబులు మ్రోల సంచరించినయట్లు
లై క్రోధ మగ్గలం బగుట హేతి

గీ. ముఖరితాయుధములు మెయిన్ మొనసినంత
సహజసౌమ్యస్వరూపుఁడౌ శక్రసుతుఁడు
ప్రళయకాలభయంకరార్భటి వెలిఁగె
నంగ ముప్పొంగ నక్షుల నగ్గి గురియ. 54/1

సీ. దానికిఁ దోడుగా ద్రౌపది మండెడి
మంటలో సమిధలమాడ్కిఁ గాఁగ

దయితుఁడా! యీమొలదట్టి రాఁజోవుసం
　　గరమున నరిగళాక్రాంత మగుత
మీమేటిగాండీవ మెనయఁబో యెడిసమి
　　ద్రంగంబునన్ వహ్నిఁ గ్రక్కుఁగాత
మీతళత్తళలతో నెసఁగుకౌక్షేయకం
　　బెడలనిపిడుగుల నడరుఁగాత

గీ. మించుకవదొనలందు శయించు విశిఖ
సమితి వజ్రంబులై గాఢశత్రుగిరి
కోరుపక్షవిధ్వంసకమై రహించుఁ
గాతమని వాని దిద్దుచోఁ గాక లరుదె. 54/2

గీ. చెడనిగుతికోడ నరిసేనఁ జెవులఁ జిల్లు
లడర సుడినొందువింటితో నధికనిశిత
ధారలన్ శత్రునేత్రాంధతమస మొసఁగు
మేటితూపులతోడ నమ్మేటిమగఁడు. 55

ఉ. ఖాండవదాహవేళ నధికంబుగఁ జెల్లినపోరులోన నా
ఖండలవజ్రఘాతములఁ గల్గినమేనివ్రణాంకపాళి యు
ద్దండతదీయకీర్తియును దారకభాసినభోంతరం బనన్
మండెడురత్నముల్ వెలయుమైమెఱుఁగై లలిఁ గప్పుచుండఁగన్.

గీ. ద్వైతమున మునిమనము లార్ద్రత వహింప
యక్షసందర్శితం బగునట్టి క్షేమ
మయినతీవ్ర హిమాద్రివై పరిగె విజయుఁ
డంచితోత్సాహమునకు నీడైననడక. 57

ఉ. దిక్కుల దివ్యదుందుభులు దిగ్గన మ్రోఁగె, సురాగపుష్పముల్
గ్రక్కున సోనలై చదల లక్ష్ములు నించె, స్ఫురద్ధరాసతిన్ :
"మిక్కుట మైనభారము శమించును లెమ్మిఁక" నంచు వార్ధి కై
పెక్కుఁ గవుంగిలించెఁ జలియించుతటోత్పతదూర్మిహస్తుఁడై. 58

# నాలుగవ సర్గము.

———:o:———

—♦ ఇంద్రకీలమార్గవర్ణనము ♦—

సీ. హంసాకృతులు రాజహంసలకలరుతుల్
నించునొడ్డాణంబు మించుదాని
నీడుజోడై తటి నెనయుజవ్వనమున
విరహార్తి వెల్లనై వెలయుదాని
సఖులెల్ల గుమిగూడి శైత్యోపచారముల్
సలుప నొయ్యారంబుఁ గొలుపుదాని
ననుబద్ధరక్తితో నలరుకాంతను జేరు
నట్లు పార్థుఁడు సేరె నంత నెలమిఁ
గీ. గూయురాయంచతుడుములఁ బాయఁబాడి
యొరగుపైరులఁ, దత్తన్నియుక్తజనులఁ
బరఁగుగమ్యస్థలంబు సంబరము వింత
చూపరులలోనఁ దనలోన నేపుఁజూప. 1

చ. అమలినపంకజాకరజలాతిసుహార్దత, నమ్రశాఖికా
గ్రిమఫలపత్రపుష్పపరికీలితభవ్యబహూకృతిన్ శర
త్సమయవిలాసలక్ష్మి సహజం బగుమానసహారిసంపదన్
విమలముదం బిడన్ వనుల పీడులఁ జొక్కె నతండు పాంథుఁడై. 2

ఉ. వింతఁ గడంగి చూచుక్రియ విచ్చినపద్మవిలోచనంబు లు
ద్భ్రాంతవిలోలమీనములపాటును గల్గుసరోవరంబు ల
త్యంతముదంబుఁ గూర్చె నపుడప్పుడ తోఁచినయందగానికిన్
గాంతలు చూపుబిత్తరినిగారపుచూడ్కులఁ బోలి వానికిన్. 3

మ. అటఁ బోవన్ గనుపించె నర్జునున కత్యానంద ముప్పొంగ నం
తట నీరంబుల నిండి, గంధములు చిందన్ విచ్చుపద్మంబు లె
చ్చటఁ జూడన్ దళచ్ఛైరహింప నురువై శాల్యంబు కేదార ము
త్కటసౌఖ్యాగమసన్నిమిత్తములు మోదం బీయు వే యేరికిన్. 4

చ. మును వికసించుపద్మములు పోసినపుప్పొడిసేస లాపుగా
గొనబగుమెట్టతామరను గోయుదునా యని పూని వచ్చున
ర్జునునకు మీనచంకృతిని ద్రోవడి విచ్చుపరాగయుక్తఫే
సనటవఁ దోఁచె శంకలు చనన్ నలినాకరశుభ్రనీరముల్. 5

చ. తనహృదయేశుఁ డబ్ధిశరదంబుల నన్యకృతాభిలాషఁ జి
క్కినజవమున్ బలం బుడుగఁ గిడ్పడి చేష్టలు స్రుక్కవాహినీ
వనిత యలంతియూర్పుసహవాసమునన్ వెలవెల్లనై తన
ర్చినసికతాదుకూలమును జెందు నెఱుల్ నరుమొప్పఁ గైకొనెన్. 6

ఉ. అచ్చటిశాలిపాలికలయం దొకకొందఱు కేసరాప్తిచే
ముచ్చట లూరుమంకెనలపూ ల్తమమేలిత్రికూటరాజిపై
నచ్చినవేడ్క దిద్దుకొనిరన్ రుచిరాధరపల్లవంబులన్
మచ్చికలై సమారుణకనత్ప్రభ నించె మనోహరంబుగన్. 7

గీ. క్రిక్కిఱియుగబ్బిగుబ్బలనిక్క నిండ
బాలసూర్యాతపారుణపద్మరజము
వ్రాలి యట స్వేదపున్గటి రాణఁ గూడి
తన్నిసర్గవిలాసంబు వన్నె వెట్టె. 8

చ. కవిసి కపోలలక్ష్ములను గౌఁగిటఁ దోకొని సొంపుఁ బెంపు వె
ల్లివిరియఁ జేయుచున్ జెవులలీల నటించుఘనోత్పలప్రభన్
దివిరెడు శాలిపాలికల నిద్దపుక్రీఁగనుతళ్కుఁ జూచి పొం
డవుఁ డెఱఁగెన్ గృతార్థతఁ గడంగినశారదమూర్తిమాన్యతన్. 9

చ. త్రొలి తెలివేగువేళ నటఁ దోఁచినపచ్చికమేఁతపట్టులన్
వెలలినమేలియాలు తమబిడ్డలపై మరులెక్క నిండుచేఁ
పులఁ బొదుగుల్ చనుల్ పులకఁబొందుచు బాలను జిందునుత్సుకం
బుల కగువేగమున్ దొరయఁబోవనిబొజ్జలతో ముదం బిడెన్. 10

ఉ. డీకొనుసచ్ఛగిత్తలఁ గడిందిమగంటిమిఁ గ్రుమ్మి, గెల్పుటు
త్సేకముచేఁ జెవుల్ దెసలఁజిల్లులువోఁ బెనుఱంకె వేయుచున్
గోకులనేత కూలములఁగొమ్ముల గ్రుచ్చుచు దర్పమెల్ల ది
వ్యాకృతిఁ గొన్నరీతి బలుపై యొగుపై శరదుత్సవం బిడెన్. 11

గీ. హిమధవళగోసహస్రంబు తెల్ల మెల్లఁ
జనఁగఁ దోఁచుశరన్నదీఘనపులినము
కౌతుకముఁ బెంచెఁ గ్రీడి కక్కడ దుకూల
మెడలుజవ్వనిజఘనంబు నెదకుఁ దెచ్చి. 12

చ. అటఁ జనునాలమందలకు నన్నలో తమ్ములో నాఁగ బీళ్ళ ని
ష్కుటములుగా వసించుటఁ బశుక్రియ మేదకు లైనగోపు ల
చ్చటఁ జనుచుండి, త న్నడవిజంతువు పెన్బెద రూనిచూచుత్రో
క్కటమున మిఱ్ఱిమిఱ్ఱి కనఁగా దరహాసము సోఁకె నర్జునున్. 13

సీ. ముడిచినతలకట్లు పుష్పంధయములుగా
నుడులభావంబు వెంబడిఁ జలింప
నర్మవాక్యంబుల నగవులరదనము
లింజల్కములుగ నంకించి మెఱయ
లేమొండఁ బద్మాళిలీలఁ గుండలకాంతి
ముఖముల విన్నాణములు సెలంగ
నేకపల్లవలతజోక మోవులు నూర్పు
జాడల నిట్టట్టు లాడుచుండ

గీ. వీచికాముహురభిహతపృథుపులినము
భాతిఁ గవ్వంబుఁ ద్రిప్పపోఁబడి నటించు
కరవిభూషాళి జఘనంబుఁ గదిసి యులియ
గొల్లెతలచల్లసేఁత వర్తిల్లె నచట. 14

గీ. పసులసావిళ్ళముంగిళ్ళ మసలు కేకి
మైదువుల కుఱుమై మదం బడరఁ జేసె
నచట దధిభాండములఁ జిల్కునవసరముల
ఘనమృదంగధ్వనిన్ బోలు కవ్వపుసడి. 15

ఉ. కవ్వపుఁద్రాడు లాఁగునొడికంబుల దూఁకుచు గెంటి యాడు మే
ల్మవ్వపుబుబ్బుగుబ్బల, శ్రమన్ వసివాడినకల్వకన్నులన్
నవ్వసుధన్ వ్రజప్రియులు నర్తకకాంతలసొంపు నింపఁగాఁ
జవ్వనఁ గ్రీడిచూ పచటఁ జిక్కి చెలంగి మలంగ దెంతయున్. 16

గీ. వానబురద శరత్తున వట్రిపడఁగఁ
గలుగువడివంపు లేనిచక్రముల గాడి
పైరుమోడులఁ బాపటభాతి వెలసెఁ
బిదపఁగలఁగియుఁ దొలిచెన్ను వెంపు తోఁప. 17

మ. తమవర్ణాశ్రమవృత్తులై వెలయుసేద్యంబుల్ శిలోంఛంబులున్
దమి నేకాగ్రతఁ బూనుమానవులచేతన్ సొంపు వాటించుగ్రా
మములన్ వింతగఁ దోఁచె సర్జునునకున్ మానీంద్రసన్మంటప
క్రమతన్ ముంగిటిపూవుటీరములు వల్గత్సైరభం బీనుచున్. 18

ఉ. శారదలక్ష్మిఁ జూచి కెలసం బొలయన్ దమిఁజూపుచూపుశృం
గారము నింపునర్జునునిఁ గన్గొని పల్కెఁ దనంత యక్షుఁడా
సారము మేలివాక్కులఁ బ్రశంస నొనర్చుచు ; నింగితజ్ఞతా
వారు తలన్ గ్రహించి తగువర్తన మూనక యూరకుందురే? 19

గీ. మంచిదైవంబు శుభముల నించువేళ
వలె సమస్తజగత్కృషిఫల మొసంగి
వెలయుశారదశుభ్రాంబువులు మొయిళ్ళు
నీవిజయలక్ష్మిఁ బెంపు నందించుఁగాత. 20

ఉ. పైరులు పండఁబాఱి కనుపండువుఁగూరిచె, దూఁకు డంతయున్
దీఱి నదుల్ సుగమ్యగతిఁ దేఱినవై కనుపట్టె, రొంపి వి
ప్పాఱుట దారి చక్కఁబడి యద్దమురీతిఁ జెలంగెఁ బ్రావృడా
సారకృతాకృతు ల్మలఁగఁ జక్కనినూత్నశరత్కళా ప్తిచేన్. 21

చ. లలితబలాకపాళి చదలన్ బెనుబారులు గట్టిరావు, రం
గులవిలుతో బలాహకము క్రొత్తనిగన్నిగ నింప ; దైన మి
న్ను లతివిలక్షణాభల మనోజ్ఞత నిండొనగూర్చుఁ, గృత్రిమా
కలనము, గోరునే సహజకమ్రతఁ గల్గినవస్తురూపముల్. 22

మ. జలదధ్వానము లేమిఁ గేకులు నిరుత్సాహంబుచే డిందుకే
కల షడ్జధ్వని నింపఁగోరవు, శ్రుతిం గాంక్షించి యున్మత్తహం
సలనాదంబుల నాశ్రయించుఁ గను, ప్రేమ ల్మగ్ధలౌ నూ గుణం
బుల కచ్చో నెఱుకల్ ప్రధానములు కాఁబో వంట నిక్కంబకా.

గీ. పండు వెన్నెలబరువున వ్రాలుచున్న
కపిలవర్ణంపువరిపైరు లపుడ విచ్చి
వాసనల నీను కేదారవారిలోని
నల్లకలువల మూచూచు నవక మదిర! 24

గీ. తమ్మితూండ్లహారిద్రవర్ణమ్ము పద్మ
పత్రరక్తిమ, శాలిదీవ్యత్త్విశంగ
రుచియు మడినీటఁ గదిసినరూఢిఁ దోఁచె
శక్రవిలుతున్క వడియె నచ్చట ననంగ. 25

తరల. వలిపెమేలిముసుంగు జవ్వనిపైపటంబును గాముకుం
డెలమిఁ దీసినఁ దోఁచు దానిశుభేక్షణాదులపోలికన్
బొలిచె సప్తపలాశజం బగుపూరజం బనిలాహతిన్
దాలఁగ గోరఁటపూగనుల్ సుమతోష మవ్వనలక్ష్ములన్. 26

గీ. కనులఁ జెదిరించు మెఱపులు గ్రాల విచటఁ
దెలిమొయిల్ పందిరుల రాదు తిగ్మరశ్మి
చలువనీటికణంబుల మలయజుండు
సుఖ మిడున్ జూడుమీ నింగిశోభ విజయ! 27

చ. తెర లగు మేఘము ల్దాలఁగఁ దేఱినదిగ్వనితల్ ఘటిల్లుసం
బరముల నొండొరు ల్కుశలభాషల నాడెడురీతి నీటికై
యెఱకయి యొందునం దెగిరి యేగుమరాళసతీకలస్వనో
త్కరము కరమ్ము నించె నధికమ్ముగఁ గమ్రకలాపనైపుణిన్. 28

ఉ. పచ్చికబీటియాఁగదుపు పాకల కేగెడివేళ దూడలం
దెచ్చుతమిన్ జను ల్పులకలెక్క స్రవించెడిపాలసోనలన్
జెచ్చెఱ మంద వీడి యిలు సేరెడి యాలు ప్రవాసమేగి వే
వచ్చెడితల్లి బిడ్డలకు పాయసమున్ గొనివచ్చునట్టులన్. 29

గీ. వేదమంత్రాంచితం బగు వ్రేలిమివలె
గొల్లపల్లె వత్సంబులఁ గూడుకొనిన
లోకకారణములు జగదేకపావ
నములు గోబృందములు మహానంద మొసఁగు. 30

చ. * ప్రియుఁ డగుశ్రావణుండు కనుపింపమిఁ బెన్విరహార్తి దిగ్వధూ
చయములు పాండురత్వము ననారత నొంది మెఱుఁగుపైఁడియుం
తయును బయోధరాదృతిఁ గనంబడకుండఁగ జాఱిపోవ స్రు
క్కియు నిటు లింతయొప్పు నొలికించునె! నించునె యబ్రిమాత్మలన్.

మ. మనకేక ల్కఱపించెనంచు నెమిళు ల్మౌళు ల్ప్రసారింప మో
హనమాధుర్యముఁ జిల్కునొద్దికలతో హాయిన్ గళం బెత్తి తెం
పున గోపీతతు లాలపింప నవె గోవు ల్మేఁతల న్మాని మ
ల్చినరాబొమ్మలునా మలంగుతలలన్ శ్రీలొల్కు వి నొగ్గెడిన్. 33

చ. నుదు రవనిన్ స్పృశింపఁగ మనోభవరాగము పేర్మిఁ గోర్కులుం
బొదువ ననేకరీతుల "నమో" యని వ్రాలియుఁ, బద్మరాగమున్
గదియ కనాదరంబున నికార మొనర్ప, గతాశ నార్తమా
నెద వెలవెల్ల నయ్యెడి నడే కను శాలిభుజంగుఁ డయ్యెడన్. 34

ఉ. రాజభయంబుచే నడక మ్రాన్పడ మిక్కుడుదొంగలట్లు నీ
రేజరజోంచితంబు హిమరేణుసుశీతల మాట సౌరభ
భ్రాజితమై సమస్తమున వ్యాప్తిఁ జరించుసుగంధవాయు సం
యోజన నెందుఁ బోవుటకు నోప కళుల్ గతిఁదక్కుఁ జూడుమా!

గీ. కొనలు తెలుపైనవరి వెన్నుఁ గొని చరించు
చిలుకబార్లు శిరీషాభఁ జెలఁగుతనువు
లడర నెగురుట బహువర్ణమైనయింద్ర
ధనుష్పు మి న్నాక్రమించుచందమగుఁ గనుమ!" 36

మ. అని యక్షుండు శరత్కళల్ మధురవాక్యశ్రీల వర్ణింప న
ర్జునుఁ డానందముతో వినన్ గనఁగ నచ్చో ముందటన్ దోఁచె నె
త్తున మిన్నంటుచుఁ గ్రొంకఁగాఁజనుదినేందుశ్రీ బశ్చిమం బంపి తె
ల్పు నెసంగన్ గళితాంబుమేఘములపోల్పున్ దాల్చు పెన్ గొండయున్.

ఉ. న త్తమునన్ హిమంబులు, వనంబులు మధ్యతలంబుచుట్టునున్
గుత్తముగా నెసంగుపెనుగొండను జూడఁ గిరీటిచిత్తమున్
హాత్తెను గైపువోవ నసితాంబరమున్ ధరియించి యచ్చటన్
బెత్తన మూనుసీరి యనిపించెడి లక్ష్మి మనోజ్ఞవైఖరిన్. 38

---

* దీనిని 24 గాఁ జదువుకొనవలెను. మఱియు 14 వ సీసమునకు 14-15 రెండు సంఖ్య లిచ్చి తరువాతిపద్యసంఖ్యలు 30 వఱకుఁ గ్రమముగా మార్చుకొనవలెను.

# అయిదవ సర్గము

—•• ✿ ••—

## హిమవద్వర్ణనము

ఉ. మంచుమలన్ జయించుటకొ మాంగళదిగ్రమణీయతన్ విలో
కించుకుతూహలంబుననొ గెంటి నభంబును దాఁటుపూన్కి నుం
కించుటఁ గోరియో, పొడవు కేవలమున్ గనుపింపనంతయై
మించుగిరీంద్రసన్నిధి కమేయముదంబునఁ బార్థుఁ డేగుచున్. 1

గీ. వేవెలుంగువెలుఁ గొక్కక్రేవఁ గాయ
నొయిది ప్రాచీకటిన్ జీఁకటియును గప్ప
వెనుక గజచేలమును మును విమలహాస
మొనరుశివశివ మగునద్రిహాయలు గాంచె. 2

చ. ప్రతినిధియై త్రిలోకపరిపాలనమం దధికార మొంది యు
ద్ధతగతి శంకరున్ మఱపునం దఁగఁ జేయుకళన్ వహించి ప
ర్వతపతి యొప్పె మర్త్యులు భువర్గతులున్ ద్రిదివౌకసుల్ బహు
స్థితులఁ బరస్పరం బెఱుఁగఁ దీఱనిసౌఖ్యము-నాశ్రయింపఁగన్. 3

మ. మెఱపే లేనిశరద్ఘనప్రచయమున్ మే లెంత ? మైకప్పులన్
బుసడింపన్ గలమేటిమంచుపెఱ దోబూచుల్ మిటారించున
బ్బురపున్ గాంచనసానుదీధితులయుబ్బున్ జూపునీయద్రియె
త్తరమున్ రూపము ముందటున్నగతి వింత ల్గొల్పుతద్వ్యాఖరుల్. 4

శా. శ్రేణు లగ్గుమణిప్రభాళులు స్ఫురచ్చేలంబులై లంబులై
రాణన్ దేవసతుల్ చరించుపువుటీరంబుల్ కుటీరంబులై
కోణా ల్మ్రోటినతారసారంగపుబెడంగుల్ ద్వారవారంబులై
గాణేయాటవు లాటతోఁటలుగ నాగట్టొప్పుఁ బట్నంబుగన్. 5

గీ. ఓడిగిల్లిన నీరంబు పీడి చనిన
మెఱపు, సడిలేక యడఁగినయుఱుములై వి
శాలకటకంబులన్ దాని యేలుచున్న
తెలిమొయిళ్ళద్రి కపుడు రెక్కలయి తోఁచె. 6

గీ. మేటికరిఘట్టనంబుల వాట మమరు
సాటిశ్రేణితటంబుల నీటుకద్రు
ఝాటములఁ గోర్కు లొనగూర్చు తేటనీట
దాఁటునదు లొప్ప గిరి సొంపుమీటు జగతి. 7

గీ. అపుడ విచ్చుజపాసుమమ్ము కెంపు
గుంపు లొలయించు రక్తిమల్ కుందనంపుఁ
గొండకోడల కెరఁజ్రాఁకి కూర్చు నపుడు
సంజకెంజాయ లలము పెన్నాసు లచట. 8

వృ. కడిమికడిమిఁ దమాలమాలాక్రిమారమణీయంబునై
వడలువడలుహిమా[illegible]రేణుపరికరసుకరానందమై
తోడుగుతోడు గగుదాన దానద్యుతుల నతులాకాన్తై
యుడరి యడ రిమదంతు లెంతే నమరగిరిగంభీరమా. 9

గీ. తేవసు మ్మద్రి రత్నము ల్లేనికొనలు
పూఁబొద ల్లేనిగుహముందభూమి లేదు
గళితపులినాబ్జ యగుసరిత్ప్రాంత లేమ
ప్రాయకుండడిచెట్టనిఁ బొసఁగ దచట. 10

గీ. బిరుదుపికుందుల రశనంబు లొజపు నెఱప
నచ్చెరువుటచ్చరల కేళి నదరునదుల
పొగడఁ బొగడలపూఁదీవె మొగుల మొగియు
భుజగభుజగులఁ బతఁగులఁ బొలుచు నగము. 11

చ. హిమములె మబ్బులై శిఖరమెల్ల ముసుంగిడ, వానిఁ జీల్చుచం
దములయి రత్నపుఙ్గనులదండడితళ్కులు శక్రువింటియిం
దము లొనఁగూర్ప, దాఁటుజలధారలహారులె గర్జలన్ మనో
భ్రమ మొనయింప శారదను వర్షకళల్ విలసిల్లు నాగిరిన్. 12

చ. కలకళలన్ బ్రిఫుల్లగతిగా సతమున్ దగుపద్మరాజి యి
క్కలఁ గలహంసముల్ దిరుగఁ గమ్రితరం బగుమానసంబుతో
గలగలలాడుశైవభటకాండముతోఁ బ్రిణయంపుటీసుఖా
కలఁ గలహించుగౌరికి సుఖం బిమశంకరుతోడ పొడియున్. 13

చ. ప్రమథులు "బాపురే త్రిపురభస్మకృతిన్ దలపించె" నాఁగ వ్యో
మమున గ్రహంబులున్ ఘనవిమానములున్ స్ఫుటదీప్తిదోఁప ని
త్యము నిశ దిక్కులన్ వెలుఁగులాడఁగ మండెడు కాననాగ్ని సం
ఘములశిఖాళితోడఁ గడుఁ గమ్రత నగ్గిరిరాజు రాజిలున్. 14

చ. అడరుప్రవాహవేగమున కడ్డములౌ పెనుబండగుంపులన్
బాడవుగ లేచువారికణపుంజములే సితచామరాళిగాఁ
గడుకొని ప్రేమపెంపు లొడికంబులుగా నిజనాథుసేవఁ గూ
ర్చెడినన గంగ యుద్ధతులఁజెందు మహోన్నతసానువీథులన్. 15

గీ. కొండసాజగులకును వింత సొందుకొనఁగ
నాకుబేరునిబంటుతో నర్జునుండు
ముదము చిప్పిల వర్ణనల్ మొదలుపెట్టె
కౌతుకము రేఁగ వాక్సృష్టి గ్రాలకున్న? 16

చ. "అచలబలుండు రాజు చతురంగవిజృంభణ వైరిఁ గూల్చి లో
కచయమునందు హాయి నిడుకందువ నీగిరిరాజు మంచు మూఁ
గి వెలుఁగుశృంగముల్ నభము గిట్టి సహస్రతఁ జీల్పఁ గాంచువా
రి చెనుగు వెంటనే యడఁచుశ్రీ వెలయున్ గను మోయి గుహ్యకా!

ఉ. అద్దిర! యం తెఱుంగఁదగ కన్నిట నుండుపరాత్మునిందు నే
కొద్దిగనో వెలార్చు శ్రుతికోటులకొంచెపుగ నలీలగా
హద్దుల మించునన్కఁ గన నందక మెట్టఁగరానిగట్టులన్
గద్దరి కానలన్ గిరివికాసము నా గణనంబు మీఱెడిన్. 18/1

ఉ. లోకము లాక్రమించి దిశలున్ జదలున్ దనయున్కి నిండఁ బో
రాక సమగ్రతన్ దెలియరాక గభీరత నుండుకొండ, యే
వాకులఁ దెల్పరానిభగవంతు జగత్యభిరాము దండి న
స్తోకముగాఁగఁ జాటెడిని జూడు మహా! పసమెం డఖండమా.

ఉ. మేలిచిగుళ్ళఁ బల్రుచుల మించుసుగంధసుమాళి నీరముల్
గ్రాలి మరుండు పన్నినచొకాటపుటంబులగూండ్లుగాఁగ, సొం
పేలుకొలంకుఁదామరలయేపును దాపున రేఁపఁ, బెన్రతిన్
సోలియు నిచ్చవోక తరుణుల్ ధృతివో రతిఁ గోరకుందురే? 19

గీ. తగవరి సదృష్టవంతు వింతగ వరింప
నవనిధీశ్వరుఁ గొనఁజాలునవనిధులను
వెలసి గురుగిరిరాజువెన్వాల సిగుర్వఁ
జేయ మహి లోకములలో నజేయ మయ్యె. 20

క. శ్రీగిరిజాజనకుని సరి
దూఁగు నె త్రిజగంబులైన ?, దుర్గమమహిమ
శ్రీగురుఁ డగు గౌరీపతి
యోగమహానందుఁ డుండె యుండెడుకతనన్. 21

చ. ముదిమియుఁ జావు లేక కడుఁబుణ్యము నుత్తమమైనమోక్ష మొం
దఁ దలఁచువారికిన్ నిగమతంత్రములట్టు లవిద్య మాపి, త
త్త్వదమయి ఘోరసంసరణబాధ నపాస్త మొనర్చునత్సుఖా
స్పదములు పర్వతోపరివిశాలపవిత్రతరాశ్రమస్థలుల్. 22

చ. ♦ కళ కరఁగన్ సుఖంబుతమిఁ గాంచినకోర్కులు తీఱ నచ్చరల్
వలుసురతంబులన్ గనినపట్టు లివే కనుఁగొమ్ము గుర్తు లీ
గళితలతాంతపాళి, కసుగందినయీసుమమాలికాళి, యీ
దళపుటల క్తపాదకలితస్థలు లౌర ! విరాళి గుహ్యకా ! 23

గీ. నీతిసంపన్నుఁ డగురాజునిండుభూతి
యటుల నోషధు లియ్యద్రియందు గుణవి
శేషమునఁ దోఁచుమహిమ నర్చించు నెపుడు
తద్యశము దిక్కు లెనసి యెంతయుఁ జెలంగ. 24

గీ. అఱచులకుముకిగరితల నలరుతరులు
తరళనలినజకళలను దగుసరసులు
రసులుకొను నులిమిరివెలుఁగుసనసి, కరుల
కరులకలఁతల సుఖ మిడఁ గలనదు లవె. 25

ఉ. తుమ్మెదమూఁక మూఁగఁ బొరిఁదోఁచుసురేభకపోలసన్మదం
బిమ్మెయిఁ జాతగంధ మొనయింప వసంతకృతభ్రమన్ గుజా

గీ. ♦ వలపుపురి నిట వేల్పుమూఁకలు రమించె, మించె గుర్తు లివే నల్గి మిడుకువిరుల విరిలి ధర జాతిపడియున్న వింతసరుల, సరులఁ బారాణియడుగు లెసంగుగురుల.

గ్రిమ్మల నియ్యకాలమున గండ్రతనంబు వహించి మించి కో
కొమ్మని కోయిలల్ దఱచుఁ గూసెడి గుహ్యక! వింద వేకదా!

చ. ♦ కపురపుమోవి సన్ననగు కౌను రణద్రశనంబుఁ దాల్చువే
లుపుజవరాండ్రు సానువులలోఁ గని తన్మయుఁ డైన వారియూ
పుపస గిరీంద్రు నొందెననఁ బొల్చుసుధన్ గటకాళి మ్రోఁగువాఁ
గుపటిమ నన్నిటన్ మిగిలి కొండ సుఖాపరరూప మయ్యెడిన్. 27

చ. మఱచిరి స్వర్గ మీదివిజమానిను లద్దిర! మర్త్యకుందురే!
యిరువుల నిట్టిపూఁబొదరుటిండ్లు, జ్వలత్తృణవహ్నిదీపపున్
దెరువులఁ గల్పవృక్షనవనిర్గతపల్లవశయ్యలన్ బరం
పరితరతిశ్రమం బడఁచుపద్మరజాక్తసుఖానిలంబులన్. 28

ఉ. దూఁకుఝషంబు లట్లు కనుదోయి పవిత్రవిశేషభక్తిని
ష్ప్రాకృతసత్తపోఽనుగతి స్పందము నొందఁగ నీట గౌరి యు
స్తోకత నిల్చి కొల్వఁ దమిఁ బొందర శంకరుఁ డామెపాణి నిం
దేకద స్వేదబిందుపరిణీతకరంబునఁ బట్టె గుహ్యకా! 29

ఉ. నీ రెగయన్ భుజంగధర నిగ్గొలయన్ సుధ తోఁప వార్ధినే
సారగిరిన్ మథించిరి నిశాచరులున్ ద్రిదశుల్ తదద్రిశృం
గారభటిన్ దివిన్ బొడుచు నల్లదె మున్ దరిత్రాటిఱాపునన్
దేరినగీఱలన్ భుజగదేవుకథన్ దలపించు లీలతోన్. 30

చ. ఖరకరుకాంతి నీలమణికాండముపై స్ఫటికోపలాళిపై
వరరజతోరుభిత్తికలపైఁ బడి తత్ప్రభ లుబ్బఁ జేయఁగా
విరిసి క్రమించుచంచ తెలివె ల్గభిజిత్సమయంబునందునన్
నెఱపెడిపండువెన్నెలలనింపును గన్నులపండువౌనటుల్. 31

గీ. అందకత్తియ లగుజవరాండ్ర బొమల
హావచలనంబుఁ బోలి మందానిలములఁ
గదలుతరఁగల నట్టువగరితలట్లు
గునిసి యాడెడు నలినము లొక్కాలనినీట. 32

---

గీ. ♦ వాఁగువాఁగులు నచ్చరలాఁగులాగ । లోఁగు లోఁగుదరుల్, సుధ బాగుబాగు
బాఁగ నాగభృపొఁగడిక, పొగపొగ । భోగభాగము గిరిమేరు వీగి వీఁగు. 27

చ. వనితకు సాత్త్వికోదయమొ? పామును నాకయిఁ జూడ భీతియో?
తనుకువడంకుచేఁ గనులు తంద్రితఁ జంచలతన్ వహించె, నా
మనమును గౌతుకంబుఁ గొనె మంత్రిమహామధిఁ దాల్తునంచుఁ గ్రొ
క్కొన నహా జాఱ శూలి సతిఁ గొన్నది యీశుభభూమినేకదా! 33

మ. రవికిన్ వేకిరణంబు లందుని ఘనమా? షట్త్యేకతన్ వజ్రసం
భవశుభ్రోరుమణిస్ఫురద్రుచుల సన్మత్తానువుల్ కోటిభా
రవులన్ గొల్పెడితన్మరీచితతి కాల్ద్రివ్వన్ నభోవీధి కు
ద్దవిడిన్ జూడు మటన్నయట్లు గిరి సాంద్రజ్యోతులన్ వెగ్గడిన్. 34

చ. అలుకఁ బురాళిఁ గాల్చి కొనినట్టిహరున్ దనియింప వేడ్కతో
నలక సృజించె వెండిమల కవ్వల నున్నతగోపురాళితో
నలకకుబీశుఁడౌ ధనదుఁ, డర్యముఁ డద్రికి దాపుదాపుచా
యల కరుదేరఁగా ననమయా స్తమయం బటఁ దోఁచుఁ జూడుమా!

ఉ. సానువులం దెసంగు నవసన్మణికాంతులు కల్పుకోలుగాఁ
జైని శిఖాళిపై నొలయుబాటఁ దళుక్కులగోడ లేచిన
ట్లై నెఱసంతసం బొసఁగు నంతటిలోనసె యడ్డులేనిమం
దానిలుపోక తోఁచి భ్రమ నాఁగెడి నావినువింతఁ గాంచుమా!

ఉ. పచ్చికబీటిగడ్డి వసివాడెమున ట్లగుపింప దెప్పుడ
మ్మచ్చునసే సరోజదళమార్దవ మించుక బీఱువో వహా!
గుచ్ఛసమేతభూమిరుహకోటులలేఁతచిగుళ్లు పండఁబో
విచ్చుటఁ బార్వతీరమణి యీశ్వరుఁడున్ విహరింప నేమొకో! 37

గీ. తృణనవాంకూరము లటంచు మృగచయంబు
వలచి మూచూచి చన నందుఁ బచ్చమణుల
చిలుకమదవతుల హసించుతళుకుపసలు
రవికరంబులమెలి వింతరంగు లెగచు. 38

ఆ. మెట్టతమ్మిపూదలమేలి రజము బిట్టు
సుడియుగాడ్పుదెబ్బ సురిగి లేచి
మింట విరియఁ గనుమ మేలిమిగొడుగట్లు
చూడ సొగసుకడిమి నీడు లేక. 39

మ. కుడికా ల్పొప్పిది, దాని వెంబడిఁగఁ గన్గో వామపాదాంక మే
ర్పడెఁ బారాణి మఱింత చిన్నదిగ, సంభావింపఁ బ్రాక్సంధ్య ని
క్కడ గంగార్చనలన్ బ్రదక్షిణగతిన్ గౌరీశు లర్ధాంగల
క్ష్మి డిగంబోలుఁ, బవిత్ర మీస్థలము రమ్మా ! జోత సేవింపుమా!

చ. కదలెడుచెట్లకొమ్మలఁ గకావిక నూఁగెడియాకుసందులన్
జెదరుచు నెండదూరి యిటఁ జెన్నగువెండిని దూఁక నద్దపున్
జదురున మిట్టి బింబములు సల్పు దివి న్నటనంబు వెండి యా
కుదు రఖిలంబునన్ రజతకుడ్యములన్ బ్రతిబింబ మానఁగన్. 41

ఉ. అచ్చపుఁదెల్పుశోభ లెగయన్ గిరిఁగొమ్ములఁ గోరువేళలన్
ముచ్చటగాఁగ వర్తులతఁ బొందు శరీరగతిన్ "శశాంకుఁడే !
యిచ్చటఁ జూడుఁ!" డంచుఁ దర శేక్షణ లందు భ్రమన్ నచింపఁగా
నిచ్చఁ జరించు నంది ప్రమథేశ్వరువాహన మట్లు చూడుమా ! 42

చ. శరములు పోవుటన్ జెదిరి చాళ్ళువడన్ దివి నున్న మబ్బులన్
భరమునఁ దప్పదారి ప్రభవం బగుశక్రునిరంగువి ల్సరా
సరి నిలకుండఁ దుండ్లుగ నెసంగఁ బురే ! శిఖరాగ్రరత్న భా
సురవివిధాభ లాయెడముఁ జొచ్చి యెసంగెడి నిండుఁ జూచితే? 43

మ. శివచూడామణియా సుధాకరుఁ డదే ! చెట్లున్ లతల్ దాల్చుప
ల్చివురుల్ మెండగునార్ద్రతన్ జలకణశ్రీలన్ గగుర్పాటువిం
తవుసారామృతమీయఁ జేయు స్వకరాశ్యాలింగనప్రక్రియన్
దవులెక్కన్ విహరించుఁ గృష్ణనిశనైనన్ గొండపెం బద్దిరా !" 44

మ. అని యాశ్చర్యము నొందుశక్రజున కచ్యుతుం డనున్ "జూడు! కాం
చనకాంతుల్ వెదచల్లుతద్గిరిని ! బంగారంబు నీ రోఁతపో
సినయట్లై దిశ లొప్పునీఱ వెలుఁగున్ శ్రీమంతమై; మేల్గుహల్
దనరున్ దాన ; సఖుండు నీగురున కీధాత్రీధరుం డర్జునా ! 45

చ. కలిసి యెసంగుతీవియలు గాలి నిటట్టు వడిన్ జలింప నం
దుల రవిరశ్మి "ది"గ్గనఁగ దూఁకి తదీయహిరణ్మయాభ గ
ట్టుల జళిపించె, మబ్బులఁ గదున్ వెలిగించుతటిద్విలాసరీ
తుల నెకసక్కెమాడుగతిఁ దోఁచఁగఁ, జూడుమ యింద్రకీలమున్.

ఉ. పాములు లేక, మత్తగజవారము లెయ్యెడఁ జూడరాక, మైఁ
బ్రామిన చిక్కనౌ మదపువాసన లెల్లెడఁ బ్రాఁకఁ, దోఁచునీ
శ్రీమహితాచ్ఛగంధతరుచిహ్నములన్ గన నిప్పు డిప్పు డు
ద్దామసురేభవప్రకృతిఁ దన్కనపోక లెఱుంగనయ్యెడిన్. 47

గీ. మేఘములు మూఁగఁ బచ్చలమిసిమి తూఁగ
గుహలలో దారి రవిదీప్తి కుందువారి
చీఁకటులముంపు సోఁకినపోక నింపెఁ
గంటివే! యింద్రకీలవిఖ్యాతలీల. 48

ఉ. వ్యాసమహర్షియాజ్ఞ మనమందుఁ దలంపుము, శాంత మూనియున్
నీ సహజంపుక్షాత్రమును నిల్పఁ జరింపుము, పూనుమీ తపో
న్యాసము నిందు, లోకహితమౌ కృతి కడ్డమె యెందు నంచు వి
శ్వాసివి గాకు శ్రేయములపట్టున నెన్నియొ సోఁకు విఘ్నముల్.

వృ. నీమనోరథమునకు నింద్రియనిచయమే తురగంబులౌ
నామహాశ్వము లిటుఁ దపోగతి నపథహారిణు లయ్యెడున్
నీమమం దగునడరులన్ ధృతి నిలుపుఁగాపుత శ్రీశివుం
డోముతన్ దపమునబలం బిడి హుతవహాదులు దిక్పతుల్. 50

ఉ. పూనినసాధువృత్తి నిఁక ముందు కృతుల్ శుభదంబు లౌత మం
చానయశాలి యక్షుఁ డలకాభిముఖుం డయిపో నరుండు చిం
తానతుఁడై తలంపులను దక్కి నిలంబడె నట్టె చూచుచున్,
మానునె యేరికిన్ వ్యధ శ్రమం బిడ కార్యవియోగసంహతుల్.

మ. బలయోగంబున, సాటిలేమి ఘడితిప్రాప్యార్థసిద్ధిన్ నిరా
కులతన్ బొబ్బిలుపూర్ణలక్ష్ములు కళల్ గొల్పన్ దృఢాశంసితా
చలరాజంబును జేరెఁ బార్థుఁడు యశస్సంపన్నమౌ పౌరుషం
బొల్లయన్ జేరుఫలానుభూతివలె, భావ్యుత్కర్ష సూచించుచున్.

---

# ఆఱవ సర్గము



## ఇంద్రకీలాచలాభివర్ణనము

ఉ. చక్కనిరూపువాఁడు ఘనసద్గతివాఁ డతిసౌమ్యుఁ డర్జునుం
డెక్కఁ గడానిమేనిజిగి నెంతయు వెల్గుగిరీంద్రు బల్ రుచుల్
గ్రక్కుచుఁ బారు నాత్రిపథగామిని గంగకు నున్ముఖుండుగాఁ
బక్కదొరన్ బరాత్పరుఁడు స్వారిఁ జరింపఁగ నెక్కుకైవడిన్. 1

చ. సుమరస మానుతుమ్మెదలు "జు"మ్మని వెంబడి మ్రోఁగ, గాలి బు
ష్పము లిల వ్రాల నూఁగుతరుశాఖలు, వందిజయాంకగీతముల్
రమణుల యోరచూడ్కులపరంపరలన్ విసరన్ దదీయవృ
త్తము నృపురాక స్వాగతముదారిని గ్రీడికి సంతసం బిడెన్. 2

చ. నలినరజఃప్రసారముల నవ్యసుగంధము నూని జాహ్నవీ
సలిలసముద్గతాంబుకణజాలములన్ జలువ ల్వహించి మి
త్రులలిని మందమారుతము తో నెదురై చనుదెంచి ప్రేమ జొ
బ్బిలఁగఁ గవుంగిలించుకొనె వీజనపాద్యము నిచ్చి యర్జునున్. 3

చ. నరుఁ డటు లేగుచుండఁ గెలనన్ జలపాతము లడ్డుఱాలపై
నుఱుకుప్రవాహవేగముల నుద్ధతి మాటికిఁ దోఁచి యాఁగుచున్
గురునినదాళి, యంచమొలుఁగుల్, వరసారసనాదముల్, శ్రుతిన్
నెఱపఁ గిరీటిరాక నట నించె సుమంగళతూర్యవైఖరుల్. 4

చ. తటముల కాని నిండుపస దాఁటుసురాపగముందు ప్రబ్బలుల్
దటుకున వ్రాలి వాహినిబలంబుఁ బవిత్రతఁ దెల్పుపోల్కి న
చ్చటఁ బడుపాటె మ్రొక్కఁగ నెసంగఁగ నెత్తగు దేవదారు వు
త్కటముగఁ బార్థుశ్రేయములఁ గాఁగలపెంపు నెఱుంగఁ జాటెడున్

ఉ. కుంకుమ సోఁకి తామ్రరుచిఁ గొల్పుసరిత్పటమట్టు లూఁపుమే
ల్పొంకము లొప్పఁ బద్మరజము ల్వడి కెంపగుమేనులన్ నిరా
తంకముగాఁ జలజ్జలపదంబులఁ దోఁగు మరాళమన్మథ
యాంకమనోజ్ఞకేళి కెగయంబడి క్రమ్మఱ పక్షు లద్దిరా! 6

గీ. వన్యక్రీడల గిరిగంట్ల కేమిః చిందు
మదమునన్ హాయినొందు తుమ్మెదపడఁతుల
చాలుఁ గనఁ గ్రీడికందోయి చాలకుండె
శ్రేష్ఠ లిడుపీడయును బెంపుఁ జేర్పుఁ గాదె. 7

ఉ. చెంగటిహేమసానువులు చిమ్మకడానివహారంగురంగు లు
త్తుంగతరంగపాళికిఁ బ్రదోషకళ ల్గలిగింపఁ జక్రివా
కాంగన పుంజపుల్గుపొడ నందుల గుత్తిడ లేక దీనమై
క్రుంగుచు నంగలార్పఁగ నరుండు వినోదము పొంగఁ గన్గొనన్. 8

చ. కళ లుదయింపఁగా వలచుకామిని కాంతుని రాగపూర్ణదృ
ష్టులఁ గనుమేల్మిచిత్త మురుశోభఁ జెలంగె మునింగి నీటిలోఁ
వలఁ గలసన్మణుల్ తమప్రభన్ జలదూర్ములపైనఁ జిత్రరా
గలలితచంకృతుల్ నెఱపఁగన్ దరిముట్టనికోర్కులూరఁగన్. 9

గీ. శిలలపైఁబడి యుద్ధతి నలలు లేవ
నోరుగాలియు వాని నం దూఁపి విసర
విరియుకాశాగ్రిసమములౌ నురుఁగు లం దె
సంగె గంగాకృతాట్టహాసంబు లనఁగ. 10

గీ. నెమలిపురికన్నులట్టులు నీటిపైన
మదకణంబులు విరియ నున్మత్తగజము
కేళి సలుపంగ నది మించుబాళి వేయి
కనుల దానిని గనుచుండె ననఁగఁ దోఁచు. 11

గీ. నిద్ర లేచుప్రమద నిండావులింతలోఁ
బ్రమదబాష్పములను వదలుపగిది
దరిని వ్రీలు శుక్తి తరలించెఁ దెలిముత్తి
యముల నరుఁడు వింత లడరి చూడ. 12

క. పగడపుఁదీవెచిగుళ్ళన్
దగిలినతెలినురుగుచినుకుతండము తమినె
చ్చఁగఁ జేయుమోవికాటుల
కెగసినప్రియుపంటివరుసయే యనిపించెన్. 13

చ. కరికలభంబు లేటిజలకంబుల సందరుదెంచుచుండ ముం
దరఁగలపోకఁ బోయినమదంబులవాసన రోస మెక్క స
త్వరమున నుద్ధతిన్ మలయవచ్చెడినో యివి యిట్టులంచు ని
వ్వెఱపడి చూచెఁ బాండునృపవీరుఁడు నిక్కనకౌతుకంబునన్. 14

క. మిన్నంట నెగయుకుతుకము
న న్నాగేంద్రములు బుస్సనన్ శ్వాస లిడం
గ న్నిరెగసి శరద్ఘన
సన్నిభమై వింత సవ్యసాచికిఁ బెంచెన్. 15

క. పులినములే పిఱుఁదులు మీ
నులె కన్నులు నైన గంగనున్ దుల్యకళా
విలసనములఁ గొలుచునుపన
దులఁ గాంచి నరుండు వానితోఁ బ్రవర్ దాఁటెన్. 16

ఉ. పల్లవపత్త్రపుష్పఫలభారవినమ్రశిఖాళి వృక్షముల్
కొల్లగఁ జుట్టు నొప్ప గిరికొట్టకొనన్ సుమనోమనోజ్ఞమా
చల్లనియాశ్రమస్థలికి శక్రసుతుం డతిభక్తి నెక్క సం
ధిల్లినపోయి భావిశుభదీప్తిని బెల్లుగఁ జాటుచుండఁగన్. 17

గీ. పూవుఁదీవలు ప్రతిసానువునను బండ్లఁ
దనరుతరువులు ప్రతివనమునను వెలయ
నిర్జనంబైన యచ్చోటు నించె నరున
కంచితోత్సాహ మటఁ దపం బాచరింప. 18

## — అర్జునతపోభివర్ణనము —

గీ. యోగవిధిఁ జిత్తవృత్తుల నాఁగునరున
కలఁత యనిపింప దట ఘోరమైనతపము
తెగువ సాత్త్విక త్తవృత్తులౌ తగవరులకు
శ్రమ నిడన్ జాలునది త్రిలోకములఁ గలదె? 19

ఉ. కన్నులపండు వౌ వెలుఁగు గాత్రలఁ దమంబు శమించురీతి నా
త్మోన్నతిఁ సూర్చుమైత్రిముఖరోరుగుణంబులకల్మిఁ బావసం

ఛన్నత వాసి జ్ఞానకళ చక్కని శోభలఁగూర్ప నెంతయే
నన్నరుస త్తపంబు పెనుపందె సితార్ధసుధాకరాఖ్యతన్. 20

గీ. కలిగినవివేక మగుణసంకల్ప మడఁపఁ
జిరసుఖప్రీతిఘాతియౌ చిత్తవృత్తి
విషయసంగతభోగంబు విడిచె; జనులు
భానుఁ డుదయింప దివ్వెల వదలుపగిది. 21

గీ. తపము జప మర్చన మహింస దనర శ్రీద్ధ
వఱ్ఱిఁ గొల్చెడినియతిచేఁ బ్రాప్తనైజ
శాంతవీరరసంబులఁ జాటునరుని
మహిమ సకలాద్భుతం బయి మహిఁదనర్చె. 22

గీ. ఇంద్రనీలసమానాభ నెసఁగుకీర్తి
యనుదినస్నానజనితజటాళిరుచుల
వఱలె నరుణోదయారుణప్రభలు శిఖల
మెఱయఁ దోఁచుతమాలభూమిరుహాలీల. 23

గీ. యోధవేషం బోరులభీతి కొదవియున్న
నకుటిలాత్మశుచిన్ మించె నతఁడు మునులఁ
గానిచో నిట్టితుష్టిమృగములఁ గలదె?
పరమదయ యెవ్వరిని దృప్తిపఱప లేదు? 24

చ. విసురుడు మాని గాలి కడుపీ లగుపోకడ నిల్చి నిల్చి యం
దెసఁగఁగఁజేయుచల్వలకు నీనెడుతావికిఁ బ్రొద్దు వేడి పె
చ్చుసెగలు చల్లఁబారి నరు సోఁకి పవ ల్నడిజాముదునే
నొసఁగెడి నిండుహాయి నతఁ డూనినపూనిక పెంపుఁ జెందఁగన్.

చ. అతనితపంబువింత మెయికబ్బినగగ్గురు లేఁజిగుళ్ళు కీ
లితవిపులాంజలిప్రభ లలిన్ సుమవర్షముఁ గూర్ప రెమ్మ లా
నతములు గాఁగఁ జూచి కెలనన్ దలలూచి నిశన్ నిశన్ ద్రుణ
ప్రితతులమెత్త వానికయి వ్రాల్చు నటన్ గలభూరుహోత్తముల్.

ఉ. అద్దిర ! మబ్బులేనిజడి నాకసముల్ రజముల్ హరించునా
యొద్దిక భూతముల్ నరునియుగ్రతపంబునఁ జిక్కువానిదీ

వృద్ధయఁదాల్చి చేరి సమయార్హసపర్య లొనర్చి నిత్య మా
పద్దశ మాన్ప నాతనితపంబును వర్ధిలె నాఁడునాఁటికిన్. 27

గీ. గొప్పఫలమును సూచించువిప్పు నొందు
కడఁకపువుఁగని గర్వంబు పడఁ డతండు;
నిబ్బరము గల్గువారికి నిండుమంచి
వెలసియును వారిధీరతఁ గలఁపఁగలదె ? 28

గీ. కొలఁదిదినములనే యొండ్ల కలవిగాని
హెచ్చు గడియించెఁ దపమున నీతఁ డనుచు
వింత జడుపు విషాదంబు వెలయ గోత్ర
పాలు రపుడు శతక్రతుప్రోలి కరిగి. 29

—♦ గోత్రపాలురు పార్థతపమునుగుఱించి శక్రునితోఁ దెల్పుట ♦—

ఆ. ఆజ్ఞఁ గొలువుకూటమందుఁ బ్రవేశించి
పుడమి సోఁక మ్రొక్కి తడయ కచట
గోత్రభిదునితోడ గోత్రపాలురు వీను
విందొనర్చునుడుల వినిచి రిటులు. 30

గీ. "అయ్య ! మీయింద్రకీలపర్యంక మొంది
వల్కలి యొకండు రవిశశివహ్నులకుఁ దు
రీయుఁడై గెల్పుకోర్కి నమేయతపముఁ
బూని లోకంబు లక్కాక బూరటిల్ల. 31

చ. కరములు గావు పీనభుజగద్వయ మాతని కేలుదోయి, త
ద్గురుతరచాపమో వగలు గుండెదిగు ల్గలిగించు, రాజస
స్ఫురణము లిట్లు; మౌనిజనమోహనమై మహనీయ మైనస
చ్చరితముతోడ సాత్త్వికవిధానము నిత్యపథంబు వానికిన్. 32

ఉ. గాలి సుగంధసంపద సుఖం బిడు, నూత్నతృణాంకురాఢ్యమై
మే లగుశయ్యఁ గూర్చు నిల, మిన్నొ కడున్ విమలంబు, నీరమో
ధూళి నడంపఁగాఁ గురియుఁ దోయదసంతతి లేకె, తద్గుణ
శ్రీలకు ముగ్ధలై సలుపు సేవలు వానికిఁ బంచభూతముల్. 33

గీ. సహజవైరంబు లేమిటి జంతువితతి
వాని దరిఁ జేరు, గురు శిష్యవర్గ మటులు;
పూ లొసఁగఁ జెట్లు కొమ్మలు వ్రాల వంగు,
నార! మిముఁబోలి గిరి వాని నరయు వశత. 34

చ. అలసట లేమి యాతనిమహత్తరసత్త్వ మెఱుంగఁజేయు; ద
ర్పలసిత ముత్తమంబు నగు వానిశరీరము గెల్పుఁ దెల్పు; ని
స్తులశమశీలి యయ్యు నినుచున్ దొలిమాపునకున్ గభీరతా
కలితవిభుత్వసంపదలు కన్గొనువా రెద జంతు నొందఁగన్. 35

గీ. నీదుకేళీవనంబున నిలిచి తపము
సేయునాతఁడు మౌని వంశీయుఁ డొక్కొ?
దైత్యకులజుండొ? పృథురాజతనయుఁ డేమొ?
యెవఁడొ? "యిదమిత్థ" మని నిర్ణయింపలేము. 36

ఉ. ఏబహువాంఛ లూని తపియించునొకో? కలరా పెఱుంగుఁడీ!
మాబడుగున్ వచస్సులు ప్రమాదసమేతము లేమొ చూడుఁడీ!
మాబలఁగంబుతప్పులు క్షమన్ గని దేవర! సైఁపుఁడీ! పశం
బా! బుధపాళిఁ గా కడవిమానిసులన్ సువివేకమున్ గనన్" 37

క. అనుగుహ్యాకువిన్నపమును
విని చిత్తానందకరము ప్రియసుతునితపం
బని హర్షకళికలన్ బొం
దెను మఘవుఁడు; రాజబుద్ధి నీతితెరువొకా! 38

ఆ. అఖిలకృతుల నవ్వ డాఁపి యింద్రుఁడు దివ్య
దృష్టి నరునిభక్తిదీప్తి నెఱిఁగి
తెలియనటులు వాని స్థిరచిత్తపరిశోధ
నమున కిట్టు లనియె నమరసతుల. 39

—♦ అర్జునప్రలోభమునకు శక్రుఁ డచ్చరల నంపుట ♦—

చ. "ధృతిఁ గరఁగించి మించువసతిన్ గలదే మిముఁబోలి యేకమై
యతిసుకుమారమై యణువునై కడుదూరగమై యమోఘమై
ప్రతిఁబొనరింపరానిగురుబాణ మికొక్కటి చిత్తజాతును
ద్ధతికిని దోహదం బొసఁగుదర్పకమార్గణపంచకంబునన్. 40

ఉ. సంసృతిఁ బాయ మోహముపసన్ మసి చేసిన యోగులన్ రజ
స్స్రంసనమౌ పరార్థ మగుజ్ఞానపయస్సున ; నాజలల్ వడిన్
ధ్వంసము గాట వింత యగునా? యరమోహుపులఁ గన్నుదోయిటన్
శంసల మీరు గోలుటకు సాగిన నన్నువులార ! తెల్పుఁడీ ! 41

శా. లావణ్యంబు జగంబులన్ జెదరి నిల్వన్ సృష్టివైచిత్ర్యపున్
జేవన్ బూర్వము బ్రహ్మ యంతయును రాశింగూర్చి మీయాకృతు
ల్సాధిర్భావము నొందఁజేసె, జనము ల్స్వర్గంబురాఁ దీవ్రవాం
ఛావిద్ధాత్మకులై కుతూహలముఁ జెందన్ సుందరీబృందమా ! 42

మ. కృతులన్ బాటల నాటితీరి హితశక్తిన్ మించు గంధర్వసం
తతితో నాతనిఁ జేరి విఘ్నమిడుఁ డింకన్ బొందు, నిష్కాములై
జితసర్వేంద్రియు లైనయోగులనె నిర్జింపంగ మీ కీసుఖా
యతనున్ నొంచుట యెంత? యొక్కతుత్రిటిఁ గాదా గెల్పు
మీ కచ్చటన్. 43

శా. ఇప్పీ ! యాతఁడు వీతరాగుఁడఁటె? కాఁనే కాఁడటం జంప నా
తెస్పా సంపద నొంద దృష్టి నిడె, నట్లే కానిచోఁ జూడుఁ డా
నిస్సంగత్వము మోక్ష మేడ? రణచిహ్నీభూతమై వెల్గునా
నిస్సీమాశుగచాపధారణము మానిత్వంబు నేలా తగున్. 44

మ. " అతితేజస్వి యతండు కోపనమునీంద్రాగ్నికమ ట్లాగ్రహా
ద్ధతి మమ్ముం గలఁగించు "నంచు భయ మందం బోకుఁడీ! యాత్మసా
ధితకీర్తిన్ విరళించువిక్రమధనుల్ స్త్రీహింస కింతేనియున్
మతిఁ జోటీయరు నమ్ముఁడీ ! కృతిఁ బ్రశంసాస్ఫూర్తి సాధింపుఁడీ!

ఉ. ఇంతగఁ బెద్దఁజేసి వచియించినస్వామిబహూకృతోక్తులన్
స్వాంతము లింతలై యెగయ సంతస మాస్యములందు వింతసొం
పొంతయుఁ బెంప నప్సరస లేపునఁ బొంగి ర టోలగంబునన్,
గాంతి నొసంగకున్నె యధికారులమన్నన సేవకావళిన్ ? 46

ఉ. చన్నులవ్రేఁగు నెన్నడుమునున్నసన్ జళుకు ల్ఘటింప వే
ల్పున్నెలజవ్వనుల్ తరలిపోవఁ దదీయవిలాసవార్ధిపొం
గు న్నుతియించుచున్ స్థిరతఁ గూరి యచంచలపద్మలక్ష్మి త్రఁ బా
ల్గొన్నసురేంద్రువేయికనులున్ గనఁ జాలకపోయె ముంపునన్. 47

# ఏడవ సర్గము

—:o:—

—* అప్సరసలప్రస్థానము *—

చ. అదిగో? మృదంగనాదము! వియానగుహాబహుళీకృతధ్వనిన్
జదలఁ బ్రయాణభేరియయి చాటె, నదే! ఘటు, లాపయిన్ వడిన్
గదలుపతాకలన్ నడుచుకమ్రరథంబులు నల్లవే! సిరుల్
పొదలఁగ వారె! యచ్చరలు! పోయెదు గుహ్యకసంవృతస్థితిన్. 1

మ. అని పౌరుల్ వెనురక్ష్యలం దెడము లేన ట్లాఁగి సోత్కంఠులై
కనుచుండంగ సురీకదంబకము స్వర్గద్వారనిష్క్రాంతమై
చనుమార్గంబు దినేంద్రుబాట కుపరిస్థం బాటచే నాతప
త్రనికాయం బట వ్యర్థమయ్యెఁ గడుసౌందర్యంబె నించెన్ దివిన్.

చ. గొడుగులచేత పైఁజనుటకున్ వెర వేదినయెండవేడిచే
గడుసుతనంబుతో నెదురుగా వడి వీఁచుసమీరుతాఁకు చేఁ
దొడరుశ్రమన్ ముఖుంగుకనుదోయియు నెఱ్ఱనఁ దేరుబుగ్గల
ప్పుడ వికుకల్వలన్ దలిరుమూఁగుసిరి న్గళవోల్చె వారలన్. 3

ఉ. కాళులమార్పు తోఁపని చకాచకఁ బేరెము వారువారువాల్
గాలుల మేఘపాళిగతిఁ గాఁగ బడిన్ వడిఁదేరు తేరులున్
గ్రాలఁగ నేమినిస్వనము కల్గను మింట విమానయానకే
ళీలలితోద్గతిన్ గెలుచులీలలఁ దగ్గమనంబు వర్తిలెన్. 4

చ. అవనికి డిగ్గుదేవసతులందుఁ దదంశలు సంక్రమింప ను
ద్భవమయి పూసవారు శ్రమవారి గగుర్గొను, చంటిపూఁతలన్
దివు తిలకంబు నెన్నుదురు తెన్నుల గుత్తపుముత్తియంబులై
సవురె యొసంగె; సాజమగుచక్కనకున్ వికృతుల్ నగల్ సుమీ!

చ. ఉరవడి నేగుతేర్లపయి నొప్పుల నొప్పుధ్వజాంశుకంబులు
ప్పురముఁ గ్రమించుపెన్ గొఱవి పర్వులుగా నొరగల్లుమీఁదిబం
గరు నెఱిగీట్లుగా రుచులు గ్రాలఁగఁ దెంపులు లేనిబారులు
ద్ధురగతిఁ బెంపులై సిరులఁ దోపఁగఁ జేయఁ జలించు నద్దిరా! 6

చ. దిరిసెనపూవుకోమలత దీటునఁ బుచ్చుసుకీతనూలతల్
పదుసనియొండవేడి సయిపన్ సయిపన్ గని బాట నెంతొ యు
బ్బురపడుగుహ్యకప్రతతి ముచ్చటమైఁ దమలోన "నద్దిరా!
పరమపవిత్రమానలువపం పతిసాధువ" టందు రొక్కటన్. 7

గీ. చెందిరపుఁజర్చ లపరంజి సిరుల బెళుకు
నినుప సప్తమదంబుల నించుమత్త
సురగజంబులు రవిదీప్తు లొరయ మెఱసి
కురియు సప్తాంబుదంబుల మురువు లొసఁగె. 8

ఉ. తాళఁగ రానియుష్ణకరుతాపము పెల్లు భరింపలేక త
ద్గోళము దవ్వుదవ్వయినత్రోవఁ బ్రయాణము చేసిచేసి యా
పాళెము చేరె దిక్కులను బట్టనిపొర్లున నేకవేణియై
క్రాలి మహోర్మికావళులకమ్రితఁ గొల్పువియత్తరంగిణిన్. 9

ఆ. గడుసుషట్పదములదుడుకుపోక కలంగి
రేఁగి కలియుపద్మరేణుతతులఁ
బుణికి గంగయలలఁ బొంది చల్లనఁ బొల్చు
మలయ మమరసతులయలతఁ దేర్చె. 10

గీ. శ్రేణులై గాలిరథములు చెంతలం ద
పూర్వతటసంపదన్ గూర్పభూరిగజతు
రంగహతనాకగంగాతరంగసమితి
తాఁకి క్రమ్మఱుఁ గ్రొత్తవింతన్ ఘటించి. 11

ఆ. ఇరుసుకొనలు సురలయిండ్లవేదికల రా
చికొన గ్రహపథంబుఁ జేరి గాలి
తేర్లు నేమినిహతిఁ దిరుగుడువడు నీట
సుడియఁ జేయు మొయిలుతుదుము నెగచి. 12

ఉ. మత్తసురేభదంతపదమర్దితవారిదపాళి తామసా
యత్తముగాక శీతలపయస్సులఁ గూర్చుచుఁ దేర్చు నేనుఁగున్
మొత్తములన్; మహాత్ము లభిభూతిని గూర్చుఖలాత్ములైన స
చ్చిత్తమునన్ మహోపకృతిఁ జేసి తెమల్చుట నైజమేకదా. 13

ఉ. హాటకసన్మణిప్రిభల నాయతమేఖల లాడుబాడుగా
చీటికిమాటికిన్ మలయశీతలవాయుభుజంగుఁ డప్సరః
కూటనితంబవస్త్రముల కుచ్ఛ్రితులం దెగుచు ల్ఘటింప నా
బోటులలోని చెడ్డికలుము ల్ తెరమాటులఁ దొంగిచూచెడిన్. 14

ఆ. కరఁచె బొట్లు మంచుఁ గల్పించి యని దూఱ
కంబుదంబు నెన్ని రమరసతులు
శ్రిమ హరించె నంచుఁ జక్కనిగొప్పమేల్
సెడునె కొద్ది తప్పుచేత నెందు ? 15

ఉ. చుట్టు నలల్ చలింప నడిచో సికతాస్థలుల న్ని సీరముల్
వట్టినమేఘముల్ జలదపాళులలోన నెసంగుచుండఁ గ
న్పట్టుసురేంద్రచాపమునఁ బర్వనెడంబులు దేవసుందరీ
పట్టమణిప్రభాభిగతిఁ బాల్గొని పిండున నిల్చు మింటిపై. 16

ఉ. శూరవరుండఁటే! దృఢవిశుద్ధతపస్వియఁటే! యెటు ల్దరిన్
జేరుటొ? యేక్రియన్ నియమిశీల మగల్చుటొ? యంచు నెన్ను బృం
దారకసుందరీమణులు తా రుడువీథిని దాఁటి స్వామియా
జ్ఞారతిఁ జేరి రంబుదవిసర్పితకూలము నింద్రకీలమున్. 17

—♦ అచ్చర లింద్రకీలముపై విడియుట ♦—

ఉ. దేవవిలాసినీనిచయదివ్యముఖాబ్జములన్ బరిస్ఫుర
చ్ఛ్రీవరనేత్రమీనముల, శ్వేతకళామహితాతపత్రఫే
నావిరళాభ, దుందుభిరవాపతదూర్మిగభీరవైఖరిన్
భూవహుపై వియచ్చరచమూదివిజాపగపొంగు రాజిలెన్. 18

ఉ. నింగికి శృంగికిన్ జనఁగ నిల్పినవంతెనయట్ల పయోదపా
ళిం గడు వేగమూని రవళిన్ రథముల్ డిగుచోఁ దురంగరా
జిం గనఁ జిత్రమా బిగువుఁ జెందెడివాగెల నిక్కుమోర తె
ల్లం గుదియంగ వంగుచు నిలన్ వెనుకప్పముతోడఁ జేరెడిన్. 19

చ. తమ కిరువంకలన్ ఘనవితానము లంటి చెలంగ నింద్రకీ
లముదెస డిగ్గుమత్తకరులన్, గురుమేఘవృతాద్రిరాజున

త్తముపయి నాఁగువారణవిధంబున డంబెసఁగన్ బ్రిడీనతా
గమనముచేత నబ్ధి డిగి క్రాలుసపక్షగిరీంద్రవైఖరిన్. 20

ఉ. ఆగిరిమిట్టపల్లములయందును, మింటఁ జరించునంతవె
న్వేగముతో హయ ల్చనెడువేళఁ దదీయఖురాంకపాళి త
ద్భాగమహాప్రవాహినుల వర్తులసైకతవేదులన్ సమ
శ్రీగుణితప్రభన్ వెలయఁజేసి గిరిన్ గయిసేసెఁ బూర్తిగన్. 21

పంచ. నగోపరిస్థలంబులన్ ధ్వనజ్జలాతిపాతనా
దగౌరవంబుతో మిళద్రథస్వనంబు లద్రిసా
నుగండఘట్టనన్ బ్రతిధ్వనుల్ ఘటింప వర్షమే
ఘగర్జలన్ భ్రమ న్నమి ల్లగంబడున్ గనన్ గడున్. 22

చ. చెలి! కనుఁగొంటె? మేఖలలఁ జిక్కనిచక్కనినిగ్గు లొగ్గుప
చ్చలయెడలేనికాంతులకు సానువులన్ బడునీటిధార లొ
ప్పు లోలుక నేకనీలమణిపొందిక మింట హారం గొసంగు నం
చలరి యొకళ్ళొకళ్ళుఁ బుసులాడుదు రాదిగుబాట నచ్చరల్. 23

శా. ఆలానంబులుగాఁగ నేగుకరిణీవ్యాజంబు లాకర్షణన్
బాళిన్ గొల్పఁగఁ వీడఁజాలక ప్రియాణాం బెట్లొ సాగించు స్వ
ర్వ్యాళంబుల్ పవమానసీతధరణీభద్రేభగంధోత్థక
ల్లోలక్రోధము మావటీండ్రతెలువుల్ ద్రోయంగఁ బ్రేరేచినన్.

చ. గరువులఁ గ్రొత్తనీటిమొనకంబున, గాలుల రేఁగుదువ్వచే
నరుణిత మైనసేన యపుడప్పుడ తీఱిన వానకారునన్
వఱదల ఘూర్ణమానమయి వచ్చుసురాపగపొంగుఁబోలి త
ద్ధర వనసీమలున్ గహనధాత్రిలు నిండెఁ జలద్రివార్భటిన్. 25

ఉ. ఆగతి వచ్చివచ్చి దివిజాపగచెంత నివాసయోగ్యభూ
భాగములన్ మణిప్రచయభాసితసైకతవేదులన్ సుమా
ళీగుణితాయతప్రభల తెన్నసుఖం బిడుశాద్వలంబులం
దాఁగి మహాకుటీరనిలయంబులఁ బన్నిరి సైనికాగ్రిణుల్. 26

ఉ. కుందనపున్ జిగుల్ దెసలఁ గొల్పుమహేంద్రగిరీంద్రశోభ పెం
పొందె సితాంబరప్రచయయోజితదేవకుటీరరాజిచే;

నందనిమేలు నుండు నె మహాత్ముల భక్తిసమేతసంగతిన్
జెందవె యోగముల్ గుణవిశేషతఁ గోర్కులకెల్లఁ జెల్లుగన్.

గీ. అడవిఁ గాచినవెన్నెల లగు సుగంధ
పుష్పతరులుఁ జిగుర్చు నపూర్వలతలు
సఫలతన్ జెందె నప్సరస్స్నానుభూతి
పరుల నలరించునదె కాదె భవ్యలక్ష్మి. 28

చ. నిల రలచందనాగములనీడల సేదఁ జలించునచ్చరల్
చిలువలబుస్సలన్ గదలు లేఁజిగురు ల్లని, దుర్విసీతులా
తులువలు మూఁగియున్న దొరదొడ్డతనం బెటు లున్న, నెంతకా
వలసినకార్య మున్న నటువైపు చనన్ వెఱఁబొందరే జనుల్. 29

శా. అంభోమార్గము నంటుచప్పరము లాద్యంతంబుగా విప్పి త
త్కుంభీంద్రంబుల మావటీండ్రు నయమున్ గుర్తించి క్లేశంబు వో
వం భూమిన్ నిలుపన్ యుగాంతపవనవ్యాధూతవృక్షంబులా
గంభీరాయతకుంభిసింధురసమగ్రశ్రీ లటన్ వర్తిలెన్. 30

చ. బడలిక వాయఁగా దివిజభద్రగజంబులు నిద్రవోవున
య్యెడ నెడలేనిధారల రహించుమదంబు గ్రహింప వారులై
విడిసినతుమ్మెదల్, నిదురవీడి చివాలున దంతులెల్ల లే
చెడివడిఁ, బాఱిపోఁ దుటితశృంఖలలన్ దలపించెఁ జత్రమై. 31

మ. అవనీమత్తమతంగవాసనలరోషావేశముం గాంచి యు
ద్ధవిడిన్ డీకొనుపూన్కి కడ్డగువియద్గంగాప్రవాహంబు దాఁ
టువెనన్ దూఁకునుపర్వనాగములు గండున్ మావటీండ్రంకుశా
ళి విధింపన్ బడిపో విదల్చి చనెదున్ లెక్కింప కారోహులన్. 32

ఉ. నిండుగ నీరు తొండముల నింపి శ్రమం బఱఁ దావి శేషమై
యుండినవారి హస్తిపకుఁ డొప్పుటఁ బై కెగయింప నోడుచున్
గండములందె చిమ్ముకొనఁగా జలశీకరపాళి తన్మదా
ఖండసవర్ణతన్ గురిసె గారులశౌర్యముఁ దెల్పుకైవడిన్. 33

మ. మును డప్పిన్ జదలేటి చల్లనిజలంబుల్ సుంత మూచూచి భూ
వనగంధేభమదంబువాసనలతోవల్ దాన గుర్తించి యె

త్తినరోషంబునఁ దివ్యదృష్టి నెదుకాతీరంబు నీక్షించుఁ గా
ని నిలింపోత్తమకుంజరంబు కొన దా నీ రొక్క చుక్కేనియున్.

ఉ. వారి నవారణన్ సమదవారణరాజి నవారుణప్రభన్
వారు స్వకీయదానపరివర్తితసౌరభమున్ ఘటించి య
వ్వారిగ వారిజోద్గమితబంధురకేసరగుప్తదానరే
ఖారమఁ బద్మగంధముల గట్టిన కెక్కు సుకేసరిప్రభన్. 35

ఆ. దండుకముపుధూళిదట్టంపుపెట్టిన
రదివిముక్తపద్మరజపుఁబసపు
గంగ తెల్పుకలయికన్ దేలియాడంగ
రంగురంగుకోకరాణ చెలఁగె. 36

శా. శ్రీగంధాటవిలోఁ బిఱుందిపదముల్ గ్రీవంబులున్ శృంఖలా
శ్రీ గుప్పింప నితస్తతశ్చలనముల్ చెన్నారఁగాఁ జిందు దా
నాగారంబుల బిందుపాతములతో నాహస్తులొప్పెన్ స్రవ
చ్ఛ్రీగండోపలలోలనంబుసొబగుల్ చిప్పిల్లునో ప్పల్లుచున్. 37

ఉ. శోణితములందు దానములసోనలు వెల్వడి ముంపు నింప న
త్యాతతరేణునిష్కృతి సమస్తలతాంతసుగంధవిచ్యుతుల్
నూతనఫుల్లపృథ్వికల నున్నవిపూవులతావి జొబ్బిలన్
శీతలవాయు వావరుసఁ జిందిడువాసన లందుఁ జిమ్ముచున్. 38

శా. సుప్తిన్ జెందుహరుల్ హాతాద్ధ్వనికి సంక్షోభించి మేల్కాంచి యా
గుప్తధ్వానముఁ బోల్పలేక దివిఁ గన్గో, ఘోరజీమూతసం
ప్రాప్తిన్ వర్తిలు గర్జ యంచును మయూరాదుల్ భ్రమన్ జెంద ది
గ్వ్యాప్తిన్ దివ్యమహేభబృంహితరవవ్యాపారముల్ మ్రోఁగెడిన్.

ఉ. ఆవనవృక్షరాజిఁ గొనలందుఁ బటంబులు సొమ్ము లుంచి యా
దేవవిలాసినీమణులు తీఱిక నీడల విశ్రమింపఁ గే
ళీవనులన్ లతాగృహావలీకములన్ నగ లుంచి మారచ
ర్యావిలదేహులౌ రమణు లందు శ్రమన్ విడులచ్చి సంధిలెన్.

# ఎనిమిదవసర్గము

—(o)—

—♦ అచ్చరల వనవిహారము ♦—

ఉ. కోరికతోడఁ దోడన నిగుడ్చిన గళ్ళనగళ్ళకాంతి చె
ల్వారునవారుణాదిమణిహారసుహారికవాటవాటికన్
జేరులఁబారు లింద్రువిలువేరుల మీఱఁగ గోపురాళితోఁ
సారిడునూరు నిత్యకళఁ జానలు మాని విహారవాంఛలై. 1

ఉ. ఇచ్చమెయిన్ బ్రఫుల్లజలజేక్షణ లాత్మతనుప్రభల్ గిరిన్
హెచ్చగునీరపాళి వెలయింపఁగ గుహ్యకయుక్తలై కనన్
వచ్చుచు మాటువారుచుఁ జనన్ జలదంబులఁ దళ్కుతళ్కునన్
ముచ్చట లీనుమెర్పులను మోహముఁగూర్చు మనోహరంబుగన్. 2

మ. శ్రమచేతన్ బిగువేదుచున్నకుచముల్ జౌకాడ, వేంచేయువే
గముచే భూషలు కాంతులీను చలియంగా నాట్యమాడన్ వన
భ్రమణం బిచ్చె నితంబినీమణులకున్ బ్రత్యగ్రసౌఖ్యంబు స్వ
ర్గమనోత్కర్షకు వేమడుంగులుగ నుత్కంఠల్ విజృంభింపఁగన్. 3

చ. గుబురులుగా ధరన్ దగులు కోరకితమ్ములఁ గొమ్మలన్ బథిన్
బ్రబలిన చెట్లమధ్యమునఁ బాటలఁ బాటలగంధు లెల్ల ర
డ్డుబయలుసేఁత కోడరు; కడుంగడువింతలచోట్ల ముందుముం
దుబమలఁ గాముకుల్ గనఁ గుతూహలితాత్మఁ జరించు టబ్రమే?

ఉ. లత్తుకయెఱ్ఱనా కరములన్ గిసలమ్ములుగా, సితప్రభల్
జొత్తిలుగోళ్ళఁ బూగుదులచొప్పుగఁ జేతులఁ దీవెలట్లుగా,
హత్తినగంధచర్చఁ గుసుమాళిపరీమళమట్లు లెంచి యా
బిత్తరులన్ బికంబులును భృంగములున్ వెనువెంటఁ గొల్చెడిన్.

చ. దరవికసద్గుళుచ్ఛసుధ దాఁటుల మాటికిఁ జంచరీకముల్
మురియుచుఁ గ్రోలరాఁ గిసలము ల్గలశాఖలచే నశోకముల్
దెరలఁగఁజేయ దివ్యసుదతీమణు లాత్మరహఃప్రియుక్తహా
స్మరచరితంబు జ్ఞప్తిఁబడ "జ"ల్లన నొండొరు కన్నుగీఁటెదున్. 6

ఉ. పల్లవసౌకుమార్యములఁ బాణులకున్ శ్రమఁ గూర్చి దేటి కో
హల్లకగంధి! కల్పలత యన్ భ్రమఁ బైకొనుభృంగరాజు భీ
తిల్లుట కల్గునే? తెలిపిఁ ద్రిక్కఁగనీయక యెంతలైనఁ బా
టిల్లిన నోర్చి కోర్కి నిగడింపక డింపఁడు గాదె గాదిలిన్. 7

శా. "ఔనే జాణవు! లేసకోపమున నాస్యం బేలకుంచింతువే?
నీనాథున్ దమి తేవఁ గోర్కి విడ మన్నింపన్ జనన్ రాదె? లే
దా! నీమానస మెన్ని యోవగల బాధల్ చెందు భద్రం బటం
చానారీమణులం దొకర్తు సఖి సయ్యాటంబునన్ దేర్చెడిన్. 8

చ. విరిసినతెల్లువెన్ను తెలివి స్తృతి కట్టుదుకూల, మూర్ఛబె
గ్గరువరుసల్ రణద్రశన, కూలమె నెన్నడు, మాగిరిద్వనాం
తరవిచరన్నదీసతికిఁ దగ్గను వేడుక వచ్చునావియ
చ్చరనయనానుమోద మిడఁ జక్క నలంకృతయట్లు రాజిలెన్. 9

క. డగ్గఱి నది మొగ్గనఁబడి
భుగ్గనుతుంపురులు విరిసి ముత్తెపుసరులో?
యుగ్గమానశ్రీహాసమొ?
యొగ్గినసతి శీతలూరువో? యనిపించెన్. 10

ఉ. ఫుల్లసుమంబు లక్షు లట మూఁగినతుమ్మెద లంజనంబులై
చెల్ల వినమ్రశీర్షములఁ జెంగట వర్తిలుతీవఁబోండ్లు రం
జిల్లినప్రేమచేఁ బెనుపుఁజెందినమన్నన దేవకన్యలన్
బెల్లుగ స్వాగతం బాసఁగువేడ్కఁ గనుంగొనురీతి భాసిలెన్. 11

గీ. భద్రగజమదసిక్తకుంభస్థలముల
ఘనకపోలంబులన్ ఊపుఁగాంచి నల్పు
మచ్చ లూనినగంధంపుమ్రాకు లందు
నీలగళుభాతిమై స్త్రీల నించె వింత. 12

క. కొమ్మలు తమ కందునటుల్
కొమ్మలు నమ్రిత సుమాళిఁ గొ[illegible]చి
త్తమ్ములు తేరఁగఁ దద్ద
త్తమ్ములె కొని రతనుచేష్టితమ్ములు వెలయన్. 13

క. ధవుఁడు విరు లొసఁగ బిగ్గర
సవతిన్ జేర్కొనఁగ మాటఁజాలించి దివుల్
దవిలి భువిరాయఁ బద మొక
యువిద మివులఁ గంట నీర మూరక యూర్చెన్. 14

చ. దయితుఁ డొసంగుపూలఁ గొని తన్ముఖదత్తనిరీక్షణంబులన్
బ్రియునకు నర్మవాక్యములపెంపునఁ బెద్దమకంబు నింపు నొ
క్కయువిద పీకుపోకముడిఁ గానక పేఁకొకచీరెఁ గట్ట దా
యయమునఁ బాణిపల్లవసుమాళి నెటన్ విడు బెన్న దింతయున్.

చ. చివురులలోనఁ బువ్వులఁ జేర్చి ఘటించినగుత్తిఁ బ్రేమతో
ధవుఁ డిడఁగా నొయారమున దానిఁ దలన్ ధరియించుఁ జాన చ
న్గవతరితీపునిక్కులకుఁ గమ్మనిరాపిడిఁ గూర్చి బాధఁ దీ
ర్చి వలుదతొవిబొందులఁ జరించి యటన్ మఱియొక్కకాంతకున్.

ఉ. నిక్క సుమాళిఁ గోయుతరుణీమణికిన్ జను తెక్క, నీవియున్
బొక్కిలినుండి జారి బటువుంబిఱుఁదుంగవ వ్రేలఁగా, వళుల్
చిక్కఁగ,నక్కళింత గమిఁ జెందినయారు మనోజబంధమై
గ్రక్కున దానికాంతుధృతిఁ గ్రాకొనె; నెమ్మొల నమ్మవచ్చునే? 17

చ. నెఱికురులెల్లఁజిక్కఁగొని నిల్చిన వ్రేలఁగ బాహుమూలముల్
సురుచిరతన్ బయల్పడఁ బ్రసూనశిఖల్ విడఁదీయు సాకునన్
దరుణి విలాసము ల్నెఱపి తన్మయమూరమనోజ్ఞదృష్టులన్
వరు నికటంబుఁ జేర్చుకొనె; భామల కమ్ములు నీటులేకదా! 18

చ. ఎగుబిగు పుబ్బుగుబ్బలను నేత్రాల నిచ్చుఁ దమిన్ స్వనాథుఁ జెం
దఁగఁ దగులెక్కి "గాలి కనుదమ్ములఁ జిందినపూరజంబు నూఁ
దఁగఁదగదే"యటం చురముదాఁటునఁ జన్నులదూఁటి మోముమో
ముఁ గదియఁజేర్చెఁ బ్రోడ యగుముద్దియ ముద్దున కెంతజంతయో!

ఉ. "ఈపువు మంచి" దన్న "నది యేపస యాననఁ జూడు" మంచుస
ల్లాపము లాడుచున్ దరువులన్ లతలన్ గలమంచిమంచి వ
ల్లాపములన్ గ్రహించుకొన నయ్యెడ రిక్తకుజాళి మాని త
ద్దీపితలక్ష్మి దివ్యసుదతీపదమున్ వరియించె నెంతయున్. 20

చ. చివురుల గిల్లుచో రసము చిందుటఁ జెందిరి మెచ్చుపాణులన్
బువులరజంబు రాలి తెలుపుంబస మించిన యుబ్బుగుబ్బలన్
దవిలినపుష్పవాసనలదండి గడించుతమాసుగంధతన్
మిపులగునైజదేహరుచి మెచ్చిరి చెట్ల సతుల్ కృతజ్ఞలై. 21

గీ. కరికరస్థూలసచివోరుఘర్షణముల
దీర్ఘతన్ గుంది ననమొత్తదేఁటి సమము
లయ్యె మాటికి సురకైపు నంపిన ట్ల
శక్తతన్ దూలి తొట్రిలు చరణములను. 22

గీ. మణులయొడ్డాణముల దీప్తిమలయు ద్విగుణి
తాభ నవసైకతస్థలీశోభ గెలిచి
ఘనపరిశ్రమ గురువులై కడుమనోజ్ఞ
శబలతన్ దాల్చె కుసురుల జఘనములను. 23

ఆ. అదరుతమ్మిమొగ్గ లనఁదగుబాహ్యుల
కళల నీవిదాఁపుగా స్ఫురించి
చనులవ్రేఁగు లొలయుటను సమ్రతం గాంచు
వళులనడిమికడుపుకలిమితోడ. 24

గీ. బెట్టుమంచునఁ బైఁ గనిపింపకుండు
తమ్మిరేకులవళుల విధమ్ముగాఁగఁ
జెమటచిఱుబొట్టు లెల్లెడ గుములుదేఱ
విమలములు కానికనుల ముఖములతోడ. 25

గీ. సానువులసానువుల గురుశ్రమల నల్ల
నల్లనన్ దారు తమతమవల్లభలను
వారి యంగాంగశుభసౌష్ఠవం బపూర్వ
కౌతుకం బిడ వీక్షింత్రు గగనచరులు. 26

— అ చ్చ ర ల జ ల క్రీ డ —

గీ. చేఁపకన్నులమీటుల, నూఁపుఁజెందు
తమ్మిమొగముల, శుభ్రతటమ్ముఁబ్రాఁకు

నలలచేతుల, నంచకూఁతలపిలుపులఁ
బిలిచె జలకేళికొఱకు వారలను గంగ. 27/1

మ. అదె! మందాకిని! స్వాగతం బొసఁగు మీనాక్షిప్రసారంబులన్
గదలన్ బాఱెడు తమ్మిమోముల నపంకస్వచ్ఛతీరంబునా
నుదలన్ సాఁగు తరంగహస్తముల నందుం గూయుహంసీగణో
న్మదనాదంబుల కేకలన్ దిరుగుఁ డమ్మా! వే జలక్రీడకున్!! 27/2

ఆ. ఉఱుకుపాటు వీడి, వడిమాని, తమ్మిపు
వ్వొడులఁ బుడికి యలలనడుమఁ జేరి
పడఁతు లీఁదుచోటఁ బయ్యెర చేయూఁత
లిడఁగ నిలిచినిలిచి నడుచు నచట. 28

చ. ఎదఁ దొలుకాడు బాళి వెలయించుఁ జడంతులయూఁత తూఁడుదిం
డ్లదొరలపెంపుమించె, పులినంబుల మీఱె నితంబభారసం
పద జఘనంబు, లబ్జములపర్వు హరించెను సోగకన్ను మే
లుక్కుదురులమోము; లత్తఱిని గుంఠితసామ్యము లీడువచ్చునే? 29

గీ. ఒడ్డుదాపునఁ జెదరుగా నున్న చేఁప
వరుసలం గని తొలిడిగ్గువరుస నడలి
యందు జక్కులు తెఱపిసేయంగ డిగిరి
బిత్తరులు నెట్లొ లేనితెం పెత్తినట్లు. 30

ఉ. పూనికఁ బెందొడల్ గదపు పుత్తడిబొమ్మలు నీట దూఁకుతో
త్రోనె తమంతఁ జీలి వడిఁ దోఁచినదొడ్డయలల్ గదున్ దదన్
మానక యూఁపఁగా దరుల మందటతప్పి కిలార్చి పిట్టలున్
జానగుమేటియెంచగుమి చయ్యన నిట్టటు తారె జంకునన్. 31

ఆ. ఇనుము మించుజక్కుచెకిమీండ్రిబొమ్మలుఁ
గొండఁ దెగడునువిదపిండుచనులు
నగచిమొగచి త్రోయ నింతలై తరఁగలు
తొలఁగి పారి దరులఁ గలఁగి మ్రొగ్గు. 32

గీ. వీఁపు తలకట్లు, తనువీఁగి యొడుగంద
మురిసివిరిసెడిపుప్పొడియునుగ నచ్చ

రల రమించి కలాపముల్ రాల్చునాఁగ
డమున కేకసాన్ యని తరంగములు పడెఁను. 33

మ సవతుల్ సూచిన దుఃఖశోకములచే సాధింతురో యంచు మా
నవతుల్ కాంతుల ప్రేమపెంపులకుఁ జిహ్మశ్రీలరాజిల్లు గో
టివిలాసంబుల మాటి రగ్నిశిఖలన్ డీకొల్పి యాకుంకుమం
బు వసంతోళనఁగోవ తేశతులపాల్ముల్ బూనె నయ్యంకముల్. 34

క. అవి యళిగతపద్మములా?
సవురూరు సురిమనోజ్ఞచక్షువ్రులా? య
ల్లవి వారిశిరోజములా?
రవళియుఁ గదలికయు లేని భ్రమరీతతులా?. 35

క. నలినీవనమధ్యంబున
నెలఁత మొగము విచ్చినవ్వ నిగుడురదము లా
నలినముల కేసరంబులఁ
గలియఁగ నదియెఱ్ఱఁగికొనుట కష్టంబయ్యెన్. 36

చ. తనను సపత్ని లీసుకలఁతన్ దిగువారుల నోరచూపులన్
గనఁగ, స్వయంబుగా వలచికట్టి ప్రియుం డిడియున్న పూలమా
ల నలిగి నీటబ్రుంగిన నెలంత విడన్ సహియింప కుంచెఁ; బ్రే
మనెసుమి వస్తుతత్త్వగరిమంబునఁగాదు గుణంబుఁ గాంచుటల్. 37

మ. కను తెల్పుల్ మఱపింపఁగాదు నిజరాగశ్రీల మాటంగ సూ
వనితల్ కాటుక కన్నులం దిడుట; తద్భవ్యాంజనంబెల్ల గం
గను గ్రీడింపఁగ తూళితంబగుడుఁ జక్కన్ దోఁచు పెన్రిక్తిమల్
వినుచున్ నూతనసంపదల్ తెలుపువన్నెల్ వెన్కకై డిందఁగన్.

మ. ఘనతేజస్వులు మూఢమానవబలాత్కారంబులన్ మంత్రివ
ర్తనమున్ సర్వముఁ గోలుపోయి పెనుకారన్ జాలిఁబుట్టించు పో
క నటన్ మిన్నుపడంతులుంచుకొను పూగమ్మల్ వడిన్ దళ్కుతో
ననయంబూని జలంబుముంచుకొన దీనావస్థఁ దూలంబడున్. 39

గీ. కనుల నుదురులఁ బెదవులఁ గలిమికొనఁగు
కాటుకలు బొట్లు రంగులు కరిఁగిపోవె

నైనఁ జె న్నింతతఱుఁగమి సరసి జక్కు-
లెఱిఁగి రామాములకు మేనులే నగలని. 40

చ. తమదెస దృష్టిమాని తమిదండడి మున్ను ప్రియుండు భామతో
త్తమముల దానిదిక్కులెఱిఁ దాఁకినకాకలు గాపుకాక లా
యమ జలమాడఁ గోరి త్రగబయల్పడు నాథునఖక్షతమ్ము లా
ర్ద్రిములయినన్ సకత్తులయొకల్ వెనుకొల్పులఁ జేసె సేసునన్.

చ. "సిగలిడు చెవాము లం చెగడుఁ జేసెద రేటికి? సీడు లేనివా
సరులని యూఁకనేల? నయిచాయలు కెంపులమీ కుఁ? జాలులే!
గరువతనంబు మీ యెడ నికా" దని, చూపు కడంక గాక యం
బురుహముల న్, నరుంగు తెరవోడిమిఁ, గుంకుమసిక్తసిరము న్. 42

ఉ. చేతులు మార్చిమార్చి సరసీజముఖుల్ నడిసీట సీఁద సం
దాతజేఁదోఁచు నాదము లయల్ వెలయింపఁగఁగూర్చుపాటులో
రీతులఁ జంటితాకుడుల రేఁగురుతుల్ కెరటాలసందడుల్
ఖ్యాతిగనిచ్చెఁ దాళగమకంబులు నాట్యవినోదశైఖరుల్. 43

మ. సొగసుల్ సంపద దమ్మిపూగరితలన్ సూత్రై త్తఁగా నవ్వమో
ముగముల్ తేరినసీటఁ దోఁచి తనపెంపుల్ బెంచు కైసేఁతలై
నిగుడన్ జాహ్నవి తేట సార్థకతఁ జెందెన్ దేవయోషిజ్జనా
నుగతిన్ మీాఱి, ప్రసాదభాసితులు సంతోషైకపారాయణుల్. 44

గీ. మలయుచేఁపలు తొడలపై కెలయు నులికి
బెళుకుఁజూపుల వణఁకునఁ గలఁగు పాణి
పల్లవంబుల బిత్తురుల్ కజ్జనున్న
పడఁతులనె ముంచి రతిమోహపరవశమున. 45

గీ. చేఁపచెరలాట భయమును జెందినట్లు
కాంతులన్ స్త్రీలు మనసారఁ గౌఁగిలించు
కొనిరి; యడలేనిప్రేమ నెకొల్పు వట్టి
సాకుచెయ్దియు హాయినొసంగుఁగాదె. 46

క. గంగాజలగతిఁ గలఁగిన
ముంగురు లలకాంతరముల ముసురుకొన దళ

ద్భృంగదళాంతరపద్మము
లం గడుఁదలపించె మేటి లావణ్యములన్. 47

ఉ. అందనిలోఁతుచోట భయమంది నవప్రసవాభ మించి చె
న్నొందెడుహస్తముల్ వడఁకు నొక్కతలోదరి నాథుకౌఁగిలిన్
బొందె వచింపరానినవమోదము, దిట్టతనంబు లేమి నా
పొందిక స్వర్గతిన్ మిగిలి పొంగుతమిన్ వెలయించె నాత్మలోన్. 48

చ. ప్రియులు జలంబుదోయిలుల వేడుక మోఁద జనించునూర్పులన్
మెయికొనుచంటియూఁపులును నిండుటొయ్యారమునన్ జెలంగుచే
తియెగురులున్ ఘటించె జగతిన్ సతు లెంచు విలాసయుక్తులన్
నయమె యథార్థమే యనుఘనప్రథ నాఁటికి నేఁటికైననున్. 49

శా. "ఏనుండన్ భయమేలనీ"కనుచుఁ జిత్తేశుండు దా సాధ్వృతిన్
బూనన్ ధైర్యమువిప్పు నొంది యుదకంబుల్ గాఱుచుంటన్ దమల్
లోనన్ మీఱుచునుంట సొగలకనుల్ మూఁతల్పడన్ గుంచిత
భ్రూనారీముఖశోభ లాసవతిసొంపుల్ సెందెనా రాజిలన్. 50

ఉ. కాంతుని మూరుమోఁద నుదకంబుల నింపిన హస్తసంపుటిన్
గాంత విదిర్చి తూలి పతికైపురియూఁతగ సోల నెక్కునన్
గంతువికారముల్ మిగిలి క్రిన్నన నీవిసడల్పఁ జీరెయూ
యింతయు జాఱకుండ సఖియొడ్డెర, కాంచనకాంచి యాపఁగన్ 51

చ. తమిపగఁ గొన్న కాంతమెయిఁ దద్దయు భూషలెయయ్యె నాస్తవ
ర్ణముచనియున్ జలించునధరంబు, మాడిన్ వళులూను బొట్టులే
నిముఖము, కజ్జలంబుజేన నేత్రములందలి యోరచూపు లా
ర! మగువసొరు; లంగవిసరమ్ములె సొమ్ములయెమ్మెగుమ్మడిన్.

గీ. మొదట నిరసించి కాంతుఁ డాపిదప నెంత
యనునయించినఁ దేర దం దతివ యోర్తు
నిండఁ బ్రేమించుమనుజుల న్నిగుడుకోప
మేలకో వేఁడుకొలఁది నింకింత పెరుఁగు. 53

చ. మెలఁతలు ప్రాణనాథులసమీపములన్ జలకేళిముగ్ధవే
ళల నరమూఁతలై కదపులన్ జలియించుచు నోరచూపులన్

విలసిలు కన్నుఁ;లంగములు పేఁగి వడంకెడు, నూర్పుచేపఁ జ
న్నులుబుకు, హేతు వేమి? యతనుకృమమో! భయమో! శ్రమంబకో!

గీ. జటువుపాలింక్ల నరఁటికంబములతోడఁ
బడఁతు లటఁ గ్రీడ సాలించి బయలుదేఱ
వీడలే కుత్సుకతపొంగు వెలయ వారి
వారికిఁ ముందు పేరెంబువారె దరికి. 55

ఆ. తునిసి తేలియాడువనజదళంబులఁ
జంటిజక్కవల పిసాళిరుచుల
మెఱయు ముత్తెసరుల, మెలఁతలు మురువైన
రేవడంతిహాయలు సూపి రండు. 56

గీ. వీర్లు మైగంధములరంగు, వీడిపడిన
మణివిభూషలవన్నెలు మలయునలలు
గల సురీభుక్తముక్తగంగాస్రవంతి
నించెఁ జిత్రంబుగా శయనీయలక్ష్మి. 57

---

# తొమ్మిదవసర్గము.

—:o:—

## —$ సూర్యాస్తమయాభివర్ణనము $—

మ. జలకేళిఁ ననలెత్తు పుష్పశరవాంఛల్ నెట్టఁగా నచ్చరల్
వలువల్ భూషలు చిత్తమోహకముగా భావించి కైసేయుచో
కల గుర్తించి యినుండు తత్ప్రియములెక్కఁ గుంక వారాశిదా
పుల వేలంబడుచుండె; నౌచితి కృతిఁ బోధింపదే యెరికిఁ. 1

ఉ. వాసరలక్ష్మి తాల్చిన పరిభామయమాలిక పోతురత్నమై
భాసిలుచున్న సూర్యభగవానుఁడు తత్సతి తూర్పుమాని యు
ల్లాసము పేర్మిఁ బశ్చిమవిలాసముఁజూడఁ జలింప నద్దిశఁ
దాసరవిన్ జరించె బహుధాతువులన్ నభమెల్ల నించుచున్. 2

శా. రేయెల్లన్ విరహాంబు, జాగరము, మీఁజెలెన్ గాక, తృష్ణార్తుఁ
డై యాప్రాహ్ణము నీరజాధరసుధన్ హార్షోదతిన్ ద్రావ న
స్వాయత్తావయవంబు లెఱ్ఱపడెఁ బ్రజ్ఞల్ జాఱె, నున్మత్తుఁడై
యాయాంభోధిఁ బడంగఁ బోయెడుఁగదయ్యా! భాస్కరుం డార్తుఁడై

గీ. పగలు పగలూనినట్లు దివాకరుండు
మాట మండించి యిపుడు సౌమ్యత వహింపఁ
దీవ్రతా పాతిశయము పృథ్విని ద్యజించి
చక్రవాకహృదంతరస్థాన మొందె. 4

ఉ. ప్రాపును వీడి తొల్లికలవారు త్యజింపఁగ నల్పవృత్తులం
దాపద నొందొ వంత నవయుంబటు నాశ్రితులట్లు మూలమా
ద్యోపతి సాముగ్రుంకఁగఁ దముజ్వలదీప్తులు తూర్పువీడి తా
రేపఱఁగా ముసుంగుచు లయించెడిఁ బశ్చిమదిక్తటంబునన్. 5

చ. ప్రియులనుదేర్ప సాయమున బిత్తరు లందము దిద్దుకొందరన్
గయిలువడంకఁ జెంది యొలుకంబటు కుంకుమఁ గెంపులెచ్చ మే
డ మొగవజాలముల్ దెగువ డగ్గఱి తూఱెను సాంధ్యదీప్తులన్
బ్రియమునఁ జూతు రన్నువలు ప్రేయసు లంపినదూతలన్ మదిన్.

గీ. కుంకుమల నెత్తమున రవి కుజము లూఁత
గాఁగఁ గడు నెఱ్ఱవడు మృదుకరము లూఁచి
కానఁబడె మఱి కనరాఁడు కానఁ బడెనో!
కడలిఁ జొచ్చెనో! తూఱెనో పుడమిలోన! 7

క. ఖగరవముల నాకులమై
యగపడకుండెడు ప్రదోష మర్కుఁడునై తె
ల్లగఁదోఁచి దినాంతము సవ
తుగఁ జెల్లెన్ దివసముఖముతోఁ దిలకింపన్. 8/1

ఉ. తూరుపుటన్నుమిన్న సవతున్ గను పశ్చిమకాంత రూప్యరే
ఖారమ, నైన, భర్తఁగను కౌతుకమక్కడఁ గాంతుఁ డేగఁ జిం
తారసమిందు, గూండ్లదెసఁ దారుచుఁ గూయు ఖగస్వనంబు లం
దారజముల్ విలాపము లి,టాభ లటర్సిరు లిందుఁ బాండుతల్. 8/2

మ. "మనరేయిన్ హరి మాపి మిట్టిపడుఁ జంపన్ రండురం"డంచు నె
త్తినరాత్రించరులన్ ద్విజప్రహితమై దీపించుగాయత్రి కూ
ల్చినఁ గ్రొన్నెత్తురు భూమి రాలనియటుల్ జీమూతము ల్వెల్చి కై
కొని యస్త్రాళి వెలింగె విద్రుమకళ ల్గూర్వోన్నవార్ధిప్రథన్. 9

గీ. అంజలింబట్టి తలవాల్చి యధికభక్తి
నర్చలిడువారినైన సంధ్యామతల్లి
చపలతఁ ద్యజించి సురిగి నిష్క్రాంతిఁ జెందెఁ
దనదుచిత్తంబు ఖలమైత్రి ననుసరింప. 10

అంధకారవర్ణనము

చ. ఉదయపులేఁతవెల్గులకె యుక్కఱి కానలఁ గొండకోనలం
దదరున నక్కి రూపఱిన యంధతమిస్రము వాసరేంద్రుసం
పదలు చనన్ గ్రమక్రమతఁ బ్రాఁకెడుదిక్కతి నల్లియల్లి పై
కెదిగి నన ల్పువు ల్దొడిగి యేపున నల్లరజంబుఁ జిమ్ముచున్. 11

గీ. అస్తమించుదివస్పతి యవనివెలయు
వస్తుభేదవిజ్ఞానంబు వలచికొనెనొ?
కానిచోఁ దోఁపదే యనఁ గాఱుతమము
మన్నుమి న్నేకమొనరించి మాటె నౌర! 12

శా. "ఇంతీ! నిన్నెడఁబాయ నే" ననినఁ "జిత్తేశా! నినున్ బాయ" నం
చెంతో ప్రేమ శకుంతముల్ పలుకు నాయీబాస లాయింతప్రొ
ద్దంతంబై చెడురేయి చీఁకటులఁ బంతంబూని గుప్పంగ వి
భ్రాంతిన్ వీడుట తప్పదయ్యెను, వశంబా దుర్విధిన్ ద్రోయఁగన్!

ఆ. పల్కరించుకొనుటె పాటిల్లెఁ జక్రవా
కముల దరిసియుంట కలిగియున్న
వానిపాటుఁ దలఁచి వలవంత నలినీమ
తల్లి తమ్మిమోముఁ దద్ద వంచె. 14

చ. తిమిరమహేంద్రజాలము నుతింపఁదగున్ - దరుశైలజాతభే
దములను మాపె, రోదసిని దద్దయుఁ గుంచి ముసుంగువైచె, వ

ల్లము లెగువుల్ సమస్థితి నిల్వఁ ధరణిన్ సరిచేసె, దిక్సమూ
హము మఱుమాయమున్ సలిపె నా! కనుదూఁటెనఁగానకుండఁగన్.
స్వాగతము॥ చీఁకటు ల్మలయఁ జెన్ను లుపద్మన్। వీక వీఁకి సిరి పేకుక నింగిన్
బ్రాఁకెఁ దారకలవానికి లోనై। లోకు లాపదకు లోఁగరుకాదే. 16

—* చంద్రోదయము *—

చ. "మిగులఁ బ్రతాపు నాకమలమిత్రునిఁ బొందినపూర్వచాన నా
సొగసును మెచ్చునో? తిరిగిచూడదో?" యంచు సుగంధచూర్ణముల్
మొగలిరజంబులన్ విరియఁబోసెనొ చంద్రుఁడు నాఁగఁ బ్రాగ్దిశన్
నెగయుచునుండె నిండుపసనించు క్రమక్రమవృద్ధి వెన్నెలల్. 17

క. ఉడుపతి దరిసెడిచో ముడి
విడి విరహాతమంబు మాయ వెలయుమదంబే
తోడవుగఁ బ్రాచీనాయిక
బుడిబుడినగుమొగముతో విభున్ ఔలయించెన్. 18

గీ. నీలజలదచ్ఛవిన్ బొల్చు నింగిపైకి
శశిహిమాంశువు లుదయాద్రిచాటునుండి
పడుట గంగాప్రవాహంబు వారిరాశి
పడుటగాఁ దోఁచి యొప్పు లుప్పతిలఁజేసె. 19

క. తెల్లనివెల్గుల నట జా
బిల్లి దివిని గప్పి కప్పువెలయుమొయిళులా
గల్లినచీఁకటి దివియుట
మల్లేశుం డేన్గుతోలు మానుట యయ్యెన్. 20

చ. ఉదుటునఁ జుట్టుముట్టుకొని యుక్కిరిబిక్కిరిముంపు నింపు దు
ర్మదసహితాంధకారములు క్రిచ్చఱఁగ్రిచ్చఱఁ జేయు వెన్నెలల్
గదుముట నేపుదక్కి మలఁగన్ దశదిగ్వనితామణుల్ చెలుల్
వదలి ముదంబులన్ నిడుపుశ్వాసములన్ గొని రాత్మశాంతులన్.

గీ. పసిఁడియ మ్మనఁదగు కోఁతి వసుధ మునుపు
మొదటి కిటి యట్లుగాఁ దనయుదయవేళ

నచ్ఛపగడంబుడంబున నలరుకళనె
చీఁకటులరాశి నెగిచె నాశీతకరుఁడు. 22

మ. కలదై పాతికదై సగం బగుచు ముక్కాల్మేరదై నిండునై
చలిరాజాకసమెల్ల వెల్తురులు హెచ్చంజేసి మిన్నెక్కఁన
ప్పాలుపుఁ జూడఁగఁ గుంకుమారుణాకుచంబో? పూర్వవారాశిలోఁ
గల జన్మించినశాతకుంభఘటకుంభంబో? యనన్ రాజిలెన్. 23

చ. గవిసెన లాగియున్ వలపుఁ దళతన్ మనసిగ్గుపోములుల్
మివులఁగ హావభావముల మోకొనలేని సమోదనట్లు పైఁ
దవులుతమంబు పోయియు సుధాకరుఁ డాయుదయాశ నుంటచే
త విముల కానిరేయిఁ గను దర్పకబాధితచిత్తుఁ డయ్యెడన్. 24

శా. రాలే దంకను మింట యోగ్యమగు నైర్మల్యంబు, కార్తీకటుల్
పోతే దింకను కాననాద్రిశటముల్ పూర్తిన్ విసర్జించి, ది
గ్జాలాంతంబులదాఁక వెల్తురులు పాఁకన్ లేద, లేకున్న, ది
వ్యాలంకారసమేతగా రజని రాజాన్వితయై రాజిలెన్. 25

మ. ఉదయించెన్ హిమభానుఁ డేమిఫల? మయ్యో! చూడఁ బెన్భీతిపైఁ
గదురన్ సాగనిపోక నల్లన దివిన్ గష్టంబుతో నేగు, నే
హ్రాదముంబుల్ జళుకొందకుండు విరహాగ్రీష్మార్తిసంజాతబా
ష్పదళ త్రిప్రకటాక్షపాతములతో భామల్ నిరీక్షించినన్. 26

చ. తరలి హిమాంశుహస్తములఁ దారకపత్నులఁజేరి కౌఁగిలిం
చి రచనలంటు, భీతినగు చంద్రపువర్ణము లుప్తమయ్యె నా
తెఱపిన నంగరాగరుచి తేరఁగఁ గుంకుమునిగ్గు మేనితోఁ
గరము వెలింగె రాజు తమకంబులఁ బైపయి నేగువేళలన్. 27

గీ. మంథరక్షోభ క్షీరాబ్ధి మలసి సాంద్ర
పృథులతరువనముల నూఁపి విసరినటులు
శీతకరుఁ డంపుజ్యోత్స్నలు చీఁకటులను
దఱిమెఁ గారానికొంతల దాఁగి యుడఁగ. 28

గీ. తరులమొదలుల వెన్నెలఁదవిలి నీడ
చిత్రవర్ణంబులుగఁ దేలి చిందులాడ

ననిలహతి నల్లిబిల్లిగా నడరువిరుల
మలయు పూజాగృహంబుల మహిమఁ గొల్పె. 29

ఉ. వెన్నెలచే రథాంగములు పెంటిపులుంగులఁ జేరె, లాభ మే
మున్నది? రేయి, పొందనగునో! విరహార్తిఁ గృశించువాని కా
ప్రిన్ననిజ్యోత్స్న కాదు పయిపై నొకవేయియు మోదమిచ్చునే?
ఖిన్నుల కన్నియున్ వెగటె తృప్తముగాఁ దమి తీఱకుండినన్. 30

గీ. నీటితుంపరతోపాటు నిండువిప్పు
నొందు కల్వలపుప్పొడియును గ్రహించి
చల్లఁజల్లుచు రేగాలి చక్రవాక
శోభితాగము లూగించె జోలకూయి. 31

గీ. వలపుదొర నభిషేకించువాంఛ రేయి
పడఁతి జాబిల్లి వెండికుంభం బొనర్చి
నిగుడు వెన్నెలనీరంబు నించి మచ్చ
కలువయాకిడి నట్లుగాఁ గ్రాలె విధువు. 32

గీ. గడుసుబల్లిదుఁ డేని నేకాకియైన
నొల్లఁబోదు జయేందిర పల్లవించి
శశి బలాఢ్యుండె యైన జ్యోత్స్నాసఖుండు
మరుఁడు కైకొనె జయశీలపరమధనువు. 33

—♦ అచ్చరల విరహాదివర్ణనము ♦—

ఉ. దిద్దినచోటె దిద్దు మనుతీర్చినభూషల మార్చిమార్చి యా
యొద్దిక నద్దమందుఁ గను నువ్విళులూరు నిశేశుఁ డింక నే
సుద్దుల దౌత్యమంపు ననుచున్ వెలివాకిటఁ దొంగిచూచు న
మ్ముద్దియలం దొకొక్కరిత పొందిక నెప్పుడి కెప్పుడర్హతమిన్. 34

ఉ. పైకొను పెన్వియోగముల బాధలచే సురతంబు నొందఁ గేం
ద్రీకృతచిత్తలౌ మదవతీమణు లావిరిమాలలన్ సురన్
శ్రీకరగంధ మింత కయిసేయరు త్రావరు పూయ రంగజో
ద్రేక మడంచు నాయకుల క్రేవఁ గదా విలసిల్లుఁ దద్విధుల్. 35

చ. "చెలియ! తనంతటన్ వలచు చేడియ చుల్కనగాదె? బెట్టు నీ
లలి చెడి నీవె డించుకొన లాఘవ మిం కెటు తప్పు" నన్ వయ
స్యలహిత మాలకింపక నిరస్తధృతిన్ బలమానముల్ సనన్
వలపున నొక్క కామిని స్వనాయకుఁ డున్నెడ కేగుదెంచెడిన్. 36

ఉ. "నీసతిపై మరుం డధికనిష్ఠురుఁ డయ్యెఁ గదయ్య! పొమ్ము పా
మ్మ్రాసలు డిందకుండ వడి నంచెద రక్కడఁ దెల్పువార లె
ట్లోసరిలున్ మనోభవమహోగ్రవికార" మటంచుఁ గామినుల్
గాసిలుటల్ స్వయంగమనకార్యముఁ గూరిచి కూర్చె సాయమున్. 37

క. పతిసంకేతస్థలమున
కతివేగమ పోవుకాంత యలకపులకలన్
ధృతఖండపత్త్రతిలక
ద్యుతి నలరుముఖం బఖండుఁ దొవదొర గెలిచెన్. 38

ఉ. "ధూర్తవు! పల్కఁబోవునది తొందర సాంతముపల్కవేల?" "కా
మార్త నిజేశుపైఁ గుటిలహార్దముఁ జూపుట సాధ్వికృత్యమే?"
"నేర్తురయేని సాంత్వనము నించి ప్రసన్ననొనర్చికోర?" "దు
ర్వర్తనమూని నిన్నలఁచి పై నెటులోర్వ మటందురే? చెలీ!" 39

మ. "అయినన్ వారిటఁ జేరరెందులకు, మేలౌఁ గాదె రాకుండినన్?"
"దయితా! సుందరతాభిమానమునఁ" "గాంతా! దానికిన్ మానము
న్న" "యెటన్ గాన" నటంచు మేలముల నెంతే కామినీబృందమా
శయము ల్దెల్ప ననేకభావఫలకాంక్షన్ మూఁగ నోఁగాముకుల్. 40

మ. పులకల్ నిక్కిన దేహయష్టి మొలువన్ బుంభావనూత్నాతనూ
జ్వలకేళిన్ జనియించుస్వేదకణముల్ ప్రత్యగ్రముక్తాఫలన్
వెలయన్ రేఁగినవాంఛ నాథునెదపై వేగోద్ధతిన్ వ్రాలు కో
మలికిన్ జాఱుప్రసాధనంబు లొసఁగెన్ మాధుర్యసౌందర్యముల్.

క. మదమో! మదనోన్మాదమొ!
మదిరన్ విధురత్వ మెనసి మానము సిగ్గున్
వదలి తమపతులఁ గలిసిరి
గద! మానిను లొక్కొ? వారు కామిను లొక్కొ! 42

ఉ. "నీచను దెంచుమార్గములనే యొప్పుమఁ గనుచుండుఁ గాంత యి
ట్లే చెయి చెంతఁజేర్చి, యింక నెటికిఁ బెక్కులు? వానిజీవముల్
నీచులుకంబునన్ బడిరె, తెమ్ము పగల్ విను" మంచు దూతికల్
వేచదువ్వుల్ వచించుచు సవినయంబు ఘటించుత్రి కామికిన్. 43

ఉ. నాతి కటాక్షముల్ నిసరు "నత్రైవ-నాఁగుఁ" డటంచుఁ గౌఁగిటన్
గాతుకమూను నాథుతమంబును బెండుఁ "గనుండు కందె మీ
పోతుటురంబు నొక్కలకుఁ బుత్తడిగుబ్బ" లటంచుఁ గన్బొమల్
ప్రీతిని ముద్దు, సిగ్గువిడుఁ బిత్మట బిమ్మిటి మించుఁ బొందునన్. 44

గీ. అంగన ననంగసంగరభంగఁ జేసి
యపుడ కోపోద్ధతుండట్టు లరుగుయువకుఁ
జానకన్నీటి వెల్లువల్ సకియవరుస
నడ్డమై కూర్చె వారి కందమునుహాయి. 45

గీ. మగని శంకించి తా మాఱుమొగముఁ బెట్టి
యీసునన్ రేఁగుకన్నీట నేస్ప మాని
నికి మనం బభిముఖమాట నిజముఁ దెలిపి
పొగను మైపొంగుదేటిన పూవురములు. 46

చ. సొగసులఁ గుమ్మరించు సతిసోయగముల్ గనుచోఁ జలించుదృ
ష్టిఁ గొలుపు నాథుపై కుటిలి చేసియు ముద్దుఁగొనంగ వీడె నా
స్నిగ్ధముడితోడ సిగుముడి చీరెముడుల్ స్మరచేష్ట వాండిగా
దిగువ నితంబముకై తెరలు దీరిసరంగమాల కనంబడన్. 47

ఉ. "నీవి సడల్ప నడ్డఁదగునే చెడుకొంచి ?" యటంచుఁ బుట్టమున్
బో వదలించు వల్లభునిమూంగల సిగ్గు జనింప "దృష్టిపా
ల్గావె" యటంచు గబ్బిచనుగట్టుల వర్తులలక్ష్మి చెన్నురాఁ
గా వచుఁ గౌఁగిలించె సతి గాఢతరంబుగఁ బ్రేము వాంగఁగన్. 48

ఉ. కౌఁగిలిగిచ్చులా ? వలపుకమ్మనిముద్దులపంటినొక్కులా ?
హా! గడనన్ జగంబుల సుమాస్త్రుఁడు కోమలుఁడండ్రు! క్రూరుఁడౌ
నౌఁగద విప్రలంభములయందన తాసురతోత్సవాళి నం
దేగుణ మొక్కొ? బిట్టువరియింతురువానినె మాటిమాటికిన్. 49

గీ. అధరపల్లవదంశనపాత్రరుచుల
విచ్చుకనుదమ్ములన్ మధువిసరణముల
మదవతీముఖఝషకసంపదలు పొదలె
హృద్యతరముల సురతాంతహేల నచట. 57

చ. ఎఱిఁగినదే కదా! గుణము లెక్కువశోభిలు టాశ్రయంబు మేల్
తరబడి; నట్టులే మదిరఁ దారె గ్రహించినదానికంటె, హృ
ద్వరు లటఁ దావిఁగా నిడినపట్టులకంటె విశేషమోదమున్
బొఱసిరి సుందరుల్ పతులపుక్కిటిశీధురసంబు గ్రోలుటన్. 58

చ. పెదవులలత్తుకన్ సిరులపెంపిడు నాథులపంటిచిహ్నముల్
మదిరను లాక్షజార, సుషమన్ మణిపాత్రలఁ దోఁప, వానిసం
పదలనుగాంచి కాంచె మధుపానవధూమణి దేవకన్యకా
హృదయగతార్థమా పతులప్రేమ ప్రకాశ మొనర్చు వైఖరిన్. 59

గీ. పరగుణాత్మగుణంబుల వ్యత్యయంబు
వినిమయంబును వారుణి విస్తరించెఁ
గనులఁ గెంపిచ్చి పెదవులకళ గ్రహించి
యాస్యగంధమ్ము స్వకము నన్యోన్యతఁ గన. 60

గీ కంటిరూపంబు గలనల్లకలువ లపుడు
కర్ణములయందు నిరుపయోగంబు లగుటఁ
గాంచి చెలివలె మద్యరాగంబు విప్ప
కనుల నట్టిట్టు నృత్యముల్ చొనిపె మిగుల. 61

ఉ. ఆమెడఁ దావిఁదావిఁ దొలియావకవర్ణము మాసె, మాయ నే
మాయెఁ? గళల్నశించెనె? తదాపదఁబోల్చియెకాదె నేర్పునన్
బ్రేయసు లందు దంతపదరీతులఁ గొల్పిరి, భోగచిహ్నముల్
పాయని స్త్రీల కేల పయివన్నెలు భూషలు సోయగంబిడన్?. 62

ఉ. కైపుసిరుల్ సతీనిచయగాత్రము లంతట నావరించియున్
మోపుగఁదోఁచె రాగపరిపూరితవిస్ఫురితాక్షులందు, మే
లా పగడంపుడంబు లెగయన్ దళుకెక్కు కపోలపాళిపై,
నాపిననిల్వుటద్దమున నారయఁగాఁదగు బింబమట్టులన్. 63

ఉ. కోపవికారమెత్తియును గోమలు లేమెయిఁ గ్రొత్తశోభలన్
జూపిరి కాంతులన్ బ్రియము, చొక్కుడుకైపుననైన వశ్యలై
దాపునఁ గేళులన్ సతులఁదన్పిరి యమ్మెయిభర్త; లెల్లరున్
బ్రోపగు నాత్మవర్గహితమున్ మదిఁగోరుట నైజమేకదా. 64

ఆ. బొడ్డుకెలనిపటము పోవుట కారాని
సీమఁ గోపగిలుట, సిగ్గు విడుట
కూడకున్న మదిర గుణకోటిలోఁ జేర్చి
నింద్యమని వచించు నియతి మాన్పె. 65

చ. చెలులసమక్షమందు మధుసేవలచే సొలపెక్కియెక్కి భ
ర్తలపయి సోలుభామినులు భ్రాంతవివేకులుగాన సిగ్గుచేఁ
గలియకపోరు నిష్ఫలతఁగాంచి తొలంగకపోరు, భర్తలున్
బలుమఱు తద్విలాసపరిపాలితవృత్తులఁ బ్రోదిఁ గూర్పఁగన్. 66

చ. గొణుగుడుమాటలన్ నిలుపుఁగొల్పని భ్రాంతవిలోకనంబులన్
వణఁకునఁ బట్టుపట్టని యనర్థపుఁగౌఁగిళులన్ మదంబుటు
ల్బణమున నందు జవ్వనుల వర్తిలు పోకలు మారసంగరాం
గణమునఁ గ్రొత్తసిగ్గరివికాసములన్ దలపించె నింపులై. 67

ఉ. మానినియయ్యె నోర్తు కడు మారవికారము రేఁగ సిగ్గునా
మాని భుజంగుపెందొడల మవ్వపుఁదెంపునఁ గూరుచుండె మో
మాని; నిజంబుగాఁ జపలయాఁగద వారుణి మంచిచెడ్డలన్
లోనిరహస్యముల్ చిటికలో బహిరంగమొనర్చు బేలమై. 68

చ. మగువలకైపుసేఁతలకు మద్యము మాధురి నప్పుడద్దె క్రొ
త్తగఁగలిగించెనో? కలుగుదానికి దోహదమిచ్చి పెంచెనో?
తెగఁబడి రిట్టులింతులు రతిక్రియ కుద్ధతి; నూత్నసాధన
ప్రగుణితశక్తి మన్మథుఁడు క్రమ్మఱిదూఁకె నసంశయంబుగన్. 69

మ. మగనిన్ నమ్మని మానినీమణులు తా ర్మద్యంబు మెండాన నిం
డగుకైపెక్కిన "మూఢలై రనుచు నన్యున్ గూడఁగా భర్త లే
కఁగలా"రంచు సురన్ గడున్ గొలఁదిగాఁ గైకొండ్రు; ప్రేమల్ చలిం
చుఁగదా భీతిలి సేమమే వెలయునచ్చోనైన సాజంబుగన్. 70

మ. అది యేకాంతము, చిత్తమోహనసుఖం బచ్చోట, సూనాస్త్రముల్
మదనుం డల్లదె గుప్పు, మేనులపయిన్ మద్యోన్మదం, బిందుసం
పద పైఁ బైఁ బ్రవహించు, సంగమములన్ భర్తల్ దమిన్ దీర్తు ర
య్యెడ నాముగ్ధలఁ బ్రేమలోకముల నేయానందము ల్నించెనో! 71

చ. విలుసుడిగాఁగఁ గుప్పు ననవిల్తుని బాణపరంపరల్ వడిన్
డొలుచఁగఁ గ్రిందుమీఁదయి ముడుంగక మారకళాపరిశ్రమన్
వలపులపారమొద్దుగతి భామలొనర్పఁగఁ జూచువారు తే
కలనగ నెల్ల నూడి పొలయంతటఁ జిందె విదుల్చునట్టులన్. 72

ఆ. కల్లుకైపు వెనుకఁ గడువివ్వాలతఁ గూర్ప
భర్తృపరవశమున బడలు సతుల
పతుల రతిరసైకకృతులు లత్యస్థాన
మెడలిపడియు నొసఁగె నిదుపు సుఖము. 73

చ. మనసిజు నాన మాళిఁ గొని మక్కువ పెక్కు పరస్పరానురం
జనులయి గుహ్యకుల్ దివిజసారసనేత్రలు తన్మయత్వవృ
త్తిని జరియించుచుండ నిశ తీఱెడుచో నగుగీతికాధ్వనుల్
వినఁబడె నాగ! సౌఖ్యపదవిన్ ఘటికల్ త్రుటు లయ్యెడుంగదా!

మ. రతులన్ బాటిలు మేటిసేద సుఖనిద్రన్ దేర దీర్ఘంబుగా
తతమాంగల్యనినాదగీతికల బోధ ల్గాంచి పీ ల్మ్నం దసం
గతమానన్ బెనుబెంగ నయ్యువకులున్ గాంతామణుల్ పూర్వవ
ర్తితమారక్రియలన్ బొరింబొరిని దృప్తిన్ దేలి రప్పట్టునన్. 75

చ. అలసిరి మారకేళి నహహా! సుకుమారులు! సొమ్మసొఁకిన
ట్టులు కనుమూసి సోలిరి! యెటోకదె తేర్చు! టటంచు వేగుగా
లి లగువుమాని యంగముల లీలగ నొత్తుచు మాల్యవాసనల్
కలుచవులున్ సుగంధములు గల్గ నటన్ జరియించె నల్లనన్. 76

ఉ. సొమ్ములుపోయె మోములకు సొంపెదికూర్చు నొయార్ల కన్నభా
వమ్ములు సీధువాసనలఁ బంటిచురుక్కులచేఁ జలించునో
ష్ఠమ్ములు, నిద్రఁ బాటవముజారినఁ గెంపగు కన్ను, లేగుప
త్రిమ్ములగుర్తులున్, గొలిపె రత్యవసానమనోహరప్రభల్. 77

ఉ. అంగవిలేపనంబు చని నానఖరేఖలఁ దప్ప భర్తల
య్యంగజకేళిఁ దావి విరియంబను నెట్టనిదొండపండ్లకే
వింగొని నోష్ఠముల్, నిశి లభించిన యుట్టిపిరి యోపభుక్తల
క్షిష్మాం గని కేములన్ దరియఁజెల్లక పాతె వియోగినీవ్యథల్. 78

---

# పదియవ సర్గము.

—•• ❁ ••—

—♦ అచ్చర లర్జునుకడ కేగుట. ♦—

ఉ బల్లునఁ దెల్లవార సురపాటలగంధులు మారుకేళి సం
ధిల్లినలత్తుకల్ మెఱుఁగుదేఱిన యంగములందు నూత్నశో
భల్లత లెత్తఁగా వివిధభంగుల సొమ్ములు దిద్ది హావముల్
కొల్లగ నిండ్రసూనుమది గుంజుకొనన్ విడి రాత్మగేహముల్. 1

మ. అలవాలైన వియత్పథిన్ ద్రుతముగా నయ్యర్జునున్ జేర మి
న్నులయన్నుల్ మదినెన్ని, రెట్లు?వశమా!నూత్నోత్సుకావేశతన్
దలఁపు ల్పర్వులువాఱఁ బాదములునున్ దాఁటన్ వలెన్ గాదె! బ
ర్వుల నాగుబ్బలు నానితంబములు జాపుల్ గొల్పవే వారికిన్. 2

ఉ. ఒత్తుగలత్తుకన్ మెఱయుచున్నపదంబుల నచ్చరల్ చనన్
జొత్తిలె బాటపై నరుణశోభల బారులుగట్టి చిహ్నముల్
కొత్తకుశాంకురాళిపయిఁ గూర్కొనుచుండినయింద్రగోపపున్
మొత్తములట్లుగా సకలమోహనరూపము లుల్లసిల్లఁగన్. 3

ఉ. అందెల ఘల్లుఘల్లు రశనాదివిభూషల శింజితంబులన్
బొంది మనోజ్ఞనృత్యరవముల్ వెలయింపఁ దదారవంబు మి
న్నందిన పర్వతాంతరగుహాగతి మించి ప్రతిధ్వనింప నా
సుందరు లాకసంబుదెసఁ జాతురు బెగ్గురు లంచలన్ మదిన్. 4

శా. "బోటీ! కంటివె! కోయఁగాఁబడియెఁ బూవులాయ లీచెట్ల"! "నా
నే! టాటోటు జిఘాంస పీడి చనవా యెవ్వేశసాత్వంబో

య్యాటల్ సూడుము వానితోఁ శశముఖాన్యంబుల్!" "బళే! కాంచు మ
చ్ఛోటన్ మాల్యము!" "లీవనంబె మునికి న్జోటంచు భావింతు నే!"
చ. "చెలి! కతమేమొ! చిత్త మరచేతఁ గలంచినయట్టు లయ్యెఁ" "గో
మలి! చెడుగాలి సోఁకిన భ్రమన్ దిగు లయ్యెడి నాకు" నాఁగ భీ
తు లడరఁజేసె వారివ్రిభఁ దోఁచి నృపాలమునీట్పురిగ్రహో
జ్జ్వలితవిభూతి నవ్వనము; ప్రౌఢతపస్వి కసాధ్య ముండు నే? 6
శా. "ఏమే! యిట్టులు కెత్తి వింతపడె?", "దోసీ! చూడుమీయందు! నే
నేమంచున్ వచియింతు!", "నాయిసుకపై నే?", "యహా",
"మనోజ్ఞం బదే!
శ్రీమత్కేతురథాంగచిహ్నములచేఁ జెన్నొందు పాదాంకమే!"
"భామా! యెట్టియమానుషంబిది!", "సఖి! పార్థుం డిఁకెట్లుండు నే?"
ఉ. "ఎట్లన నేటికే? తతమహీశమునిప్రభ లొందఁగాదె యి
వ్వట్ల శుభర్తుసంపదల భాసిలు వృక్షలతాకళావ్రజం
బట్లు నికృత్తపుష్పఫలమయ్యు నిసర్గరుచుల్ సమృద్ధిగా
నిట్టిగురున్ గుడుంగముల నేచి మహోత్సవరూపమున్ గొనెన్!"
చ. "అగము లెకావు, చూచుకొనుఁడమ్మ! నవాభఁ జెలంగు మీకళల్!"
"దగు, సఖి! యీయశోకము విధంబుఁ గనంగదె! యార్ద్రవల్కలం
బుగతిఁ జెలంగు, మంచుతెర మూఁగిన కొమ్మల వంచి పల్లవా
ళిఁ గడుఁగదల్చు; జెన్నఁదగు!" "లేమ! సదాశ్రయ లిట్టలొప్ప రే!
చ. యమనియమాదులన్ గృశతనందియు బింకము వీత్తికాని యం
గములఁ, దదంగపాళిపరికల్పితగాండివతూణబాణఖ
డ్గముల నెసంగు రాణ్మునిని గాంచిరి యచ్చర లావసిష్ఠగీ
తము శమదీప్తతాబహుపదమ్మగు నాల్గవవేదమున్ వలెన్. 10
మ. "అతివా! యాతఁడు చంద్రశేఖరుఁడు కాఁడా?", "కాఁడసంజాల, మా
ర! తనూనిర్గతకాంతిపుంజములు నేత్రశ్రీలఁ బర్వంబులై
యతనిన్ జుట్టి దెసల్ చదల్ పఱచి దీవ్యచ్ఛోభ నీయింద్రకీ
లతటంబుల్ వెలిఁగించు నున్నయునికిన్ లావణ్యము ల్గొల్లఁగన్"
శా. "నాకుంజూడ ఫలాభిలాషల నఖండంబౌ తపోయుక్తి మం
దాకిన్యంతికమందు విచ్చిన పిశంగశ్రీజటాజాల మ

టల్లాఁకన్ నిల్చెడి క్రీడి గుండమునఁ దా హోమంబుఁగాంక్షించి పై
దూఁకు ల్వాఱెడి జాతవేదుపసలన్ దోఁపించు నచ్చంబుగన్" 12

ఉ. "నూఱును వేయుఁ బల్కక వినుం డెటేఁగింతు నిజంబు మౌజిగిన్
మారునిసాటి రాఁదలఁచె, మర్త్యసుసాధ్యముకాని మేటివ్యా
పారముఁబూని దానికిని బట్టుగ ఘోరతపంబొనర్చెఁ ద
త్సారజయంబునన్ విపులతన్ స్మరరూపకళన్ విరాజిలెన్". 13

సీ. "ఎక్కువతపముచేఁ జిక్కెనో? యంగముల్
శైలసారము నేఁడు సాటుఁగదవె!"
"పైశమంబున కెంత పాటవంబో ? స్వభా
వమురాసదత్వంబు ప్రబలుఁ గదవె!"
"నిర్జనారణ్యాని నిలు వెంతకాలమో ?
నింఢోలగపుదండి నించుఁ గదవె !"
"మునికలాపమున సాధన మెంతమాత్రిమో ?
లోకేశు తేజ మల్లుకొనుఁ గదవె !"

గీ. "లోకసత్వ తేజోధికుం డేకహేలఁ
దిభువనము లేలఁదగిన క్షత్రియవరుండె!"
"తుచ్ఛవిజయఫలాసక్తిఁ దొడఁగెఁ దపము"
"సింగ మిట గడ్డి మేసెసి సిగ్గు సిగ్గు". 14 & 15

చ. ఘనులను పట్టువీడ మెదఁగల్గు వరంబు లభించుదాఁక నన్
మునులను దానవేశ్వరుల ముట్టి లలిన్ ముకుఁదాిటఁ దిప్పమే
మనమున నెంతయో సదభిమానము శకుిన కందుచేతఁ గా
దె నెనరునన్ బొరింబొరి నదేవనిపై మన కానవెట్టెడిన్. 16

ఉ. "ఎత్తినకీర్తి, దేవపతి యిచ్చిన గౌరవ మెట్లునిల్చు? నో
బిత్తరులార! వీనిఁ గన బిట్టు మనంబు చలించుచుండె, నే
రిత్తకలాపమో కొని చరింతము రం" డనువారిలోన నా
చిత్తభవుండు దూఁకెఁ బువుసింగిణి తుమ్మెదనారి మీటుచున్.

మ. మరులెక్కన్ మఘవాజ్ఞ మాటమఱపై, మారోన్మదంబెక్క నా
నరుఁ దీవ్రింపుఁదపంబు లెక్కఁగొన, కానారీమణుల్ కోరికల్

త్వరవెట్టఁ గనుంగొను, గుహ్యకులు నాఁతన్ మేటిపేరెల్ మృదం
గరవంబుల్ దగ నింపి రేచి ఋతుషట్కశ్రీకగీతావళుల్. 18

— అర్జునప్రలోభమున కచ్చరలకృత్యములు. —

గీ. మింటిసోఁగ నంబుదంబుల మించె; మెఱపు
వెల్గు తళ్కులఁ బోరి విజృంభించెఁ బ్రిణయ
కలహములు జాఱె గర్జలు కడల మీఱె
నీటినిండున గంభీరవినద మొలయు. 19

క. నరు నాశ్రమంబుచుట్టున్
వఱలెడి మాలతులబొర్లువాఱు ముకుళముల్
విరళింపఁజేయు చిగురులఁ
గురిసెన్ వర్షంబు నవ్వ కుఱింగి చనంగన్. 20

ఆ. ఏఱుమద్దిపూల హితగంధముల నంది
దిక్కులందుఁ జిందుఁద్రొక్కు గాలి
సోఁకి క్రొత్తమరులు రాఁకఁ బ్రేరేపంగఁ
జేవఁదక్కె యడలె జీవవితతి. 21

చ. "ఎడపడి బిట్టుశోకమున నేడ్చెడు కోయిలచానకూఁత మే
ల్గడబిడఁ గూర్చె నాత్మలకుఁ గారణమేమొ"? "తెలుంగవే? వగన్
విడివడు దాని పంచమము విస్మృతిఁ దారపథంబు ముట్టి యి
మ్ముడికళఁ గూర్చు మున్గొనిన మూఁగిన నేరెడుపండ్లచేవలన్." 22

మ. "చెలియా! షడ్జమనుస్వనంబులఁ బురుల్ చిందాడ నర్తించు కే
కులు నన్ మేల్కదంబవాయువులఁ జొక్కంగ్లాల్పి గాత్రంబులన్
బులకల్పించెఁగదే!", "యదేమిపస? భూపున్ జిష్ణు నింతేనియున్
గలఁగన్ జేసెనొకో?", "మహాత్ములకడంగల్ సుళ్ళుగా డిందునే?

చ. పెనిమిటి రాఘునన్ దగిసి ప్రేమ శరద్వనితామతల్లి పా
ల్పున విమలస్థలస్థమయిపొల్చు సరోజకరంబునన్ దైను
ల్స్వ నదిర! కౌముదీవసనమొ చీర, శరంబులె యస్త్రముల్ బిసా
ళి నవనవస్ఫురద్వలయలీలలుగాఁ గళలార్ద్రితల్ గనన్. 24

చ. "తముఁదముఁ బెంచువా రిటు లెదల్ చిగిరింపఁగఁ గూడిరన్ బ్రమో
దములు వెలార్చులీల నవె తద్దయుఁగూయు మయూరముల్ మరా
ళములును, గుప్పెడిన్ సురభిళంబులఁ గల్వలు నక్కదంబముల్ ;
సుమహితసద్గుణాఢ్యు లొకచోఁ గలియన్ గుణశోభ హెచ్చదే ?

గీ. "కెలని మంకెన పుష్పాడి కలియు రజము
వెలయు గేఁదగిపూవుల వీడి పట్ప
దావళులు పంచిమధువునకై వరించి
ప్రియకసుమములు సలుపెక్కఁ బీఁటవెట్టు." 26

ఉ. "మంకెనమోద్పులన్ దెగడి మించిపలాశసుమప్రభాళితో
లంకెలు వాఱు కాంతుల విలక్షణతల్ విలసిల్లఁ గంకణా
లింకని శాద్వలస్థలుల నెంతయు సంపదలీనుఁ జూడు మా
వంకల నింద్రగోపములు పచ్చలపై రవకెంపుజంపులై." 27

గీ. "అవిరళము లింకఁ బువులు ప్రియంగువులను
మొల్లవిరివాసనల వెదచల్లు గాలి
విరళవిరళము లగుచుంచు తెరల నసమ
యాభలఁ జెలంగె హేమంత మంత వింత." 28

మ "లవలీపుష్పవిజృంభణంబున నవోల్లాసంబు రాదెట్లు ? లో
ధ్రవలద్వాయువుచేఁ బ్రహర్షమున నాత్మల్ పారవశ్యంబు నొం
దవె ? చిత్రంబు, కనం డొకంట వికృతిన్ దా నర్జునుం డేటికే?"
"మిత్రులన్ గెల్పెదఁ గోరువారు నయభూమిన్ బీడ నుంకింతురే?"

ఉ. "మావు లొకింతపూచి సుషమన్ ఘటియించె; హిమాభిపాతముల్
పోవఁగలేక పోవు, నవపుష్పిత వావిలి ముగ్ధ హేమకా
లావధి పో వసంతకళ లం దరుదే నతనుప్రియాంకము
ద్రావహమై చెలంగె శిశిరంబు కరం బభిరామవైఖరిన్." 30

చ. "వరకుసుమప్రధానవనపర్వతశోభఁ గనుంగొనన్ నవాం
కురితము గా రసాలశిఖ కోమలహస్తములన్ గ్రహించి బం
ధురనలినీవనాళి పదతోయజ మూంచి వసంతలక్ష్మి బా
భరరశనన్ రవంబు లెగువన్ దెగువన్ నగ మెప్పుఁ జూడుమా!"

ఉ. విచ్చినపూవుమోవిపస విక్కఁగ నవ్వడి యుఱ్ఱగోరఁటన్,
నచ్చినకాంతనట్లు విలు నారిఁదగిల్చి యశోకకందళ
ద్గుచ్ఛమునన్ నివిష్టుఁడయి కోర్కులఁగొల్పు ననంగమూర్తి న
య్యచ్చర లట్టెచూచి చకితాక్షులబిత్తరులై రొకింతలోన్. 32

చ. "లలన! చలించుముంగురుల లాగున కద్మిని తమ్మిమోమునన్
మలయసమీరణాహతుల మాటికి కళుల్ కులుకాడుఁ జూచితే? "
"వలపుల భాస్కరుం డధరపానముఁ గోరుచుఁ దారసిల్లఁగాఁ
బాలయులుకన్ సరోజినియు మోమటునిట్టు మఱల్చు నచ్చెలీ! "

ఆ. "మద్దికొమ్మకొమ్మ మధురక్తపుష్పాస్య
పల్లవాధరంబు శ్వసన మొగుపఁ
గ్రొత్తకోపమూని త్రోపాడ షట్పద
పల్లవుండు ముద్దుఁ గొల్లఁగొనియె!". 34

ఆ. "ఆత్మరక్ష యింద్రియముల గెల్చుటె; యట్టి
వాని గెలువలేరు వైరు లెవరు
సకలభువనములను శాసించియు వసంతుఁ
డోడె నరునిజాడఁ జూడలేక." 35

మ. "చెడి యన్యర్తువిధంబునన్ నియమిచేఁ జీకాకుపాలై వసం
తుఁడ! కోల్పోయితి నీప్రసిద్ధి నెవరెంతు ర్నీ" న్నటంచున్ నిదా
ఘుఁడు మేలంబున విచ్చుమల్లికలనిక్కుల్ దేరఁగా నవ్వుచున్
గడుసుంబోకలఁ బైపయిన్ గవిసెఁ గాఁకల్ ధాకలున్ మీఱఁగన్.

గీ. సంతతాంతర్విరోధవిభ్రాంతిఁ దనరు
మేటిబలమైన వైరుల మీటలేదు
ఋతుగణము లోకపరిభూతి నతులమైన
నరున కుత్కంఠ క్షణమైన నెఱపలేద. 37

ఉ. పాపము !, ముక్కుమూసికొని పాడువనంబులలోన నొంటియా
తాపసు సేఁప నయ్యసురు తప్పక కొట్టదె ? దేవకామినుల్
దాపున గుహ్యకుల్ శుత్రులఁ దారిచి వీణెల మీట, మన్మథో
ద్దీపన మూన్పఁజేరి కలితిన్ బడి క్రమ్మగ్గిరి తామె కాంక్షలన్. 38

ఉ. ఏ మొనరింతు? దేవసతులేనియు వారబలల్ గదా! యదే
మో! మునియంగసీమలను బొందినచూడ్కులఁ ద్రిప్పలేరు; పే
రామనికాని రత్ననిచయంబులు, సప్తపదచ్ఛదాళి, ఫు
ల్లామలకుందబృందములునైనను బట్టవువారి కాతిరిన్.　　　39

గీ. రూపసులమంచు నరుపూన్కి రూపుమాపి
చిత్తజుని దాసుఁగాఁ దు్రటిన్ జేయుదుమని
వానికడఁ జేరి వలపులన్ బడిరి వారె
కృతులపరిణతి యెందు దుర్జ్ఞేయ మౌర!　　　40

చ. అభినయమూని రాసరుధృఢాస్థఁ జలింపఁగఁ జేయ నచ్చరల్
శుభమని, సాఁగుటెట్లు? తమచూడ్కులు మానిన లగ్నముల్ కదా
విభులనిలేదు వాచకము పీఁగుటఁగన్గొన రాంగికంబుపై
రభసపుఁజూడ్కులన్ నినుచు రం గొకయింతయుఁ గల్గ దద్దిరా!.

మ. అవి చెందమ్ము లటంచుఁ దుమ్మెదలు వెంటాడంగఁ బారాణిపూఁ
త విశేషారుణదీప్తులన్ మెఱయు పాదంబుల్ తమంతన్ గళా
నువిధిన్ జిందిడ నూపురధ్వనులసందుల్ తేఁటిగానాప్తి నిం
డువడన్ నృత్యము దండిఁగొల్పె నటఁ జూడ్కుల్లోవ మంతేకదా!

ఉ. ఆటయులంత రాగమున నైన మహోష్మము రేఁపు స్వేదపున్
నీటఁ బదంబులన్ మెఱపునిరంచిన లాక్ష వడిన్ స్రవింప లో
నాటినకూర్మి మూర్తిఁగొని నాట్యమునన్ వెలిఁబాఱునట్లుగాఁ
బాటిలఁగాఁ దలల్ముడిచి పట్టుఁ గదంబశిఖాకదంబముల్.　　　43

మ. మునికిన్ ముందట సిగ్గు నిగ్గగయుఁ గామం దూఁతగా నోర్తు న
ర్తనమం దొప్పులొయారముల్ సెలఁగ నోరన్ జూచు విన్నాణియై
జనముల్ మాటుగఁ దొంగితొంగి కనుకొంత్తల్ క్రేళ్లువారన్ మనో
జనియు క్తంబులఁ జాటుపోదుములె సంజ్ఞల్ గావె తత్ప్రీతికిన్.

గీ. చిలిపి చెడుగాలి దుడుకునఁ జీరలాఁగ
జఘనతలమెల్ల బయలైన చాన సకియ
పుట్టమునఁ గప్పి సంభ్రమంబునకు చెలులె
వింతఁగొని, శ్రేద్ది! తమకఁ డావిజయ్యుఁ డింత.　　　45

ఆ. తపనవో ధరించు తమ్మితూఁడులచుట్ట
రేఖలెసఁగు చెక్కు కేలఁ బాణి
పల్లవములఁ బట్టి పటుమన్మథోన్మత్త
యలసదృష్టిఁ గ్రీడి నంతఁ జూచు. 46

చ. “నినుఁ గనుఁగొంటనే మొదలు నిష్ఠురమారవికారభూతయై
కనులు మనంబు సంగమును గార్యము నీయెడఁజిక్క జాగరం
బునఁ గృశియించుచున్ బిడియముం విడి“నిన్ గొనితె”మ్మటంచున
న్ననిచె మునీ! విలంబమున నారట మెచ్చునొ! మూర్ఛపోఁకునో!!”

చ. “అది వయ మింకఁగొంత, వినుమయ్య! మదీయసఖీవిపత్తినిన్
హృదయచిరేప్సితార్తి వచియింపనె నోరెఱవంగలేద, మా
మొదలె కనుంగవల్ గలియ నెంతయునార్ద్రితఁ బోక్క,సుంతయున్
బొదలదొ జాలి? దాసిపయిఁ బుట్టదొకో దయ? తేర్పరాఁగదే! 48

ఉ. మేలు, పరీమళాంచితము, మెత్తకుమెత్తన, పూవుసెజ్జ వే
తేలుల యట్టులై ముగుద తెప్పునలేచి యిలన్ జిగుళ్ళపై
సోలియు శాంతిలేక మనసున్ బహు చల్లన హాయిఁ దుష్టి నీఁ
జాలు త్వదంకపీఠమునఁ జాగి సుఖంబు సుషుప్తిఁ జెందఁగన్. 49

ఉ. నీ వరుదెంతు వంచు మదినిండి బలంబిడు గంపెఁ డాసచే
జీవములున్న వానతికిఁ జెచ్చెరఁబోవవయే న్గతించు న
య్యా! వెడపాపమేల? విడుమాతప, మవ్వలసేయవచ్చు రాఁ
బోవు నె యున్నిటం దగినబోటి యిటుల్ మునివై తపించినన్. 50

చ. పరుషత వీడుమయ్య! మఱుపల్కుడుమయ్య! మును ల్దయార్ద్రిలా
దురెకద! భాగ్యహీనయగు తొయ్యలిసంగతి జాగునోర్వద
య్య! రహినిరాఁగదయ్య! యని యందొకచాన ధనంజయాంతికో
ర్వరఁ గడునేర్పునన్ శిల కరంగ వచించె విపంచికాధ్వనిన్. 51

మ. సవిలాసాకులమధ్యయై విడుకురుల్ సంధించు చేతుల్ వడం
క వధూత్తంసమొకర్తు చన్మొనలపైఁగా బాహుమూలాధరం
బవుతోరిన్ విసరెన్ ధనంజయునిపై నాకంతుజైత్రాస్త్రమై
తవులన్ దీవ్రకటాక్షపాత, మొరుచిత్తంబైన ఘూర్ణిల్లదే ? 52

శా. అందన్ దూఁగుచుఁ బూవులన్ దనరు చూతాగ్రింబుఁ జేపట్టి తా
నం దిందాఁక గజేంద్రకుంభకుచయై యాటాడుతన్వంగి ము
న్నుందై సాఁగిలమ్రొక్కెఁ జిత్తజుగుణమ్మున్ వీడి వేగంపుఁ గ
వ్విం దోతెంచిన యస్త్రమో యనఁగ నాబీభత్సుపాదద్వయిన్. 53

చ. ముడి విడ జారుచున్న కటమున్ గయిఁబట్టి యనంగుకోఁతలన్
విడివడి యేగఁబూను నొకపీనపయోధర యంతనింతటన్
దడఁబడుపోఁకనాగెఁ, దరిఁ బ తాఁ కెనొ? భీతి జనించెనో? యహో!
తొడలకు జారి తద్రశన తొయ్యలికిన్ నిగళంబె యయ్యెఁగా! 54

మ. "శమ మీ పూసితివో! భళా! మరల నీచాపాదులేలోయి! స్ప
ష్టము నీకోరిక, చెప్పనా? బిగువుమెచ్చన్ వచ్చు! ముక్తిన్ రవం
త మదిన్ గోరవు, రూఢిగా నివ కుచింతన్ జిక్కి యేకాంతలన్
దమినో చూడవు మ"మ్మటంచు జెవిచెంతన్ బాళి నొక్క ర్తనున్.

శా. "ఓసే! యెంతటిటక్కులాఁడితఁడు, కాయంబంతయున్ జూడు మా
సూనాస్త్రాహతి నెట్లుకందెనో! దయన్ జూపంపు, శాసింప శ
ట్లీనారూపసిదక్కు" నంచొకతె యీసెక్కన్ బొమల్మోఁగ వా
క్సేన ల్తొట్రిల దూఁగుచున్ దరిసి యేసెన్ బొమ్మపై వీనునన్.

చ. "మొఱసుతనంబునన్ మణివిభూషితమా చెవి నందగానిపే
రురమున రుద్ద నేమొఱిగెనో? కడుఁగందె" నటంచు బ్రివ్వది
ట్టి రమణియోర్తు నమ్రితఘుటిల్లు నడన్, జఱునవ్వు చెక్కులన్
సిరినిడ, నోరచూడ్కి చెవిచెన్నగయున్, నరుఁగాంచెఁ దుష్టిగన్.

ఉ. హావములందు భావముల హంగులు చూపిరి, సిగ్గువీడి వా
చావిధిఁ గోర్కెఁదెల్పి, రెకసల్పఁగ నెయ్యది శేమి నమ్రిలున్
వావిరివాల్చి; రింతులకుఁ బాటిలదేకద యింతకంటెమే
లై విలసిల్లు సాధనబలాప్తి ప్రియానునయక్రియాగతిన్. 58

ఉ. తెల్లమొగాలు వైచి రతిదీనకటాక్షతతుల్ కిరీటిపైఁ
జల్లిరి, "యుస్సు"రంచును విపాదమునొంది రభీప్సితార్థ ము
ట్లల్లరిపాలుగాఁగ నడకాడనియచ్చర; లట్టివేళ నే
నల్లలసల్ సుభాషితలయట్టులఁ దోఁచి రనంగునేర్పునన్. 59

సీ. రాయంచనడకల రమణీయతల మించు
రమణుల మందయానములుగాని
కందినపిఱుఁదుల కడువ్రేఁగుచే శ్రాంతి
నమరు కాంతల వీక్షణములుగాని
చిత్తజాశుగమోహాశీర్ణాభ లగువారి
వ్యర్థాకులితవాక్యపాళిగాని
బొమముడి దుడుకాడు పొలఁతిచూపులుగాని
విభ్వాన బెదిరించు వీక్షగాని
పరమనోజ్ఞంబులేమైన వరసమాధి
నింబుఁ గనుక్రీడి కర్థహీనంబు లయ్యె
మహిమగలవానియెడఁద నమర్థ మడర
సౌఖ్యవాంఛల కటఁదా పెసంగఁగలదె ? 60,61,62

చ. "స్వయముగ, సంచలింపనితపంబున నిందుఁ్రపనుగ్రహంబు నొం
ది యెదిరిఁదుఁ్రించి లక్ష్మిఁగొనఁ దీవ్రమనస్కుఁడు పార్థుఁ డింక శె
మ్మొయి నుడికింపలే" మనుచు మింటినెలంతలు గుహ్యకాళితో
నెయిదిరి చిన్నపోయి వగలేర్చుమనంబుల స్వర్గమార్గమున్. 63

# పదొకండవ సర్గము

—:0:—

—* ఇంద్రాగమనము *—

శా. " శ్రీభోగాతనురాగసంయుతవచశ్శ్రీలన్ సుగంధాదిశో
భాభూతిన్ నయమాడి పైఁబడి రుషన్ భంగించినన్ సుంతయున్
లోభత్వంబు వహింపఁ డీసుఁగొనఁ" డంచున్ వింట సంతోషియై
యాభోగేశ్వరుఁ డింద్రుఁ డాశ్రమముచాయన్ జేరె నాజిష్ణునిన్. 1

క. కడుదవ్వ నడిచి సుడివడు
బడుగున్ ముదితబిసిరూపు వనుపడఁగా న

ప్పుడు తడఁబడుచునడకల గనఁ
బడె నర్జునుమ్రోల నాకపతి వడఁ కడరన్. 2

గీ. చంద్రికిరణప్రసారంబు చాలువాఱ
నసితసితశోభఁ దనరుసాయాహ్నమట్లు
నలుపుజడతుడుముల సమంతమును వెలసి
నిగుడు నెరసినకురుల క్రొన్నిగ్గుతోడ. 3

గీ. అలలవిలసిలు కొలనిలో నబ్జపత్త్రి
పాళి, కవిసినమంచున, వ్రాలులీల
ముడుతలను దాల్చు నేత్రాంతములను గప్పి
తెలుపుకనుబొమవెండ్రుక ల్దిగువ కొఱగ. 4

క. గడియింపలేక యితరుల
కుడుపాసన్ బ్రతుకు మగనిఁ గులసతిరీతిన్
బడుగుటవయవములైనను
గడుముదుగన్ దీయు నిలుపుఁగ్రైదండముతోన్. 5

గీ. అలఁతిమబ్బులలో సూర్యుఁడట్లు మాఱు
వేషమునసైన దశదిశ ల్వెలుఁగఁ జేయు
నిండు పటిమయు సౌమ్యత నించు దివ్య
మహిమఁ దనరారు కాంతిసంపదలతోడ, 6

ఆ. వయసుమీఱి తనువు వశముఁదప్పుచున్న
నాశ్రమంబుసొంపు నాక్రమించు
దివ్యరూపమొప్ప దేవేంద్రుఁ డురుభీతిఁ
గొలుపుపోక నరుని కెలననిలిచె. 7

ఉ. "బాదుగు లొండొరు ల్గురుతుపట్టకపోయిననేనిఁ జూచుతో
డం దగు లుద్భవించు" ననుట ల్గడునిక్కముగాఁగ వృద్ధు నెం
దుం దరిసింపకుండియుఁ గనుంగొనినంతనె డెంద మార్ద్రితం
బెందుట స్నేహపూర్ణుఁడయి జిష్ణుఁడు స్వాగతమిచ్చె నమ్రుఁడై. 8

క. ఆదటయో! భక్తియొ! మ
ర్యాదామాత్రంబొ! యతిథియై వచ్చినవృ

ద్దాదటపోవ నరుఁడు పా
ద్యాదుల నర్చింపఁ దనిసి యతఁ డిట్లనియెన్. 9

—♦ అర్జునప్రలోభమునకై శక్రునియుపదేశము ♦—

ఉ. మాదృశులైన వృద్ధులను మాన కనంగుఁ డనంత కామశి
ఖాదళితాత్ములన్ సలుపుఁ గాలముతీఱినవైన నెప్పుడున్ ;
గాదన కిట్టియౌవనముఁగల్గియు నీ విటువంటిసువ్రతా
సాదితసత్తపంబునఁ గృశత్వము నొందెదు మేలు! మెచ్చితిన్ ! 10

మ. సుకులంబందు జనింపవచ్చు, మఱి తేజుంగాంచఁగావచ్చు, న
ర్పకతుల్యాకృతి నొందవచ్చు, బహురాష్ట్రంబు ల్గొనన్వచ్చుఁ, గా
ని కడుంగష్టము లోకులన్ సుగుణతన్ గీర్తిన్ సమార్జించు, టి
న్నికళల్ గల్గినని న్గనన్ ముదముఁజెందెన్ డెంద మత్యంతమున్. 11

ఆ. ఆశరన్మేఘములనీడలట్లు తొలఁగి
దాఁటు యౌవనమన నిసీ! నీటిబుడగ ;
నిజమె యాపాతమధురముల్ నీచవిషయ
తతులు, తుదిఁ గూర్చు మేటిసంతాప మెదల. 12

చ. జననమె దుఃఖ మాపయిని సంసృతిలోన ననుక్షణంబుఁ జెం
తనె కనిపెట్టి పొంచు మృతి. తప్ప వొకప్పుడు నేని నాపదల్
మన కిటువంటి జీవనము మానుటె శ్రేయమటంచు జ్ఞాన మొం
దిననరు లందెయుందురె ? తితిక్షలఁ జేయరె మోక్షయత్నమున్.

శా. ఈకళ్యాణగుణైకభాజనత నెంతేనొప్ప నీబుద్ధికిన్
సాకల్యంబుగ సంతసంబొదవె, నైనన్, నీదు నేపథ్యపున్
బోక ల్పూన్నెడ విరుద్ధవృత్తులను దెల్పున్, దీన నాచిత్తమున్
దాఁకెన్ సంశయ, మేమి! నశ్వరపువాంఛన్ నీవిటుల్చేరితే ?

ఆ. కదనపరులె తొడుగు కవచాదిసామగ్రి
నిట్లు వీడవైతి వేకతమునఁ
దపసు లెందునేనిఁ దాల్చుట కాపీన
మొకటెకాదె కాంక్ష లుడుగుకతన ? 15

ఉ. నీ వొనరించు టేమి ? కడునిష్ఠురమౌ తప, మందు హింసకున్
గాయముఁ గాచికోఁగఁ బనికల్గునె ? నిస్పృహనూని మోక్షభ
ద్రాయితవృత్తి దాల్చుట యథార్థమకాదొకొ ? యిట్లు గొప్పతా
సాయకజాల మేల ? పరసాధ్వసకారిధనుస్సు నేటికో ?　　16

క. మరణాధిదేవతాపర
కరమున జీవులకు భీతిఁ గలిగించుచు నా
కరవాల మేటికయ్యా !
విరళించు నె నీతపఃప్రవృత్తి శమంబున్.　　17

చ. అరుల జయించి ఘోరజయమందుట యే భవదీప్సితార్థ మం
చరయ సునిశ్చితంబుగ బయల్పడుచున్నది, కాదయేని ? బం
ధురశమశీలమై వెలయు దొడ్డతపం బది యేడ ? తీవ్రకో
పరసముఁ బెంచు ఖడ్గముఖభవ్యతరాయుధపాళి యేడనో ?　　18

ఆ. శ్రమముఁ దేర్చు తేటజలము పట్టునఁ జేరి
కలఁగఁజేసికొనెడు కరణి, మోక్ష
భాగ్యమొసఁగు తపము వధ కుపయోగించు
జనుఁడు మూర్ఖుఁ డగుట సంశయంబె ?　　19

శా. నీవో కాఁగలబాలకుండవు, కడున్నీచంబు సుమ్మర్థకా
మావేశంబు జిఘాంసకున్ గొలిపి స్త్రీయాధీనుఁ గావించు దో
షావిర్భూతికి మూలకంద మపవర్గాలోచనన్ జంపు నే
లా ! వత్సా ! విడు మిట్టిపూన్కిఁ గొనలేవా జ్ఞానసంపత్సుధన్ ?

ఆ. భూతహింసఁ జేసి పొందినసంపద
సిలువ దింతలోనె తొలఁగిచనును,
నదుల నుదధియట్లు కొదలేనియాపదల్
కలుగఁజేయు మేటికారణంబు.　　21

ఉ. ఆపద లెట్లుకూర్చు నసమర్థనకున్ వలవంతయున్ భయం
బాపగిదిన్ సిరుల్ గొలుపు నంతము నొందని చింత భీతి, రా
రాపుల నార్జనంబునను రక్షణలో మఱి నాశనంబునన్ ;
గాపురుషుండు వోలెఁ జెడుకల్మికి వమ్మొనరింతువే జనిన్ ?　　22

చ. ఎదఁగరమూని హాయి సుఖయింపఁగనీయదు కల్మి, యెంతన
మ్మఁదగినవారినేని ననుమానమునన్ గనఁజేయు, శాంతి పో
వఁదలుము, లేనియావలకుఁ బాల్పఱచు, న్బొడపాము రీతి నా
పదలకు భాజనంబగు, నవశ్యము త్యాజ్యముసుమ్మి యేరికిన్. 23

మ. కలిమిన్మ్రుక్కవ చిన్నపెద్దతనముల్ గైకోదు, నీచోచ్చముల్
తలఁపంబోదు, ప్రియాళి కింత యనుమోదంబీదు, మాధ్యంబునన్
వలవంబోని విలాసినీజనములన్ వాంఛింపఁ బ్రేరేచుచున్
వెలయంజేయును జంతునైజమగు దుర్వ్యర్థంబు వామత్వమున్. 24

చ సిరిగలదుష్టు దౌష్ట్యమును జెల్లునన్, సుజనుండు కల్మిచే
నెఱపెడి దుష్కృతుల్ మిగులునిందల వానిని దిద్దునోటు ! న
శ్వర మతిచంచలంబుగద ! భాగ్యము, కేవలసజ్జనాళినే
న్దొఱఁగి చనుంగదా ! యితరదుర్బలులన్ వచియింపనేటికిన్? 25

గీ. ప్రియ మమరకున్న మేటియప్రియముఁగన్న
నీమనం బెంతక్షోభించు నీక తెలియు
నన్యజనమనోవృత్తియు నట్టి దేల
కాదో ? యిది సుంత యోజింపరాదో నీవు ? 26/1

గీ. మునుపు నిప్పుడు నిఁకముందు మనసువికృతి
యొక్కటేకాదె విప్రియం బొనరఁ బ్రియము
కలుగకున్నను ?, నీ విది తలఁపవెట్లు ?
“ లెంతచేసిన నంత ”యం చెఱుఁగవొకో ? 26/2

క. నిష్పచ్చరంబు నిండగు,
ముప్పొత్సవమగును, లాభముగ వంచనయున్
జొప్పడుఁ బ్రియసంగమమున
నప్పా ! యొప్పములె యొప్పులై నెగడుఁగదా ! 27

గీ. ఆప్తులుండియు నేకాకియైనవాని
కద్దియును రమ్యముగఁదోఁప, దింతయేల ?
తుదకుఁ దనప్రాణములనె చెందును విరక్తి;
నిస్సహాయత కొలుపదే నిస్పృహాతను ? 28

గీ. తనకయినవాఁడు చెంతనుండినను దండి
సంతసముగల్గు, లేనిచో జాలి కుంచు
నీకుఁ బీడఘటిల్లు టనిష్టమైన
నొరుల కది కూర్పఁబూనుట యోగ్యకృతియె ? 29

క. సిరివలెనే జని క్షణభం
గురమని గుర్తెఱుఁగు నీకుఁ గూడునె న్యాయా
వరణంబు మసి యొనర్పఁగ
వరసాధుత కూఁత న్యాయ్యవర్తనమెకదా ! 30

ఉ. కావున నోతపోధనుఁడ! కానితమింగొని ప్రియులాడి మే
లైవిలసిల్లు నీతపము లాఱడిపోవఁ జెడంగనేల ? వే
పోవిడు మీరణోత్సుకతఁ బుట్టుట చచ్చుట లేని మోక్షసా
ఖ్యావహమైనశాంతిఁ గొనుమా! వినుమా! కనుమాగ్రహమోదముల్

శా. అంగాంగంబులఁ బీటవెట్టుకొని దేహంబందు నీలోన వీ
రాంగంబూను నజేయులౌ రిపుల ధైర్యంబూని నిర్జింపు, మం
తం గావింపఁగరాని దుండునె ? జగత్కళ్యాణమే నీనుడిల్
మాంగల్యంబును భంగముం గను నెదన్మన్నింపు మార్యోక్తులన్.

ఉ. ఇంద్రియదాసుఁడౌనరుఁ డభీష్టధనాప్తికి నెట్టిచోటనే
నిం ద్రిపవీడి, కేల్మోగిచి, నీచకృతు ల్దలమోచి, భృత్యుఁడై
సాంద్రభయంబుచేఁ దనదుస్వామిని గొల్చు వృషేంద్రరీతిఁ, దా
నుం దురితమీఁగు స్వేచ్ఛఁ దదనుత్తమవృత్తి భవాదృశార్హమే ?

గీ. నేఁటినీసౌఖ్యములు మఱునాఁటి కగునె ?
స్మృతిపథంబునఁగూడ నశించిపోవె ?
కామములు స్వప్నతుల్యము ల్గావు పెట్టేఁగి
తత్పరాధీనవృత్తులు తగినవనులె ? 34

క. నమ్మించి మోసపుచ్చు, హి
తమ్మని యహితమ్మె కూర్చుఁ, దృజియించియుఁ దృ
ప్తమ్ములు కా, వహాహః ! కా
మమ్ములు కుచ్చితపుటరులు మన కెయ్యెడలన్. 35

చ. ఇది విజనస్థలం, బిచట నెప్పుడు మానకపాఱు నీవియ
న్నది సకలంబుఁబూతముగ, నాఁటనొ నేఁటనొ కల్గు పుణ్యసం
పద నిటఁ జేరినాఁడ, వపవర్గము బంటుగ నీదుమోల్రి ను
న్నది, యిదియేమి వెఱ్ఱి ? నిధనప్రదశస్త్రకలాప మీఁగుమా!" 36

—♦ ఇంద్రున కర్జునుని ప్రత్యుత్తరము ♦—

క. ముదసలిమునిగా వచ్చిన
త్రిదశేంద్రుఁడు చతురవాగ్విధిం దెలిపిన యా
చదురులకు నరుఁడు వినయము
గదురమధురవచనరచనగా నిట్లనియెన్. 37

గీ. సంగ్రహంబు సాకాంక్షం బసంకులంబు
సుప్రసిద్ధాయతార్థసంశోభితంబు
భావపూర్ణ సమాససంపన్నమైన
మీరుచిరవాక్ప్రపంచం బమేయ పూర! 38

గీ. ఆగమాధారమును గోరనంతయుక్తి
నిశ్చితార్థంబునై యెందునేని నితర
ఖండనకుఁ జోటొసంగని దండివేద
వాక్కువలె దురాధర్షమై వఱలె సౌర! 39

ఆ. దురవగాహమగుట దోధూయమానసా
గరగభీర మగుచుఁ గడుఁబ్రయోజ
నమునఁగలిమి మునిమనంబువై ఖరి నెంతొ
శాంత్యుదారగుణవిశాలమయ్యె! 40

క. ఈగుణముల విందొనరఁగ
నాగమసమయోచితప్రభాంచితముగ నెం
దేగురుఁడు పల్కఁగలఁ డహ
హా! గనిగద మీవివేక! మబ్బురమయ్యెన్. 41

క. క్షమియింపుఁడయ్య! నాయా
చ్యమమునఁ బూర్వాపరంబు తమకుఁ దెలియ దె

ట్టిమతిఁ మునితుల్యము ధ
ర్మము వచియించెదరొ యెఱుఁగ మాన్యవివేకా ! 42

గీ. ముందువెనుక లెఱుంగక పూనివినక
దేవగురుఁడేని నిడు నుపదేశ మెందు
నుచితనయ మీఁగుపురుషునుద్యోగమట్లు
ఫలవిరహితంబుగాదె తాపసవరేణ్య ! 43

గీ. భానుకిరణవిశుద్ధమై పరఁగుచున్న
పగటినభము చుక్కల కె ట్లభాజనంబొ,
శ్రీయు మిడఁజాలు మీవాక్యసిద్ధి నొంద
స్వామి నే న ట్లయోగ్యుండ నేమిఫలము?. 44

గీ. క్షత్రియుఁడఁ బాండవుఁడఁ బృథాసతిసుతుండ
నను ధనంజయుఁడందు, దుర్నయత జ్ఞాతి
బలము లెడలింప రాజ్యంబుఁబాసి యడవి
నున్న పెద్దన్నముదల నిట్లుందునయ్య. 45

ఆ. వ్యాసునాజ్ఞ నిట్టివ ర్తనమున వ్రతం
బూనినాఁడ శ్రద్ధపూనిక వెలయ
సమ్యగర్చనీయు స్వారాజ్యశేఖరు
నింద్రు నధికపూజ నెదవహించి. 46

చ. కదనము జూదముల్ సలుపఁగాఁ బిలువంబడి పోమి శాస్త్రసం
పదకు విరుద్ధమౌగద, విపత్తులమాయ దురోదరంబునన్
గదుమగ రాజు రాజ్యమును గాఁదిలితమ్ములఁ దన్ను భార్య నం
దెదిరికి నొడ్డి యోడె ఘటియిల్లవె కాఁగల కారణార్థముల్ ! 47

ఉ. భ్రాతలతోడ సాధరణిపాలుఁడు ద్రోవది, నన్ను వీడి య
త్యాతతయామ యామినులయందుఁ గడుం దపియించుచుండ్రు, దు
ర్జాతులు చీరె లూడ్చికొని శాతవచస్సుల ము న్సభన్ ధరా
నేతలమ్రోల మాకిడిన నింద్యపరాభవమాత్మ నెన్నుచున్.48;49

చ. కులసతి సాధ్వి ద్రోవదిని గొల్వునకున్ నెఱివేణి నీడ్చితేఁ
గలరె? గురుండు భీష్ముఁడును గల్గినవారలుఁ జూడ నూడ్చఁగాఁ

గలరె పటుబు లుద్ధతినిఁ? గాలుఁడు నాఁడె యొసంగఁడే సప
త్నులకును సంచకార మెటుత్రోయు నతండు తదీయయత్నమున్,

శా. ఆదుశ్శాసనుఁ డీడ్చి తెచ్చునెడ సాయాహ్నర్కుఁ డావృత్తఛా
యాదుర్గ్రాహకభూజమున్ గని ముఖం బావంకగాఁ గ్రుంకు మ
ర్యాదన్ సభ్యులు పెన్జగుప్సఁ గొని యాస్యంబు ల్మలంగింపరే?
ఛీ! దర్పాధ్యు లొనర్చుకార్య మగునే? శిష్టార్హమే కాదొకో? 51

చ. పతులను పాలనక్షమత వమ్ముగ శబ్దముఁగల్లఁజేసి దు
ర్గతికులరీతి దారువులకైవడి నేవుర మేముఁ జూడ దు
స్థితిగతిమాలి 'బావు'రని చెంపలఁ గాల్వలుఁగట్టనేడ్చె నా
సతి తుడువంగఁ జీరెయు నెసంగమి బాష్పము లుబ్బిపాఱఁగన్.

చ. తనువులుపొంగఁ గ్రోధములు దడ్దడలాడఁగఁ గన్ను లగ్నివ
ర్తనముల విప్పులొందఁ గటధట్టనముట్టఁగ రేఁగఁ జూచు మ
మ్మును గని యుట్టినీచదశ బోధఁదొలంగక దిద్దె నన్న మే
ల్గొనమున; సుఖ్వ శాత్రవులఁగొట్టుట, నింద యసహ్యమౌఁగదా.

ఉ. మంచితనంబు తోయనిధిమాదిరి నెంతకలంగనేనియుం
గొంచెముఁగూడ స్వచ్ఛతను గోల్పడ; దాధృతరాష్ట్రపుత్రుల
న్నించినప్రేమ మాయెడల నిష్ఠురవైర మసూయఁ బెంచె సే
వించినదుష్టమైత్రి చెఱుపేకద! కూలుఁదటాశ్రయంబుగన్. 54,55

క. నిందకు జంకక, మంచిఁజె
డుం దుల్యతఁజూచుఁ గడుకఠోరాత్మునదన్
జెందెడిపన్నగడం దెలి
యం దరమా! విధివిధాన మట్టిదికాదే? 56

ఉ. “పౌరుషవంతు నింకొకని భామ! వరింపు” మటంచొకండు “నా
యూరువుపెక్క ర” మ్మనుచు నొక్కఁడు నాఁటిసభాస్థలంబునన్
ఘోరపరాభవంబు నొనఁగూర్చెఁ, బొగల్చెఁగలెత్తు నాకనల్
మాఱొనరింపకున్న ననుమానమె నాహృదయంబు మాడ్పుటల్?.

క. భూతి యడఁగె, మేటిపరా
భూతి దొడరె, వారిణవృత్తి పొసఁగె నరికృతిన్

హా! తండ్రీ! మాలోమా
కే తనుకుఁ సిగ్గు, చెప్ప నేల హితులలోఁ ?.　　　58

గీ. శక్తి చనఁ జాలవంగి నిస్సార మెనయ
మిగులఁ దేలిక యై సంభ్రమించుక తన
తృణము మానంబు లేనివ్యక్తియును జూడఁ
జూడ నొకరీతి కాదె ? విశుద్ధ చరిత !　　　59

ఉ మిన్నులఁ జొచ్చు శృంగముల మించు నగంబును దాఁటఁ జాల నం
చు న్నెఅపూన్కి జ్యాయుఁడుగఁ జొప్పడఁ గొతుక మేఘనుండు మా
నె? న్నరుఁ డెంతదాఁక నతినిష్ఠురమానము వీడఁ డంతదాఁ
క న్నగడుఁ యశంబుసిరి, కాప్రిలు మగంటిమి వాని కంత కే. 60;61

గీ. ఎవ్వఁ డగేప్రిసరుండని యెన్ను వేళ
మొదటి వ్రేల్లెక్కఁ దొలఁగని పొగడు నొందు
వాఁడె పురుషుండు జగతిలో వానిజన్మ
మేసుమీ! సార్థకత్వంబు నెనసి వెలుఁగు.　　　62

గీ. చూడ నందని యెత్తొంది చొరఁగరాని
వనులుగల మలనే న్దాఁటవచ్చు నొకట,
భవ్యమానోన్నతుఁ బ్రితాపభాగ్యశాలి
మించునున్నతదశ నాక్రమింపరాదు.　　　63

గీ. చంద్రు సిగ్గిలఁ జేయు యశస్సువలన
నద్వితీయుండుగా నెవ్వఁ డమరు వాఁడె
వంశ మెల్లను వెలయించువాఁడు, వాని
వలననే సార్థకత నొందు వసుధ మిగుల.　　　64

ఉ. ఎండిన చెట్లపై నశని యేర్తైఅ నెవ్వని తీవ్రకోప ము
ద్దండత శత్రులోకములఁ దారసిలు న్భువి నాతఁడొక్కఁడే
దండిమనస్వులఁ గను నుదాహరణప్రథ, మాని యన్న ని
ట్లుండఁగఁ బోలు నంచు ఘనయోధులఁ దా నొక మేలుబంతియై. 65

మ. అలవారాశితరంగచంచలములౌ నర్థంబు కామంబునఁ
ద్దలఁపుల్పాఁఅవు నాకు, వీని క్షణనిత్యత్వంబునఁ భీతినం

ధిల నిర్వాణపదంబు నొందు కడఁకన్ నే నిందు రాలేదు, మొ
క్కలపు న్వైరిపరాభవం బెగచు కిన్కన్ దోఁచునే యన్యముల్?

క. పగతురకపటంబున మా
కెగసిన దుష్కీర్తిపంక మేఁ గడగంగాఁ
దగుఁగాదె శత్రువిధవా
క్షిగళద్బాష్పావగాభిషేకంబులచేన్. 67

క. అననిందు బుద్ధి చెడెనని
ననుఁ బండితులెల్ల నవ్వినన్ నవ్వఁగ నిం
డనఘా! తమయుపదేశము
వినఁ డీతఁ డయోగ్యుఁడంచు విసువందకుఁడీ! 68

గీ. వంశముప్రతిష్ఠ పరిపంథివధ మొనర్చి
కీర్తితో నుద్ధరింపనిదే వరించు
మోక్షలక్ష్మియు నాకీను ముదము, గెలుపు
భూతి కది యంతరాయమై పొసఁగుకతన. 69

మ. కినుకన్ బల్కుటకాదు వీరవిధిసంకీర్తింతు, వంశంబు పే
రును బెంపున్ బరసంహృతంబగుడు నేర్పున్ ధైర్యముం జూపి బా
ణనిపాతంబున వైరిఁజంపి మరలన్ గైకోనివ్యర్థుండు పు
ట్టనె లేదన్నను జచ్చినట్లెయనఁ గాఁడా! గడ్డితోఁ పాటనన్. 70

ఉ. వైరుల గెల్వకే రుమను బాసి ప్రశాంతిని బొందువాని నే
తీరునఁ బిల్వఁజెల్లు జగతిన్ మగవాఁడని మానిచంద్ర! యా
కారముమాత్రకా మగలుకారె పసుల్? ధర వీరుఁడేఁడినాన్
శూరవరుల్ సవిస్మయతఁ జూపి కడున్ వలదా! గణింపఁగన్. [71;72

గీ. సత్ప్రసంగవశంబున సంభవించు
నెవనినామస్మృతిన్ సభ నెసఁగుఁ బ్రతిభ
లెల్ల గ్రసియింపఁబడు వైరు లెవనిమెత్తు
రట్టిపురుషుండె పురుషుండు యతివరేణ్య! 73

చ. దగఁగొనువాఁడు దోయిలియుదంబుల నట్లు యుధిష్ఠిరుండు మున్
నిగదితమా ప్రతిజ్ఞ నరినిష్కృతిఁగోరి మనంబు నావయిన్

నిగుడఁగఁ గార్యసిద్ధిఁగొన నేన సమర్థుఁడనంచు సుంటని
ట్లుగఁ దప మూనినాఁడ సురలోకపతిన్ దనియించుపూనికన్. 74

గీ. ఆపదలనున్న భూపతియాజ్ఞ సలుపఁ
జాల కెవ్వఁడు స్వార్థతన్ జాల్మఁ డగునొ
వానిచే మాయదే శుభ్రవంశకీర్తి
చెరుగు పెనుమచ్చ శశిసొంపు చెడినయట్లు. 75

గీ. వటువు, గృహి, వనవాసి, తపస్వి వరుస
నాశ్రమంబు ; లపక్రమం బది యెఱుంగ
నట్టిచో ధర్మవైరుధ్య మనక, మున్న
యమరునే నాకుఁ దత్తురీయాశ్రమంబు ? 76

ఉ. కాఁగలకార్యమో విడువఁగానిది గొప్పది, తల్లి దవ్వునన్
వేగుచునుండు, నగ్రజుఁడు నేత సతీయుతుఁడున్ దపస్వి స్వే
చ్ఛాగమనం బొసంగఁ డీఁక శౌర్యయుతుల్ దమయాశ్రమంబు వ
మ్మాగతి నొండొకండుఁగొన; రాజ పరాహతిఁ బాటిపోవరున్. [77;78

గీ. ఛిన్నజలదంబు విలయంబుఁజెందునట్టు
లీగిరీంద్రశృంగమున లయింతునొండె
శ్రీసహస్రాక్షుపదసేవచే నకీర్తి
శల్య మెడలింతు నొండె భాస్వన్మనీంద్ర ! 79

—♦ ఇంద్రసాక్షాత్కారము ♦—

క. అనునరుకట్టెదుటం దన
ఘనరూపముదాల్చి బిగువుఁగౌఁగిలి సుతునిం
గొని శ్రేయస్కర మఘహర
మును నగభవభవతపంబు బోధించెఁ దుదిన్. 80

మ. "శివుఁడే సంతసమంద నామొదలు దిక్క్షమాపతుల్ గూర్తురు
త్సవసంధాయకమై యవార్యమగు తేజం, బంత నీవేగి శా
త్రవలక్ష్ముల్ దునిమి నీమరుల్గొనఁగఁ జెందన్ వచ్చుసంతుష్టి" యం
చు వెసన్ శక్రుఁడు కన్మొఱంగిచనె జిష్ణుం డుబ్బి యగ్గింపఁగన్.

# పంద్రెండవ సర్గము.

—••❀••—

వృ. పురందరోపదేశజనితమోద మాస్యమున నటింప
నరుం డపూర్వకౌతుకమున నాఁడె పూనుకొనె భజింపఁ
బరాత్పరుణ్ గృపాళు వరదు భవ్య సూర్యశశిరథాంగు
హరుణ్ విధిప్రకారముగ నిరంతరాస్థ హృదిఁ జెలంగ. 1

చ. శమదమశౌచసంపద లెసంగ దినేంద్రున కున్ముఖంబుగా
విమలమనంబుతోడఁ బృథివీస్థలి నొక్కటెపాద మూని యు
త్తమజయవాంఛఁ దిండివయిధ్యానమె మాని నరుండు సత్తపః
క్రమమున నిల్వఁ బోయె వడిగా దినముల్ నెల లెన్నియేనియుణ్.

మ. ఉపవాసాదుల నింద్రియోపతపనం బొక్కింతయుణ్ బార్థు డి
ల్లపడణ్ జేయ దచంచలస్థిరత శైలప్రౌఢిమల్ మీఱ నా
తప మంతంతకు శుక్లపక్షశశిచందంబొంది వర్ధిల్లె నం
దపురూపంబుగ; నంతెఱుంగ వశమా నా ధీరసామర్థ్యముణ్? 3

ఆ. కెలన మదురఁబండి పలుచవులూరించు
పండ్ల కతనిమనసు భ్రమసిపోదు
తేటచలువనీటి తెన్నైనఁ జూడదు
సుకృతి సత్తపంబె సుధకదయ్య. 4

ఉ. "ఎంతతపంబుఁజేసి"తని యింతయుగర్వము నొందఁ "డయ్యొ! యి
క్కొంతకు స్వామి రాఁడె" యని యేడ్వఁడు, పూనిక సళ్ళనీయఁ, డు
ద్భ్రాంతరజస్తమంబులు నిరస్తబలంబులఁ బార్థు సత్త్వవి
క్రాంతికి దిగ్భ్రమణ్ గొని పోకాలు నొనర్ప నొకింతవిఘ్నముణ్. 5

గీ. మేను తపమునఁ గృశియించె నైననేమి
గెలిచె భువనత్రయోదయోజ్జ్వలత నరుఁడు
లోకహితతత్త్వవిదులఁ గల్లోలపఱచె
ధీరులకుఁ జేతఁగాకుండుతీరుఁ గలదె ? 6

చ. విజన మరణ్యమధ్య మతిభీకరశైలము నర్ధరాత్రి య
ప్విజయుఁడు తానొకండె మది భీతిల కద్రిసి మించునున్నతిన్

విజితసముద్రధైర్యుఁడయి వేది జనించుహుతాగ్నిదీప్తులన్
నిజరుచు లుబ్బ నిల్వ రజని న్రజనింగని మెచ్చు భూతముల్. 7

క. ఎడ తెగని మంత్రజప మే
ర్పడ నేకాంతమున వేదిపజ్జ శిఖలకున్
నడుమఁ బరివేష భీషణ
మడరు దివాకరుని బింబమన నతఁ డొప్పెన్. 8

చ. కవచము పైన జందెముగఁ గ్రాలుచు నిక్కిడియున్న వింటిపై
భవమున నాపురందరుని పట్టి మహేంద్రధనుర్విభాసితం
బవుగహానంబు చే సొగసునంది సిరు ల్వెనచల్లుమంచుకొం
డవరుస సర్వమోహనవిడంబనమున్ వెలయించె నచ్చటన్. 9

ఆ. ఈనెవంటి మేనితో నియతస్థాన
మూడ నరుఁడు నడువ నాహిమాద్రి
కూడ భూమి నంటుకొనఁగుృంగు; స్థౌల్యంబు
గాదు గుణమె యిచ్చు గౌరవంబు. 10

ఉ. చేతులు పైకిఁజాఁచి గుతికింజిందఁగనీయని సత్త్వకంబు న
ట్లాతఁ డొనర్ప నెత్తివయి నద్భుతతేజము పుట్టి పైకి య
త్యాతతమై దురాసదమునై ఘనరోదసి నిండి సుప్రభా
పాతమునన్ హరించె మును పాటిలు దేవమునీంద్రమార్గముల్. 11

గీ. వలుదజాబిల్లి నిండువెన్నెలలసొంపు
బహుళములనైన విడదు నభఃపథంబు
నిశల ఫల్గునతేజముల్ నిలిచి కాఁచి
చీఁకటులమూఁక నెగిచి చీకాకొనర్ప. 12

మ. జలదాచ్ఛాదన మింతలేదు దివి స్వచ్ఛం, బైన, నుద్దండదీ
ప్తుల బీభత్సు తపఃప్రకాశకిరణంబుల్ దుర్నిరీక్ష్యంబులై
వెలయన్ సిగ్గిలి చిన్నవోయినటులై వెల్వెల్లనా భాస్కరుం
డిలపైఁ దానొక యంశుమాలియఁట! యేపీశీమాసె నాయంశువుల్.

గీ. త్రిపురముల ధ్వంస మొనరింప దీక్షవెడలి
చేసికన్నంతఁ దెఱవని విశ్వనాథుఁ

డనఁగ నుద్ధతతామ్రజటాళిరుచుల
నెక్కుధనువ్వానునరుఁ గని యెంతు జనులు. 14

చ. ఇతఁడు సహస్రనేత్రుఁ డగునింద్రుఁడొ? వేవెలుఁగుల్గఁగల్ దివ
స్పతియొ? శిఖాసహస్రుఁడగువహ్నియొ? కానిమనుష్యమాత్రుఁడే?
యితరదురాసదం బయినయిట్టితపంబున కేజనుండు ద
క్షతఁగలఁడంచు దివ్యమునిసత్తము లెంతు రనేకరీతులన్. 15

మ. కలదే యబ్బుర మిట్లు? సిద్ధమునిసంఘం బోపఁగాలేని యు
జ్జ్వలతత్తాపమునన్ దివాకరుని యుష్ణత్వంబునంబోలె నీ
ళులు మేఘంబులకేగ, వగ్గిసెగ కాల్పన్ సోఁకునన్బోలె వృ
క్షలతారణ్యము లింత కాలవు తవస్సామర్థ్య మిట్లొప్పునే? 16

సీ. గుణసంపదల నిరాకులతకుఁ దగుగతి
యర్థాశికావిధి యైనయట్లు
షాడ్గుణ్యనీతివిస్తరణంబునకు దిక్కు
సదసద్వివేకసంపదవిధంబు
సమయకళాపాలనము పెంపుఁగన నాఁపు
సత్ప్రమాణములవిజ్ఞానమువలె
మోక్షేచ్ఛ పూర్ణత్వమును బొందుటకుఁ బ్రాపు
నిష్కామశుభకళానియతిరీతి
గీ. యర్జునోగ్రతపస్తేజ మాఁగలేని
యచటిమునిబృందములు కడునార్తి నడలి
సకలలోకశరణ్యుండు శంకరుండె
శరణమని వెండికొండవై పరిగి రపుడు. 17

గీ. భానుతేజంబు తనమోవిలఁ బగటిదివ్వె
గాఁ బ్రకాశించుశంభుని ఘనులు మునులె
యుదుటునన్ జూడలేక చూపోడఁ గనులఁ
గరములం గప్పి మెలమెల్లఁ గాంచి రందు. 18

క. జరిగినవి జరుగునవి యిఁక
జరుగఁగనున్నవియు నెవనిశక్తి వెలయు నా

దారి నరయ వేడు రోగుల
కరుదగునాకృతిని దోఁచె హరుఁ డురుకరుణన్.　　　19

గీ. ఏపు వలమునుగల యెద్దుమూఁపురమునఁ
గరతలంబాని చందనకర్దమార్ద్రి
శైలజాపీనవరకుచస్పర్శసుఖము
కలిగినట్టులు మైమఱచి హరుఁడు.　　　20

ఆ. ఎత్తుమంచుకొండనెత్తంబునన్ లోక
తతుల ముంచుపభ్రల ధరణి చదలు
సాగరములు సకలశైలంబులున్ నిండు
వ్యాప్తిఁబూనినటుల నలరె నతఁడు.　　　21

( నాగబంధము )

చ. గురుతరనాగముల్ రుచులఁగూలముల న్వెలయించుభూషలై
పరఁగుచు జానుజోరురుచిఁ బంచికొన న్జగముల్ సలీలమైఁ
దిరుగుచు సేవఁ దోరపుగతిన్ గన; రవ్యనుకారతన్ నట
త్పరుఁ డనఁగెన్ లలిన్ రుజలువాప్రిలు భిషగ్భవ మెంచుధీరతన్.

ఆ. మంచుపోగుతెల్పు సంచూని జందెంపుఁ
బోఁగు లట్లు వలయములుగ నంస
మెనయ శేషుమేన నెసఁగించెఁ దననల్పు
నసితకిరణతతుల హారుగళంబు.　　　23

ఉ. మాళిఁ జెలంగుచంద్రసుమముల్ గతశేషసురాపగాజల
శ్రీల శిరోజపాళిఁ బ్రిసరించుచు జాతుల యచ్చతెల్పునన్
దేలు కపాలపుంగుముదదీప్తులఁ గాముదులై చలన్మరు
త్ప్రాళుల దూఁకి సృష్టిగురుతన్ సుషిమంబును గూర్చు హాయిగన్.

చ. వలయములౌనహీనతతి భాసిలు దీర్ఘభుజాసహస్రముల్
విలసిలు శంకరుండు తలపించె నిజాంగములన్ భుజంగముల్

వెలయ, బలాయతస్థితుల వెల్గు సుగంధధరాజయు క్తమా
మలయమహీధరంబుగరిమన్ గదలు ల్వలిగాలి నింపఁగన్. 25

క. వారునభిముఖమునకున్ ముని
లరిగి తదీయాక్షిచలన మాజ్ఞగ నతులై
యెఱింగించిరి లోకభయం
కర మగునర్జునతపఃప్రకారం బిటులన్. 26

క. "భువనైకపురుష! వృత్రుని
నవతగు భీమాంగుఁ డొకఁడు సవితృనిదీప్తుల్
గవిసి గ్రసియించు స్వతనూ
ద్భవమా ఘనతేజమునఁ దపం బొనరించున్. 27

మ. తొడిగెన్ మైమఱు, పూనె నంబుపాదులన్, దోరంపుశాటిన్ గొనెన్
నిడుపౌ ఖడ్గముఁ, దాల్చెఁ బెద్దవిలు, పూనెన్ జింకతోల్వల్కలం
బడలై పెన్జడ లయ్యె వేణి, కడువ్యస్తన్యస్తవేషంబు దా
ప్పడు నైనన్ గళ యద్వితీయ మరరే! భావింప మీచిత్రముల్.

క. కదలిన వడఁకు ధరాసతి
చెదరని తన్నియతగతి నచేతనములుగా
మొదలనియుడువాయుగ్రహ
పదముల దశదిశలతో నభము స్తంభించున్. 29

క. మున్నమరుల నసురులఁ జే
రెన్నికలఁ దపోవిభూతి నెసఁగినవారిన్
దన్నఁ దల; కొలఁది నిఁక జగ
మున్నీ రగు; దుష్కరంబు మునులకుఁ గలదే? 30

గీ. ఉద్ధతిని లోకముల గెల్చుటో! నశింపఁ
జేయుటో! లేక మోక్షసంసిద్ధియొక్కొ!
వానికోరిక! యెదియైనఁగాని యిపుడు
తత్తపస్తేజమున కేమె తాళలేము. 31

ఉ. ♦ ఓజగదేకనాథ ! యిటు లోర్చి యుపేక్షనొనర్తురే! యిలన్
రాజిలు దాన నీకెఱుఁగరానిది యున్నె ? వరప్రదా ! మహా
త్మా ! జయశీల ! యాపదను మాపఁగ నుంత తలంపు మిప్పు డ
వ్యాజకృపన్ బరాభవము వాపుము నీచరణైకదాసులన్ ". 32

క. అని మునులు మనవి సల్పిన
విని ఘూర్ణిలువార్ధిమ్రోఁత వ్రేఁగున గంభీ
రనినాదము రోదసి నిం
డ నీటు తోలుకాడ వెలిచనన్ శివుఁ డనియెన్. 33

చ. "ఎవఁ డనుకొంటి రాతని మునీశ్వరులార ! సమస్తలోకసం
భవహరణైకదక్షుఁ డగుభవ్యుఁడు, మున్ బదరీనివాసియై,
భువి నవతారమెత్తిన విభుండగు విష్ణునియంశ, మన్యుఁడై
న వశమె యిట్టిప్రోఢిమఁ గనన్ ? నరనాముఁ డౌ టెఱుంగరే ?

క. కులిశాయుధు వీర్యబలం
బులు మిగిలి సమస్తలోకముల కెడరు దిగుల్
గలిగించుపగఱ గెలువఁగ
నలఘుతపం బూని యాతఁ డర్చించు ననున్. 35

మ. నరపాలుం డితఁ డచ్యుతుండును శతానందోక్తి మన్నించి యా
సురసంఘంబులఁ గూల్చి యాచెఱల గచ్చున్ విచ్చుగా దీనులౌ
నరులన్ గావ శుభావతారముల నున్నా రిప్డు మర్త్యాళి నా
నరనారాయణు లీఘను ల్నిఖలసంత్రాణైకపారాయణుల్. 36

శా. ఆకౌంతేయుఁ బ్రియత్నమంతయు సురవ్యాపారమా యెంచి యా
మూకాఖ్యుం డగుఘోరదానవుఁడు తెంపుంబూని పర్జన్యుపై
దూఁకం బోవుచునున్నవాఁడు, నియమిన్ ద్రుంపన్ మహాధాటితో
నాకందుం జనఁబోలు, రం డచటివింత న్మీరునుం జూడఁగన్. 37

---

పుష్పమాలికాబంధము.

♦ చ. అటమట గాటమై యహరహమ్ము హరా ! దడ మూడఁ జాడవే ?
కటకట ! పూట నిల్వఁగలుగ న్వగ సేర్తుమె ? యీమెయిన్ మెయాల్
పుటపుట బీటవాఱ ? మునిముఖ్యముదం బిడకుండ కేఁడ ! యి
చ్చట నట నాటలాడ సగసమ్మె ? సదాశివశేవ ! రావయా ! 32

మ. నరుఁ డేకాకి, సుదూరగుల్ సహజు లైన న్వీఁడు ధారాళతన్
దరియన్ గుండెలులేక పాపనిరతిన్ దా సూకరాకారియై
పరమోత్సాహముతోడ రూఢి జయమున్ భావంబుతోఁ గైతవా
చరణాబద్ధమనంబుతోఁ జనెడి; దౌష్ట్యం బెంచునే యాచితిన్. 38

గీ. బోయనై పోయి కిటి యైనమూకరిపుని
నే వధింపంగ నపుడె తా నేయు శరము
దాన నరునకు నాకు నుద్ధతిని గలుగు
చటులమృగయావివాద మచ్చటఁ గనుండు. 39

ఆ. తపముచేత బడలి తద్దయుఁ జిక్కి యే
కాకి యైనక్రీడి కదనమందు
రేఁగి సహజ మతుల వాగతి భుజశక్తిఁ
జూపఁగలఁడొ తెంపుఁ జూడవలయు". 40

సీ. హరిచందనపురేఖ లంగంబులన్ ఘోర
వికృతాకృతు ల్ప్రభవింప దిద్ది
యేదుముండ్లన మేన నెనసినరోమాంచ
కంటకంబులు మేలుకంకటముగ
కలభముక్తాహారకల్లోలితాయత
పీనవక్షంబు భయానకముగ
కురులతో మెలివాఱు విరిసరుల్ ముంగలి
ముఖమునకుఁ గఠోరముద్రఁ గూర్ప
గీ. కనుల సెగలు పొగ ల్లేచుగతిఁ గపోల
ముల కలాపికలాపముల్ నిలిచి కులుక
నుఱుము బాణంబువింటితో మెఱయు మేఘు
మనశివుఁడు బోయదొరయయ్యె నాక్షణమున. 41, 42, 43

ఆ. భర్గుపూన్కి నెఱిఁగి ప్రమథులు నధిపతుల్
పరశుశూలచాపబాణతతుల
బీరమొలయ నార్పు ఘోరకిరాత సై
న్యముగఁ బయనమునకు సనువుపడిరి. 44

ఉ. "నీ విటు తూర్పు పొమ్ము మఱినీ వటు దక్షిణమేగు" మన్ మహా
　దేవునియాజ్ఞలన్ బయలుదేఱి చమూపతు లావనంబు న
　ల్లోవల సైనికార్భటులతో మృగయారతి మీఱ నేగుచో
　నావసుధాస్థలంబు గిరు లాశలు దద్దఱిలెన్ ద్రుతంబుగన్. 45

మ. కలగుండున్ గలిగించి యన్నిదిశలన్ గగ్గోలుగా రేఁగు సం
　కులతద్రావముచేఁ గులాయములకున్ ఘోరాద్రిరాడ్గహ్వరం
　బులకున్ గాక చలించి మందవిడి యంభోవీథిఁ బక్షుల్ మృగం
　బులు భూమిన్, రొద లెత్త నయ్యచల "మంభో" యంచుఁ దా
　　　　　　　　　　　　　　　　[ఘూర్ణిలెన్. 46

మ. సకలోపద్రవహా చమూపతుల ప్రస్థానంబునన్ గ్రొవ్వులుల్
　మొకముల్ గూంబలుఁ గాకిమూఁకలు, నిజామిత్రత్వమున్ జూపుతీ
　రికలే కాతురతన్ స్వరక్షణకు నద్రిన్ బర్వ, డీకోలుచే
　రిక లెక్కింపవు; జాతికక్షలఱు నుర్విన్ సంఘదుఃఖంబులన్. 47

తరల. వెదురుగుమ్మలలోఁ దగుల్కొని పీడఁబోని స్వరోమముల్
　మదికిఁ జాలప్రియంబులై సుషమంబులౌ నిజవాలముల్
　ప్రిదిలి యూడునటంచు చవే చమరీమృగంబులు జీవితా
　పదయు లెక్కిడ వాగణార్భటిఁ బాఱి వెందు వడంకునన్. 48

చ. అదె మృగరాజు, సైనికగణాకులరావహతాత్ప్రబోధ ను
　న్మదగజదానవాసనలు మాఁటికి రేఁగఁగ జూల్విదల్చి యా
　పొదదరిఁ బీటవెట్టుకొని పొంకము జంకనిబింక మూని చు
　ట్టు దరియుమూఁకలన్ గడుఁ గఠోరవితర్కనిరీక్షఁ జూచెడిన్. 49

మ. శతసింహంబులహోరుఁగొల్పు పృతనాసంజాతరావంబులన్
　హతధైర్యంబులఁ బాఱు నాగజఘటల్ యానత్వరన్ దారి గం
　ధతరుల్ దంతహతిన్ బడన్ గొలకు లౌద్ధత్యంబునన్ దాఁటు ను
　ద్ధతపంకంబులు క్షుబ్ధమీనములు నాతామ్రంబు లయ్యెన్ దొనల్.

గీ. నలద లులిమిరు లగరులుఁ జిలుకపన్నె
　కొండపువ్వులు, దున్నలు కోర, నగవు

పరిమళములును, జలువ లేర్పఱచి తెచ్చి
తేర్చె సేనల మలయంపుదిమ్మరీఁడు. 51

చ. జడిసి యరణ్యజంతువులు సంభ్రమతన్ వడిఁబాఱఁ దాఁకుడున్
వడుపులఁ గూలి వాడుపరువంపుటనంటులు, గోధుమవ్రజం
బడుసులువాఱునీరు, దెగి యందము డిందుసరోజనీతతుల్,
గడుసునిదాఘతీవ్రతలగాసి యటన్ సమకూర్చెఁ బెల్లుగన్. 52

ఉ. కొండలదండలన్ గుహలఁ గుల్యల గేళివనంబులందు ను
ద్దండవనాంతరంబుల యదాయదలై చెడి వన్యసత్త్వముల్
గండఱ వేఁటలాడి బలగంబులుఁ దానును జేరె సాంబుఁ డా
దండల నేణభుక్తతృణధారుణి నానరుసత్తపోవనిన్. 53

ఉ. అక్కడఁ గ్రీడి కట్టెదుట నంధతమూసితకాంతి శ్రీవణిన్
నెక్కొనుసాంద్రవారిదమునిగ్గున మైజిగి యొప్పఁ గోఱ నీ
సెక్కు భువిన్ బెకల్చుదనుజేంద్రు వరాహఘునావతారు నా
మ్రిక్కడిమూకరక్కసునిఁ, బోల్చి బలంబుల కాఁగఁ దెల్పుచున్.

గీ. ఎఱుకుమన్నీనిలక్ష్మి వహించుశివుఁడు
బలములను గంగయొడ్డున నిలువఁబనిచి
మునులతోడను గతిపయజనులతోడఁ
జెల్లమాటుగ నాచెంతఁ జేరి డాఁగె. 55

# పదుమూఁడవ సర్గము

—— అర్జునుఁడు పందిని జూచి వితర్కించుట ——

ఉ. కొండలనైన బెండులుగఁ గోఱలఁ జిమ్మఁగలంతమేనితో
దండి వలంబు వాఁడి గలదంష్ట్రలఘోరముఖంబుతో నిశా
టుం డటఁజేరినంత నరుఁడుం గనుఁగొంట తటస్థమయ్యె సాం
బుండును జెట్లుమాటులుగఁ బొంది సమస్తముఁ జూచుచుండఁగన్.

గీ. నిక్కఁబొడిచినసటల సన్నిధికి నెల్ల
పన్నుల విడి పర్వుపర్వున వచ్చి మాని
తన్నుఁ జూచుటఁగని గెల్పు తరమెయనుచు
నెన్ను గతి నిల్చుకిటి సంశయించి క్రీడి. 2

మ. "కదు పేమాయెనొ! గుద్దలించినకళల్ గాన్పించు పెన్మట్టె, ఆ
తిదుమూరంబు వహించుమూఁపు తెలుపున్ దీవ్రింపువప్రిక్రియన్
గదనక్రీడకుఁ బిల్చురీతి నెదురై కాల్ద్రివ్వులాగయ్యె ను
న్మదపున్ గోలము! గానిచోఁ బులకరింతన్ దూఁకి రా నేలకో?. 3

చ. పరమతపఃప్రభావమున వన్యమృగంబులు వైరవృత్తులన్
మఱచి సుసాధుజంతువుల మన్ననఁజూచుశుభాశ్రమంబు ని
త్తెఱఁగునఁ జొచ్చి నన్గిటి వధించుపగన్ గమకించు నాతప
శ్చరణబలంబు డించెనో? నిజంబొకొ? క్రిమ్మఱ మాయయానొకో?

మ. తొలిజన్మంబున నాకు దీనికిఁ బగల్ దోరంబులై తత్స్మృతిన్
బలితంపున్ గసి దీర్చుకోఁదలఁచి యిప్పట్లన్ సమీపించెఁగా
వలయున్ గానియెడన్ విరోధిమృగసంపాతంబు లెక్కింప కి
ట్టులు నాపైఁబడ నెత్తివచ్చుటలు విడ్డూరంబు కాకుండునే. 5

చ. అదియునుగాక, ఘోణివిషయం బెటులున్నను, నామనంబుగూ
డఁ దొలిప్రసన్నతన్ విడి హుటాహుటి హింసకు మొగ్గుచున్న ది
య్యదనున, నేమిచిత్రము, హితాహితులన్ గనినంత మేలున
మ్మదమును క్షోభమున్ దగిసి మానస మింతన యేర్పరించదేన్. 6

మ. మునినై యేరికి నింతకీడుఁ దలఁపంబో నేను నా కెవ్వరే
యనయం బెంతు రటంచు నేమఱు టనర్హం బేరికిన్, భార్గవా
గునకున్ మత్సరమొందు దుష్టమతి సంకోచించునే లాభముం
డిన లేకుండిన నొండ్లకున్ జెఱుపు సంధింపంగ నెందే నిలన్. 7

చ. దనుజుఁడో రాక్షసుండొ యగుఁ దప్పదు కేవలవన్యసత్త్వమై
న నలకునే యిటు ల్బలము? నామది కబ్బురమయ్యె! నౌర! యెం
తవలుపు! ఇంచె మేఘము ననందగు; నెంతటి సత్త్వ! మద్రిమె
ల్లనమరుఁ దత్పదాగ్రహతుల న్ననదీనదవృక్షపంక్తియై. 8

శా. సేనారావము లింతకున్మునుపు తోఁచెన్, గానఁ జీకాకుపా
లైనట్లయ్యె, మృగాళి చెల్లచెదరై యుండిందుఁ బర్వెత్తుచుం
దానన్ జప్పుడు లుప్పతిల్లె, నిది సత్యంబా? "పురే! శాంతుఁడో
మానీంద్రుం?"డని పేఁడుమాయఁగొనెనా మాద్యన్మృగవ్యారతిన్?

శా. ఓహో! కాఁడగు, ధార్తరాష్ట్రదరి 'నేదోలాభముల్'జెంది యా
స్నేహాధిక్యపుబల్మిచేఁ బ్రతిక్రియన్ జేయంగ న జ్ఞంపుదు
త్సాహంబూని మహోగ్రసత్త్వవనముల్ దర్కించి ఘోరంపువా
లాహాకారముతోడ నన్యమృగసంత్రాసంబుగా వచ్చుటల్. 10

శా. ఏమీ! యీఖలుఁ డశ్వసేనుఁడగునా? యింద్రప్రతిస్పర్ధ ను
ద్దామప్రౌఢిని ఖాండవంబు హుతభుగ్దగ్ధంబుఁ గావించునాఁ
డామంటన్ దనవారుచావఁ గసిఁద్రోయన్ వచ్చెనా యిట్లు? కా
కామాభీమహాతిం గృతాగ్రహుఁ డెవండైనన్ రుషన్ జేరెనా?

మ. ఎవఁడో యింతవితర్కమేల? యునికిన్ వీక్షింప నన్నట్టులే
ని వధింపన్ బనిఁబూని వచ్చినటు లున్నదిస్థితిన్ దెల్పు, న
త్తువయున్ మొండని చాటు నంగములు,త్రుంతున్ శంకఁబోవిడి,శా
త్రవవిధ్వంసము సర్వలాభముల నగ్రస్థాయి నాబుద్ధికిన్. 12

శా. "ఓరీకుఱ్ఱఁడ! దారిదప్పక జయం బూహించి దీక్షన్ దపః
ప్రారంభం బొనరింపు పొ"మ్మనుచు నావ్యాసుండు వాక్రుచ్చె నీ
కూ్రరుం డిప్పుడు విఘ్నమయ్యె నలఁతిన్ ద్రోయంగరా దుగ్రదో
స్సారుం డీతఁడు, చంపనేవలయు నిశ్శంకప్రతాపంబునన్. 13

గీ. అనుచుఁ బౌరుషచిహ్నంబులందు మొదటి
దైన గాండివముం గొని యరివిభేద
నమున కుశలబ్ధగుణము శుద్ధము రు సచివ
తుల్య మగుబాణముల్ దొనదూసి తీసి.　　14

మ. గొనముల్ గాంచి గురుత్వభాసియయి నిగ్గుల్ గొటఁ నచ్ఛేద్యమై
ధను వానిశ్చితచిత్తుఁ బార్థు స్వబలత్యర్థుల్ మహాపీడనే
ని నతిన్ గొల్చె సుమైత్రియ ట్లతఁడు పూన్కిన్ భూమి నవ్వింటి పెన్
మొన మోటించి కుదించి యవ్వలికొన న్మోపున్ దగుల్సేయఁగన్.

క. గాండివ మెక్కిడి పొదిఁగల
కాండముఁ గొని నారిఁబట్టి కదుపుచు నడువన్
గొండలు గుహలుఁ బ్రతిధ్వని
మెండుగ ఘూర్ణిల్లె నస్త్రమించునొ నాఁగన్.　　16

మ. విలుమధ్యం బొకకై గ్రహించి శరసంవీతంబుగా నారి పై
నొలయన్ లాఁగి గుటిల్ స్థిరత్వమెనయన్ యోధుండు సాలీఢుఁడై
వలయాంతర్గతిగాఁగ ముల్ త్రిపురవిధ్వంసార్థమా నాత్మసా
జ్జ్వలరూపంబున వైరిభీకరతతోఁ పన్ బోయె దా నిస్మితిన్.　　17

ఉ. వాసుకిమార్వి ఘోరవిషవహ్నులు గ్రక్క ధనుస్సు సూఁపుచున్
రోసము వేసమొందెనన రుద్రుఁడు నుద్దవిడిన్ స్వపాదవి
న్యాసమునన్ ధరాధరము నమ్రముగాఁగ శరంబుఁగూర్చి యు
గ్రాసురుఁ డైనసూకరుముఖాంగమునన్ గుఱిఁబెట్టి నిల్చెనన్.　　18

చ. భవ మడిగించి వైరకృతి వాపఁగ నాయతు లైనశూలిపా
ర్థివు లిటునట్లు లొప్ప నడితెన్నున ఘోణి నశించు టబ్బురం
బవునొకొ? పత్యయప్రకృతులందలి బంధమురీతి? నార! మృ
త్యువు మెడఁబట్టి గెంటెనని తోఁపదె మూకనిశాచరేంద్రునిన్. 19

చ. గమనరవంబు హస్తిభయకారణమై తన మండుమింటిపో
క మొయిలుపిడ్గుగా వెలయఁగా శితికంఠపినాకము క్త బా
ణము వినుపీథి పెద్దుతిమున్ బఱతెంచి పడె న్నిశాటునం
గమున నవార్యమై నలువగంటమువ్రాలును గేలిసేయుచున్.　　20

గీ. బాణవేగముచే గరుల్పటుపురవము
కొండగుహలు ప్రతిధ్వను ల్గొలుపఁ బెరిఁగి
వైనతేయునియఱపులవలె భుజంగ
హృదయకర్ణభేదంబుగా నెసఁగె నపుడు. 21

చ. హరనయనాగ్నిసంజనితమై చనునుల్కవిధాన మానస
త్వర నధరీకరించి జలదంబులలోఁ దొలికారుమెఱ్పువై
ఖరిఁ దనపింగళప్రభలు గ్రాల భయంకరమున్, మనోజ్ఞమై
యుఱికెఁ బినాకముక్తశర ముప్పరమున్ వెలిఁగించుదీప్తితోన్. 22

ఉ. ఎప్పుడు విల్లువీడి చనె నెప్పుడు మూకునిఁ జొచ్చె నింతయున్
జెప్పఁగరాదు శంకరునిచెంగటిదివ్యుల నంతరిక్షులం
దప్పెను బొదిదాపుల విహాయసచారుల నొక్కమాటె క
న్గప్పువెలుంగునన్ నిగిడి గాఁడె వరాహముమేనిలోపలన్. 23

ఆ. దివిజు లడలి కనఁగ దివ్యశరంబు పె
న్మంచునట్లు కిటితమాలతనువు
నడ్డులేక దూఁటి యవనిఁ బ్రవేశించె
ఝషము నీట మునిఁగి చనువిధాన. 24

క. కోపించుయమునితర్జని
కోపునఁ బర్వములు వాడికొనఁ గలనరుపెం
దూపు శివశరముతోడనె
యేపునఁ బైకెగిరెఁ బ్రాణు లెంతయు బెదరన్. 25

గీ. అమ్ము పరమాస్త్రసంధాన మమరుకతన
నిడుపుటుల్కలు వనమున న్జిమ్ముకొనుచు
నూఱుశరములహారోరునఁ బాఱె వడిని
మంటపెన్నీటు నింగి నమర్చుకరణి. 26

గీ. మనసుతోడనె చనియెనో మనసుకంటె
ముందె చేరెనో లక్ష్య మబ్బురము తెలుప
విడుపు తగు లొక్కపరి ననవడువుదోడరు
వడర శరము గుఱిన్ జొచ్చె గడుసుకడఁక. 27

ఆ. ఆవిరించివ్రాఁత ననుసరించుప్రయత్న
మర్హాశీఘ్రఫలద మైనయట్లు
శివశరమున నైనచిల్లిలోఁ గిటి దూఱి
నరుశరంబు విజయభరిత మయ్యె. 28

గీ. వికలియత్నంబులందలివిత్త మట్లు
లోభసంక్షయములశ్రితలోలత వలె
నలసదుర్ణయములవిజయాశ రీతి
నరహరాంబకములఁ బోత్రి నలిగి సురిఁగె. 29

చ. అటు నిటు బాణముల్ దగిలినందుననో తుదిముంపుచేతనో
కిటికి శరీరమో బయలో గిఱ్ఱునఁ బెన్వడి సంభ్రమించె నం
తటఁ బెనుమండలంబులుగ ధారుణివృత్తము లొప్పె సూర్యుఁ డె
చ్చటఁ గనరాకపోయె నవశంబయి తాఁ జలనంబు వాయఁగన్.

ఉ. వెచ్చనినల్ల కాఱఁ బృథివిన్ బెనుదంష్ట్రల దూఁటుచున్ గడున్
మచ్చరమైనచూడ్కి క్షణమాత్రము పార్థునిఁ జూచి క్రోధపుం
బెచ్చున ఘుర్ఘురస్వనము పిమ్మట గుఱ్ఱుగ మాఱ నంతలోఁ
జచ్చెను దన్నుకొం చధమసత్త్వఁడు మూకనిశాటుఁ డచ్చటన్.

చ. కలుగవె తూపు లక్ష్యముగాఁ దనతూణములందుఁ? బార్థుఁ డెం
దుల కటు లమ్ముఁగైకొనఁగఁ దొందర నేగెడు? లోభమా! యటుల్
గెలిచినగర్వమా! సరి, జిగీషువు గెల్పిడుబాణ మీఁగునే?
యిలను గృతజ్ఞులన్ గృతమె హెచ్చిఁకఁ జేయఁగఁబోవుదానికిన్.

గీ. నీచుఁ బొందినయుపకృతినియతి మృగముఁ
జెంది యులు గదృశ్యత దోఁప దెందు, నిజమొ,
గారవాఢ్యం బగుట నాత్మపౌరుషంబుఁ
జాటుకొన సిగ్గుచేఁ దలమాఱె, నార! 33

మ. తనకాంతుల్ దనకీర్తు లట్లు దిశ లుద్ఘాటింపఁగా వెల్గుదా
నిని, యోజించి నరుండు గ్రావ్యా మిది యర్జిత్త్రంబునన్ "దిట్టవై"
తన నాశ్వాసము నొందునాశరము నత్యానందముల్ చిందుదృ
ష్టినిపాతంబులఁ గ్రీడి కౌఁగిలిఁ గొనెన్ స్మేరాస్యుఁడై యంతటన్.

—♦ శంకరదూతసందేశము ♦—

చ. ఉదుటునఁ దోఁచె నర్జునునకొక్కవనాటుఁడు బాణతూణసం
పద పొదలంగఁ బీనభుజవక్షము లాత్మశరీరదార్ఢ్యముల్
జదువఁగ నెద్దియో పలుకుసన్నలు మోమునఁ దాండవింప ను
న్మదహరిధీరయానమున, మాటులతా ప్రతిసీరకీవలన్. 35

క. తనవేషంబున కనువుగ
వినతి సమర్పించి బోయ విశ్వేశ్వరునా
జ్ఞను దెల్పె సామపూర్వక
మును మృగయాధర్మయుక్తముగ నీవరునన్. 36

ఆ. శాంతు లనుచు, మనసు సాధు వటంచు మే
త్రేజుతపసు లనుచు దివ్యసాంప్ర
దాయబద్ధు లనుచు దైవసద్వంశసం
జాతు లనుచు వింటిఁ బూతచరిత! 37

మ. మును లై యుండియు మీప్రభావపటిమల్ ముల్లోకముల్ ప్రాకఁ దే
జున నైశ్వర్యవిభూతి మేటినృపులన్ శోషింపఁగాఁ జేసి యుం
డినవార్తల్ వినిపించు మీకళలు, ధాత్రిన్ శత్రు మెప్పించి త
ద్ఘనసర్వాధిపతిత్వపీఠమున స్వాస్థ్యం బొందిన ట్లయ్యెడిన్. 38

చ. కొలిచి సమస్తసంపదలు కోటికళల్ నెఱపింప మానులై
విలసిలుమిమ్ము మూఁడలికపీరసుహృత్సచివాదిసంభృతా
ఘ్యులుగఁ ద్వదంగజాలశుభయోగము చెప్పక చెప్పుచున్న దీ
విలసితమూర్తి సద్గుణవిశేషపటిష్ఠత కిక్కగాదొకో! 39

ఉ. ఈదృశు లై నమీకు విజయిత్వము బ్రాతియె? సర్వతోజయా
పాదకులౌట వింతయె? ప్రపంచదురాసదమోక్షలక్ష్మి యయ్యున్
గాదె యొకింతలో వశము? కామముఖారిరజస్తమోగుణో
చ్ఛేదకు లాశ్రియు ల్గదె విశేషశుభార్థిజనాళి కెప్పుడున్. 40

గీ. తపను సిగ్గిలఁ జేయుప్రతాప మమర
సిద్ధపౌరుషు లయి కీర్తిఁ జెందుమీరు

పందిఁ జంపినమాదొరబాణ మేల
కొనఁ దలంచితిరయ్య! సద్గుణధురీణ!　　41

ఆ. మనువు మొదలు సకలమానవశ్రేష్ఠులు
నడచునీతి కడు సనాతనంబు
మిమ్ముబోంట్లె నెఱుప మేదినిఁ దన్యాయ్య
మెవ్వఁ డనుసరించు నెఱుఁగఁజెప్పుఁడ!　　42

గీ. ఆకుమారుండు మొదలుగ నఖిలయోగ
శక్తిజితజన్మమృత్యువు ల్సత్త్వవరులు
నురువిపద్ధర మగుశీల మూని రద్ది
కాదె యస్మాదృశుల కనుకరణపథము.　　43

ఉ. శీలమె పుణ్య మిచ్చి తపసిన్ దనియించు సుఖార్థ సౌఖ్యమున్
దేల నొనర్చు, యోగులకు దిన్నతరం బగుమోక్ష మిచ్చు, నె
క్కాలమునందు శీలగతిఁ గాంచె నభీష్టఫలంబుఁ జెంద మే
ల్వే లగుబాట కల్గదు, వివేకుల కట్టిది త్యాజ్య మౌనొకో?　　44

శా. ఈ నా బాణము రూపరేఖలను నీదే నాఁగ వర్తించు నో
రా! నే నేమనఁగల్గువాఁడ! నిది యాహా! నాది కాదా! యటం
చే నట్టాడ భవన్మనంబుఁ గొనె నట్లేస్వామి యెవ్వారటం
చూనంబోలు వితర్క మియ్యలుగు సాహో! త్రోవ తప్పెఁగదా!

ఉ. అమ్మది నాది యన్న నది యాప్పటఁ జచ్చినపందికూడ నా
సొమ్మనవచ్చునం చుపమఁజూచి యిటు ల్పొనరింతె? నిస్పృహ
త్వమ్మునఁ దోఁచుసాధువిహితమ్మె? మనస్యవ్వల కెంచఁ బోలుకృ
త్యమ్మె? పరుండు కొట్టుకిటి నాఁగక కొట్టియు నిట్లుచేరుటల్.

ఉ. మాదొరమేటిసేఁతలను మాపును తేపు వినంగఁ బండితుల్
మోదముమీఱ మూఁగుదురు పొందువినోదరసంబుపేర్మి నం
దేదియు గేలిసైన నుతియింపఁబడన్ వలయున్, బరుల్ మహా
హ్లాదముతోడ నెన్న బిడియంబున మాసియు వంచు నాదలన్.　　47

మ. మెఱమెచ్చుల్ సహియింపమిన్ దనపనిన్ మేకోలునన్ జెప్పకోఁ,
డరిభంగంబుల వెల్లడింపఁ, డిటుఁ గార్యార్థంబుచేఁజూపె మా

ద్వార చెప్పన్ వలసెన్ స్వకీయగరిమన్ ; దుష్టుల్నయాతీతదు
శ్చరితుల్ పాత్రులుకారె కారుసుమి ప్రస్తావించి మాటాడఁగన్.

మ. సితబాణంబున మాచమూపతి కిటిన్ శిక్షించుగాఁ జంపుటల్
బ్రతుకన్ గల్గితి రీరు, కానియెడ దుర్వారోగ్రఘోణీశ్వరో
ద్ధతి నీపాటికి నేమికానగునో ? తథ్యం బెన్నఁగా, నీజవా
యతవజ్రాంగుని నొక్కయమ్మునన త్రోయన్ శక్యమే యొండ్లకున్?

గీ. నిలిచి మీప్రాణగొడ్డంబు మలపుకతన 49;50
మాకిరాతేశ్వరుఁడు మీకు మంచిమిత్రుఁ ;
డతనిపైఁ బగ, సుజనసౌఖ్యంబునెనరుఁ
దమరు నీగతి మాయింపఁ దలఁపఁదగునె ? 51

సీ. కష్టమునఁగల్గు, నెప్డు రక్షణమె కోరు
నష్టమున కుంచు, సిరులు, హీనములుసుమ్మ
విజయశీలికి నొకమంచి వెలసి, రక్ష
కయి, శుభాంతము నిడు సుమిత్రాప్తికంటె. 52

క. ధనమును రాజ్యము నధికులు
చెనకినఁ జలియించు, వెతకి చెందఁగఁదగుమి
త్రుని మేరుధీరుఁ దనయం
తనె వచ్చినయధిపుఁ దెగడఁదగునే యనఘా! 53

గీ. విజయమును గోరి తపముఁ గావింత్రు మీరు
కాక మోక్షేచ్ఛ కాయుధకాండ మేల ?
మేటిభూపులసన్మైత్రి మించెనేని
రాదె సకలతపంబులఁ గ్రాలుఫలము ? 54

క. హరిభూమియుఁ గరిసీమయు
వరరత్నసువర్ణధరయు వఱలున్ బతికీ
చిఱుబంగరుటలుఁగున కా
తురపడఁడు క్షమింపఁ డాజ్ఞఁ ద్రోసినవారిన్. 55

ఉ. మాయెకిమీఁడు దొడ్డదొర మన్ననకెక్క సమాశ్రయించినన్
బాయఁడు, లోభి గాఁడు తనప్రాణమునందయినన్, సహేలగా

డాయు నెవండుగాని వికటంబుగ గర్వముఁజూపెనే క్షమన్
బాయుఁ దదీయరౌద్రమును బాప భరింప నశక్య మేరికిన్. 56

ఉ. కావున న మ్మునింగి ప్లవగప్రభుఁడున్ రఘురాముఁడట్లు కాఁ
గా వరమైత్రి దైవగతిగా సమకూరిన దాని గాఢమై
భావుకమై పరస్పరత వర్థిలఁ జూచుకొనుండు యోగ్యసం
భావన, లేనిపోనిపగఁ బాటిలుకష్టము చాటిచెప్పితిన్. 57

శా. మీకున్ దబ్బరఁ జెప్ప మాకుఁబని యేమీ?చూడ మీర్తాపసు
ల్లాకయ్యంబులకైన బాణములఁ బ్రేమన్ గోరఁగాఁబోరుగా,
మాకున్ వజ్రపరాక్రమంబు మిగులన్ మ్రిందించుశస్త్రంబు లె
న్నో కల్గున్,శరలోభమాత్రమునఁ గా దోయయ్య!యిట్లాడుటల్.

శా. ఈబాణంబునఁగాని కాఁదగని దేమే నున్న మర్యాదగా
బాబున్ శైలపతిన్ బ్రిసన్నునిగ నల్పున్ బూనుకో రేలకో!
మీబోంట్లన్ గడుమెచ్చు హేఁ డఖిలభూమిన్ గోరిసన్ గెల్చి యీఁ
గా బీర్వోవదు వారితెంపు శర మొక్కం డెంత? యోజింపుఁడా!

ఉ. ఆతఁడు పండితుం డతనియార్జితమా ధన మస్థిరైహికా
ఖ్యాతము గాదు దివ్యము శ్రితావనదీక్షితమైత్రి, వేఁడికో
లేతటి వమ్మునేఁత సహాయింపఁడు, దాన ఘటిల్లుదుఃఖ మ
త్యాతత మాట స్వానుభవ మట్టుల నొండ్లకొనర్చు మోదమున్.

చ. పఱచు స్వయంబుగా విషయవాసన కింద్రియజాల, మట్టులే
పఱచును బ్రేమ తా వలచుపట్టున కేయపరాధమెన్న, కా
తెఱఁగుననే బలాఢ్యు సిరిఁ దేఱఁగొనన్ జపపెంపొ ప్రేమయో
వఱల ఫలించు లేనియెడఁ బ్రార్థనయున్ సమకూర్చుఁ గష్టముల్.

ఆ. జామదగ్నిగాక జగముల మునులలో
నస్త్రవిదితభుజబలాఢ్యులందు
సార్థకత వహించె శస్త్రధారణ మేది
నుడువుమయ్య వ్రేలు మడిచి యొకని. 62

సీ. విప్రచాపల్యమున సంభవించెఁ దనదు
మృగముఁ గొను టం చెఱుంగ, క్షమించు టేఁడు;

కేవలాజ్ఞానకృతవిపులావమాన
మైన సైఁతురె కా విజ్ఞులైనజనులు. 63

చ. కులమును వేమఱున్ దపముఁ గూలుచు దుష్క్రియ దీని నేటికో
వలచితి, రింకనైన నిటువంటివి మానుఁడు, "దుష్పథంబు క్రే
వలఁ జనుదుర్మతుల్ జయముఁ బాసి యిహంబుఁ బరంబు దూఱినా
కులమతులై నశింతు" రనుకోవిదవాక్యము సంస్మరింపుఁడీ ! 64

ఉ. 'చంపితిఁ బంది నే'నని దిసంతుల దబ్బఱలాడఁగా దిటుల్
చంపఁగఁ దండ్రియౌర్ధ్వికమొ జన్నమొ పూనితి? లేది లేదె, ని
ద్దంపుధరాసురుండవుగదా పొల యొల్లవు, మాని కెందు హిం
సింపఁగరాదు గాదె, యిఁకఁ జెప్పుమ దేనికి బాణ మేసితో? 65

గీ. సజ్జనుండవు విడలేవె చపలబుద్ధి?
నెంతకాలము దాని సహింతు రొరులు?
వార్ధి ప్రళయానిలంబునఁ బగిది దాన
గురుమనంబైన నుండునే క్షోభఁ గానక. 66

ఉ. బోయ, యిసీ! యటం చనఁగఁ బోయెద వేమొ యసడ్డఁ జేసి, ద్రో
ణాయతశాస్త్రవేత్తసుమి యాతఁ, డనుగ్రహనిగ్రహక్షముం
డీయఖిలాద్రిసంయుతమహీవలయంబు శచీంద్రు వేఁడికోల్
ద్రోయఁగ నిచ్చలేక దయతోఁ బరిపాలనసేయుచుండెడున్. 67

మ. మునిచాపల్యము చాలు నోరిచితి నంబున్ బూజ్యుఁడౌ స్వామి క
ష్పనమున్ జేసి తదాదరంబునను సంపద్భాజి వౌటొప్పు, మే
ల్గానమున్ గొల్చి విపత్తుఁ బాపఁగలసుశ్లోకున్ సఖున్ జేసికో
మనువా రుందురె? తథ్య మాతనిదె కాదా బాణ మీసేటికో? [ 68 ; 69

క. ఘోరాయుధసహితపరీ
వారాహితరంగుఁ డగుచు వార్ధిగఁ దగవున్
మీఱక ధీరత నాతరు
తీరంబున నున్నరాజదేవుం గనుమా! 70

ఉ. అంబదె శ్రావణేంద్రధనువా! యన లక్ష్ములఁ గ్రిమ్మరించు, నా
రిం బరికింపు వాసుకిగరిష్ఠత బుస్సలఁగొట్టు, రెండు స

జ్యంబులుగా ధరించుమృతనాధిపు సుస్థిరుఁ జూడు, వీడు శా
శ్వంబును, వారిసఖ్యమున నందుము సర్వమనోగతార్థముల్. 71

# పదునాల్గవ సర్గము.

—♦ కిరాతదూత కర్జును ప్రత్యుత్తరము ♦—

ఉ. చీటికిమాటి కుద్ధతుల సింధుతరంగము లదిరినట్లు కై
రాటసగర్వవాక్యవిసరంబులు చిత్తముదాఁకఁ దాఁక లో
మీటురుమర్ ధృతిఁ విడఁ డమేయచరిత్రుఁడు పాండవుండు, మే
ల్బాటుఁ జరించుసాధుజనభావము దుర్గ్రహ మాట యబ్రమే? 1

ఉ. ఉన్నటు లుండి వచ్చి పుయిలోడక తెల్పినశాత్రవేంగితం
బు న్నిఖిలం బెఱింగి చలముర్ గలగుండున మున్న కర్జునుం
డెన్ని వచించెఁ గుప్తముగ నేర్పడఁగా సమయోచితార్థసం
పన్నము మాటమాట నురువాక్కుశలత్వమునిండు నెండుగన్. 2

చ. లలితసువర్ణభూషల నలంకృతమై శ్రుతిగమ్యమై గభీ
రలసితసుప్రసన్నపదరాజితమై పరచిత్తసాంత్వనో
జ్జ్వలమహిమాఢ్యయౌ పలుకుజవ్వని యెవ్వనికైన నిట్లు సం
ధిలునొకో! పూర్వపుణ్యకృతతేజముకల్మినిగాక మెచ్చితిన్. 3

చ. చదువరి యాట కష్టము ప్రసంగము కష్టతరంబు రెండునున్
గుదురుట దుర్ఘటం బటులఁ గూడినవైన మనోగతార్థసం
పదలను బండితస్తుతికిఁ బట్టుగఁ బల్కెడు నేర్పు సంభవిం
పదు, తనఖండశక్తి గలవాఁ డఖిలస్తవనీయుఁడౌఁ గదా! 4

ఉ. కొందఱు శబ్దశుద్ధి యొనగూడ వినం జెవిఁగోసికొందు రిం
కం దమ కర్థగౌరవమె కావలెనంచుఁ దపింత్రు కొంద ఱీ
యందఱ దక్షతన్ ముదమునందఁగఁ జేయుట మేటికష్టమై
నం దదమేయగౌరవమునన్ వచియించితి వాక్ప్రపంచమున్. 5

ఉ. ఎక్కడికిఁబోయితివోయి! వచియించినదెల్లఁ బ్రగల్భమై సయాం
బెక్కఁగ నిట్లు కూర్చితివి! యింతటిదక్షుఁడ వౌటచేతనే
యిక్కడ సంధిఁ గూర్పననునయింపఁగ మీదౌర పంపె నిన్ను, మే
ల్వాక్కు సమస్తపాండితికి వన్నెగదా యెటువంటి సూరులన్. 6

చ. చతురత సామమున్ నెఱపి, స్వాంతవిమోహకదాన మొంచి, భీ
తి తగుల భేదమున్ బలికి తీర్పరివై యనయంబె న్యాయ్యమా
గతిఁ గనిపింపఁ దూపునకుఁగా గఱుసున్ నుడిఁ బల్కితీవు, పాం
డితియును దర్కదక్షతయు నిండినవ్యాసము మెచ్చుఁగొల్పెడిన్. 7

ఉ. చింతితకార్యసిద్ధికిని జేటిటు నన్నుఁ దిరస్కరింప నం
చింతటినేర్పుకాఁడ వయి యేటికి దిద్దవో మీచమూపతిన్?
వంతల మేళ్ళఁ బాలుగొనువారు శుభంబులె కోరువారు నా
మంతురులున్ హితుల్ దొరకు మంచిఁజెపున్ వివరించి తెల్పరే?

ఉ. తూపిట లేమి నిశ్చయము, తుప్పల గుట్టల నెందు దూతనో
యోపిక నంతటన్ వెదకు టొప్పగుమార్గము గాని, పెద్దలన్
దాపసులన్ వ్యతిక్రమతఁ దారసిలం దగునీతి యౌనె? పే
రాపద రాదె సాత్వికజనావమతిన్? సువివేకివేగదా! 9

గీ. ఖాండవముఁ గాల్చి పెనుతృప్తిఁ గాంచువహ్ని
వరమునన్ గల్గె నక్షయశరధు లిట్లు
నాకసాయకములె మెచ్చ నీకిటాటు
తూపుఁ గైకొన నాసఁ జెందుదునె? చూడు! 10

గీ. మంచివారలబాట ప్రమాణమైన
దోషమే లేని మాచర్య దూష్య మగునె!
పరులనింద సనాతనవర్తనంబె!
సజ్జనులవాణి గుణమునే చాటవలదె! 11

ఉ. ఉన్నగుణంబు లేదనుచు నుండనిదోషము నున్నదంచు నిం
ద న్నిగిడించి సజ్జను నధఃకృతిఁ గుంచి హసించు దుష్టదా
ష్ట్యోన్నతవాక్యమే పదనులొప్పఁగఁదా నిరుపాతికత్రియై
ఛిన్న మొనర్పదే యతనిచేతము రెండుగఁ దోఁచుతెంబడిన్. 12

చ. వనముల సంచరించుమృగవారము లొక్కరి వేమి? యుద్ధతిన్
హానన మొనర్చువారివె కదా; మృగమండలి నెల్లఁ దానె పెం
చెనె? యభిమానమాత్రమున సిద్ధమె స్వత్వము? లేనిపోని హె
చ్చున కిటు లంగలార్చ గడుసుందనముల్ వదలంగఁ జెప్పుమా.

ఉ. "సం దిడకోయి యేరి" కని సాత్యవతేయులు నన్ను సద్వ్రతం
బొందుఁ జరింపఁజేసిరి, మదంతముఁ గూర్చుదృఢైకదీక్షతోఁ
బంది మహోగ్రతం బరుప్రవాఱెను నాపయి నొక్కకోలతో
మ్రందె; విభూషగాదె వ్రతరక్షణ సజ్జనకోటి కెప్పుడున్. 14

మ. "తనకై వేఁట మృగాళిఁ జంపుకొను వ్యాధస్వామి మానీంద్రవ
ర్తనముల్ చార్కొనఁ, దద్ది వానిదయ కాదా?" యన్నఁ గానిమ్ము వ
చ్చినయీఘోణిని దత్క్షణంబున నె చొచ్చెన్ బాణయుగ్మంబు నా
మునుపే తాఁ గిటిఁ జంపెనంచు నిటులం బోరాడఁగా న్యాయ్యమే.

ఉ. "చంపినఁ జంపని" మ్మనెడు సాత్వికు నాయుధహీను మాని మ
న్నింప నకృత్రిమంబు క్రియ నిద్దపుఁగీర్తి ఘటించుఁగాని యు
గ్రింపుశరంబు వింటఁదొడి క్రాలెడు వానినిగూడఁ దాల్మిమ
న్నింపఁగలారె? మిథ్యల గణించిన నిల్చునె ప్రాజ్ఞసన్నిధిన్ ? 16

చ. విడిచె శరంబు నాకొఱకుఁ బిమ్మటఁ గ్రమ్మఱఁ గోరఁ బాడియే
పొడిచి విరోధిఁ జంపి సగముల్ ఫలముల్ వెలయించె దానినా
కిడినఁగదా సమగ్రఫల మిచ్చుట ? లమ్మన లోభమింతయున్
బడఁ డనుమాటకుం గ్రియకు బద్ధవిరోధము కానుపించెడిన్. 17

ఉ. మీ మొకమీఁదు నావలచు మేరకుఁ గోర్కు లొసంగునంచు నే
మో యనియుంటి, వెల్లుప్రియమున్ ఘటియించు నుదైన్యపూర్ణ యా
చ్ఞాయతనార్జితంబగుధనాప్తి ? సమస్తజగత్ప్రసిద్ధశౌ
ర్యాయతకీర్తిపౌరుషబలాగతలక్ష్ములఁ గోరువారికిన్ ? 18

ఉ. చెంద నశక్యమై తెగువఁజేయ ననర్థఫలం బొసంగువాం
ఛం దిగెఁ గల్లప్రపనుచు తుష్మతి ; మూర్ఖజనుండు దుర్ణయం
బెందొనగూర్చు నాపద లహీనములౌట నెఱింగియున్ దమిన్
బొందు, "వినాశకాలమునఁ బుట్టెనురా విపరీతబుద్ధి" నాన్. 19

మ. శరమో? ఖడ్గమొ? కంకటంబొ? మఱి శ్రేష్ఠం బైనచాపంబొ? మీ
దొర దేనిన్ వరియించె దానిఁ గొనిపోఁ దోఁకొంచు ర మ్మాతనిం
గరమున్ నీచము యాచ్న, చాలు, జవగల్గం బొల్లు లేలా? మగల్
బిరుదు న్బింకమునన్ స్వయంగ్రహణమే ప్రేమింతుర్గాదే ధృతిన్.

శా. వీఁడా మైత్రికి? నెట్లుపల్కితి? విసీ! వేధించు మానీంద్రుఁడే
జాడం దోఁచిన హేతుహీనముగఁ, గక్షన్ నిత్యముంగూర్చుపె
న్గీడు న్సద్గుణగౌరవార్జునునకున్, సిద్ధంబు, నైజస్థితిం
జూడన్ సాధులకెల్ల శాత్రవుఁడటంచుం దోఁపదే యేరికిన్ ? 21

ఉ. వర్ణచతుష్టయంబు నిలుపంగలరాజుల మేము, చూడ నే
వర్ణము లేనిఘాతుకుఁడు వాఁడు, కుజాతి, కువృత్తి, నీచతా
దుర్ణయుఁ డెట్లు మాకతనితోఁ దగుమైత్రి? యెటు ల్గభీరతా
పూర్ణము దంతి నేస్తమును బొందఁ దలంచును గుంటనక్కతోన్.

ఉ. కుక్కలు కూసి చుక్కలకుఁ గూర్చునె విన్నఁదనంబు? తెల్వితే
కొక్కజడుం డవజ్ఞ కిటు లొగ్గిన శ్రేష్ఠమతు ల్కలంగునే?
ధిక్కృతి తుల్యవీర్యకులధీబలపౌరుషభాక్కులందె సొం
పెక్కఁగ రాజిలు న్హరిమృగేంద్రుల కేర్పడుకక్షపోలికన్. 23

ఉ. హీనునితోడి పోరున లయించు యశంబులు, వానిమైత్రిచే
న్యూనతనొంది యల్లనఁ జను న్గుణపుంజము, లానుపాన లెం
తో నియతి న్గణించి తులఁదూఁచి వివేకి నికృష్టుఁ గన్నడన్
బోనడఁచున్, మదేభములు మూఁగెడికుక్కలనట్లు ధీరతన్. 24

ఉ. కయ్యము సఖ్యముం దగదు కావున నీయెడయందు నీవు న
న్యాయ్యముగాఁగ నేవరుష మాడినను న్మఱుపల్క నేను బొ
మ్మొయ్యనఁగాక తూపుఁ గొనుమూఁపున డాసితిరేని మూఁడు మీ
కియ్యెడఁ గోడెత్రాఁచుమణి కేగి నశించెడివానిదుర్గతుల్. 25

చ. అన విని దూత 'భద్రముసుమా!' యనుచున్ బెదిరించుపోల్కి రొ
మ్ము నెగిచి శీర్ష మూఁచి భుజముల్ ఝుళిపించి కను ల్నిగిడ్చి తే
జొనయఁగ 'గిట్టి'న న్మఱలి యాధనమావృతుఁడై ప్రసన్నతన్
మునిఁ గనుచున్నవానిని జయాపతిఁ ద్ర్యంబకుఁ జేరెఁ జివ్వనన్.

—* కిరాతసైన్య మాజికిం దొడరుట *—

చ. ప్రళయమహోగ్రవాతహతి భంగపరంపరఁబొంగి వార్ధి సం
కులతను హోరుఁ గూర్చుతెఱఁగుల్ వెలయన్ బృతనేశునాజ్ఞ నా
కులముగ నామహాబలము గొల్చె రౌద ల్దమయాయుధాళి తాఁ
కుల నితరేతరోక్తులను గుంభిని యార్చుగతిన్ ఘనార్భటిన్. 27

మ. విజయోగ్రానిలుఁ డాచమూవననిధి న్వేణుధ్వజాగ్రాంశుక
వ్యజనంబుల్ విపులోర్మివైఖరుల వీవ న్బెంపుఁ బ్రాపించి మే
ఘజలాపాదితశీకరంబులును దత్త్రాంతారసౌరభ్యవ
ద్రజము ల్చిమ్ముచుఁ బ్రోత్సహించుఁబృతనాగ్రస్థానయానార్భటిన్.

చ. జయజయవందిగీతములు జ్యానినదంబులు సింహనాదముల్
హయకృతహేషలు న్మదహస్తిఘటాగురుబృంహితంబులున్
రయభరితంబులై గుహలు ఱంపిలఁ జేయుప్రతిస్వనాళి కిం
తయు నెడమీక దిక్కులను దార్కొనె ధారుణి దద్దఱిల్లఁగన్.

చ. పదనుభయంకరత్వమును వర్తిలుబోయలహేతులన్ స్వసం
పదలు విశేషదీప్తుల దివంబు దిశాంతరము ల్గ్రమింప నం
దు దినమణిప్రకాశములు తుందుడు కూని తళత్తళ ల్పొన
ర్చె దహనజాజ్వలచ్ఛిఖలు చిందులరేగినచంద మొప్పఁగన్. 30

ఉ. అంబొకచేత నారియొకహస్తమున న్గొని పీనపాణియు
గ్మం బిటు నట్టుఁ జాపునొడికంబున మండల మైనధన్వమ
ధ్యంబునఁ దోఁచుశంకరుఁడు దా నుపరిస్థితుపోల్కి నుబ్బువ
క్షంబుకళ న్స్ఫురోదిశ నఖండరుచుల్వెలయించె ఠీవిగన్. 31

గీ. లాఘవమునను మిట్టపల్లంబు నొకటె
వేగమున నేను నే నని వెడలుసేన
ఎడము లేకుండ నిబిడతన్ వెడలుదాన
వనము లుక్కిరిబిక్కిరి వనట నొందె. 32

గీ. దండుముంపున గుంటలు నిండిపూడు
మిట్టలింకింత మెరకలై మిన్నుఁ జూచు

సమధరల్ దానియునికి నుచ్ఛ్రతను, దాఁట
నణఁగుటను జూపు మోదఖేదంబులట్లు. 33

గీ. బిరుసుఁదొడలను నాగుతీవియలఁ గలఁచి
యూఁపువేగాన గంధావలేప మడఁచి
దురుసుపోకలఁ జనుగట్లగరుసు డులిపి
సేన వనలక్ష్మిదాఁటున సిగ్గుఁజెఱిచె. 34

గీ. తపముచేఁ జిక్కియుంట పదంబు చనిన
నేని దర్పంబు విడనిద్విపేంద్రులీల
సకలభూభృద్వినాశంబునకు దిశాళి
వెలుఁగ మండెడునిప్పునా వెలయువాని. 35

గీ. దొడ్డమిత్త్రినివలె దొనదూయుశరము
గెలుచు ననుకూలత నటంచుఁ దలఁచువానిఁ
బ్రతిసమాప్తంబు సేయనివ్యర్థబలజ
లార్ణవముధృతిఁ దృణముగా నరయువాని. 36

గీ. ప్రతికృతియె కారణంబుగా వచ్చుముప్పుఁ
బాపునీస్థిరధను వని భయము వదలి
పవన మూఁపమిఁ దొనఁకని వార్ధిరీతి
గా నలంఘ్యగభీరతఁ గ్రాలువాని. 37

గీ. దాపుదాపునః బడియున్నదంష్ట్రిజీవ
ములఁ గొనం జేరుయముదీప్తి నలరువాని
సవనమున బ్రాహ్మణుల్విల్వ స్తబ్ధయూప
పశువు దరిఁ దోఁచురుద్రునిపగిదివాని. 38

గీ. పరులగాంభీర్యమెల్లఁ ద న్నరయ నణఁగు
నట్టిగురుధైర్యగుణవిశేషాతిభూతిఁ
బెనసికొనుపెద్దతీవెల వనము మొలువఁ
జెనకఁ జొరరానిమలపాలెఁ దనరువాని. 39

గీ. బలుపు టాఁబోతుగ్రివంపుబటువుమెడయు
గొప్పగిరితట మన గట్టియొప్పునురము

వెలయ నాదివరాహంబు జలధినుండి
వెలి ధరఁ దేర్చ నున్నట్లు వఱలువాని.　　40

గీ. మరకతాభల మేనితోఁ గర ముదగ్ర
మూర్తితోఁ, స్వప్రభాజాలమూర్ఛితాన్య
దీప్తి, రవి నీటవలెనె బొంది ముకురమున
నాదిపురుషుండె తోఁచిన ట్లమరువాని.　　41

గీ. మేటియుద్యమము ఫలింప మెఱయువాని
నఖిలతేజస్సులకు స్థాన మైనవాని
వేసఁగి చనంగ జలభారవిపులఘనము
నరయు ముదమునఁ బ్రమథులు నరునిఁ గనిరి.　　42

గీ. "గెలుతు ముని నేను నే" నని పలుకు ప్రజ్ఞ
లెందుఁబోయెనో? తత్తేజ మెచ్చలేక
కలఁగి నిశ్చేష్టమూర్తులై నిలిచి రరులు
నిండు తేజున నసదులు బెండువడవె?　　43

ఉ. ఒంటరిఁ జేర లేనివెఱ యూఁపఁ బరస్పరసానుభూతిచే
దంటతనంబు నొందు ప్రమథప్రచయంబులసంఘు తేజ మా
వెంటనె దీటుగాఁ బెరిఁగె; బిట్టసహాయత రాశిసిద్ధికై
యంటి మహాత్ము లేని కలియ న్వలెనేకద వీతభీతులై.　　44

ఆ. బోయదండు విండ్లు పోపిడి గతిమోఁత
'రంయిరంయి' వడి శరంబు లుఱికె
వనముకొలఁకుటలలు వదలి పక్షిధ్వని
నెగసిపోవుపక్షు లేమొ యనఁగ.　　45

క. గిరిసానుగహ్వరంబులఁ
గరముఁ బ్రతిధ్వనుల హోరుగాఁ గార్ముకభీ
కరనాదం బతిరభస
త్వర నిగుడఁగ దిశలు పగులవా యనిపించెన్.　　46

చ. తరులు వనంబు లొడ్డిగిలఁ దద్దయుఁ గంపమునొందఁ బ్రాంత మం
బరము దిగంతరంబులును మాటువడ న్బెనుగాలితోఁ బయో

ధరములు మూఁగి ఘోరజలధారల రువ్వెడినాఁగ, వ్యాధయో
ధరచితబాణవృష్టులరొద ల్సెవి చిల్లులువోవ రేఁగినన్. 47

గీ. ఆఱుమాసంబులుగ దీక్ష నవిసి చిక్కి
యపుడు కయ్యంపుటుబ్బున నలరుమేన
నరునిమ్మైమఱు వవసరం బెఱిఁగినట్లు
నల్లు దిగనాడి బిగువు హెచ్చంగ వెలసె. 48

ఉ. రోదసియెల్లఁ గ్రిమ్మ్రి తగరు ల్గిరిసట్టులు తాఁకవచ్చుబా
ణాదుల, రోషపావకమహాద్యుతి కన్నుల నుల్కలట్లుగాఁ
గాఁ దదనీకినీనిధనకారినిరీక్షణఁ జూచి గాండివం
బాదట నూఁపి 'వచ్చెసమయం' బనిపేరణఁ గొల్పెకై వడిన్. 49

ఉ. దిక్కులు మూఁతఁబొందె రవిదీప్తులు బాహ్యమునందె డిందె లో
నక్కడిగాలిలో సుడు లనంతపరంపరఁ జెందెఁ గంపముల్
నెక్కొన శైలయు క్తధరణీ వణఁకు లడచొందెఁ బౌరుషం
బెక్క యుగాంతరౌద్రత మునీశ్వరుఁ డంపజడి న్గడంగినన్. 50

ఉ. చంపుదు నేను నే ననుచు శాత్రవు లొక్కతఱిన్ నిగిడ్చు నా
యంపఱ యోగ్యకాలమున కందనియత్నమురీతిఁ దోవనే
తుంపులు తుంపులయ్యె ఘనదోర్బలము క్తకిరీటిబాణముల్
తెంపునఁ దాఁకఁ దచ్ఛకలదీపితధారుణి మిణ్గురింపఁగన్. 51

—* అర్జునవిజృంభణము *—

మ. వరదుర్జేయము లై విపద్ధరము లై పౌఢంబు లై దూరగ
త్వర లై భూరిఫలంబు లై తగుశరోపాయంబుల న్వపత్రా
వరము ల్పెంపొలయంగ శాత్రవచమూవారప్రయుక్తాంబకో
త్కరముల్ నుగ్గువడంగఁ బాండుసుతుఁ డౌద్ధత్యంబుఁ జూపించినన్.

ఉ. తుంపర జల్లు వాన తెఱ తోరపుటుప్పెనముంపునా వడిన్
దెం పగుపింపరాక పఱతెంచుశరంబులజన్మభూమి యా
గుంపులు భూమియో! దివియొకో! నలుదిక్కులొ సూర్యబింబమో
డింపనిచాపమో! నరునిదేహమొ! యంచుఁ దలంచుఁ బెన్వఱన్.

ఉ. సేనలమర్మము ల్దగిలి చిల్లులఁజేసియు వానిఁ జంపఁగా
లేనికిరీటిబాణములు లేఁతఁదనంబున సిగ్గునొంది మో
మానతరీతి వ్రాలఁగ హిమాద్రిఁ జొరంబడె, 'స్వామియాన, యి
స్సీ! నెఱి మాలె' నన్నొగము చెల్లనిభృత్యుఁడు డాఁగుకైవడిన్.

క. తొలియమ్ములగణవర్మం
బులఁ గలిగినతూఁట్లు జొరవుపోములు ములుకుల్
కలఁపరుగదె సత్పురుషులు
కలిగించినపీడ పీడఁ గలిగించుటచేన్.　　55

గీ. ప్రమథులం దెంద ఱొంటాఁక బఱపుఁ గొనిరొ
యందఱిని నంతదాఁకఁ దా మరిగి చంద్ర
కిరణములు పద్మముల ముడిఁగించురీతి
నరుశరంబులు తాఁకి భంగంబుఁ గూర్చె.　　56

క. గుఱిఁదప్పక వ్యర్థముగా
కురుతరవిక్రాంతి శ్రమము నొందక బాణా
లరిమారకపాతంబుల
మఱిఁగి పురిఁ గిరీటి కడ లమర్త్యుల కొసఁగెన్.　　57

గీ. రవి యొకండైన నంశువిక్రాంతికలిమి
నందఱకు నన్నిరూపుల నలరుకరణి
ముని యొకండైన బహుశరములను బఱపి
ప్రమథులందఱ కన్నిరూపములఁ గ్రాలె.　　58

మ. అతికోపంబున నేయు వేగమున నిం దరం దెల్లెడన్ మూఁకు నా
యతిబాణౌఘము గ్రీష్మసంజనితవాత్యాఘోరమై వ్యాధసం
తతి ధూళిక్రియ సంభ్రమింపఁగ నితాంతప్రౌఢిచే నందనా
హతవిక్రాంతిఁ బరాక్రమించె సకలవ్యాపారలుంటాకమై.　　59

పంచచామరము. "తపోబలంబుచే నదృశ్యత న్సురాళి నీదృశో
గ్రపాతము న్ఘటించునో? దురంతమాయఁ బన్ని మా
యపారసాధనోత్కరప్రయాణ మాపి క్రమ్మఱిం
చి పంపునాతకస్సి?" యంచు సేన బిట్టు భీతిలెన్.　　60

ఉ. కాక "తపస్వి సాధు"వని "గౌరవనీయుఁ" డటంచు భక్తిపైఁ
పోఁకఁ "దమగ్రకోపమున శూన్యత నొందమె?" యంచు భీతియుఁ
బ్రాఁకఁగ మాప్రయుక్తశరవర్గమె మాపయి నిట్లుదూఁకునో?
లేక మహాబ్ధిభంగములలీల నొకం డిటు లేయఁజాలునే?. 61

గీ. "జయ మెపుడుఁ గాంచు బాణవర్షంబు నెప్పు
డాఁపు భువనంబు లెల్ల సౌఖ్యంబు మరల
నెప్పు డొందునొ" యని తదహీనసాయ
కాభిహతి నొచ్చి వగచు బోయలబలంబు. 62

గీ. క్రోధమున సామసాధ్యంబు కూలునట్లు
మదము రేఁగఁ బ్రియంబునిక్క మాలునట్లు
దుర్విధిఁ బౌరుషంబులు తూలునట్లు
నరునిచే బోయబలమెల్ల నలిగిపోయె. 63

గీ. ఖరకరకరోష్ణతప్తోదకములు క్రాఁగు
వడిని గుండ్రింపుదిరుగుడువడువిధమున
నరునిఖరశరనికరసంతప్తశైవ
బలము లచ్చటఁ గలగుండువడియె మిగుల. 64

క. ఆమంద వదలి జయుల
క్ష్మామహిళ నయంబు భయముఁ జిందఁగఁ జేరెన్
భూమండలంబు బాణ
స్తోమంబునఁ గప్పు గుడుసుదాడునరువింటన్. 65

# పదునేనవ సర్గము

—* పాఱిపోవుకిరాతులకు సేనానియుపదేశము *—

గీ. పిదప నట నటదుగ్రీష్మభీషణమున
మునిఁగి మునిఁగితి భూతము ల్గానియె వణఁకు
నడలి నడలివ తడఁబడ బడుగుసేన
లాన లానక సకనక నరిగె సురిగి. 1

ఆ. భయము సంభ్రమంబుఁ బ్రాణభీతియు రేఁగఁ
బాఱి మూఁక లచటిపతిని గనక
గడ్డముప్పు లడ్డక త్తెరలై మూఁగఁ
దత్తఱింప కెట్లు తాళు మనము. 2

గీ. ఆశ లడుగంట మునికోల లంటి గెంట
గెంటసము లింక సేన లేగెం గడంక
డంకతన మీగువారిపైఁ గింక లేగ
లేగడుతు జాలి నరుఁడు పాలించె నోలి. 3

చ. అలఁతులు మూఢులై యెదుర, నాదుడుకున్సరి దిద్దమాత్రకే
నిలుతురు పోర శ్రేష్ఠు, లతినిష్ఠురకోపముఁ జూపఁబోరు, వా
రలకు వినోదమౌ నది భరం బగుకార్యము కాదు గాన, దీ
ను లయినశత్రులక్ గడు ననుగ్రహ మూనుటె దారి వారికిక్. 4

శా. ఆయాకారము భీకరం బౌకట వి ల్లంబు ల్మఱొంట న్నిశా
తాయుగఖడ్గ మికొక్కచో మెఱయ యానాయానరూపాజిచా
రాయాసంబుల శౌక్యదైవబల మత్యంతంబుగాఁ గార్త్రికే
యాయోగచ్ఛిదదర్పుఁడై నరుఁడు జన్యంబందు శోభిల్లెడిక్. 5

గీ. జడుపుఁ దడఁబాటుచేఁ దొడిఁబడుచు నుఱుకు
బోయపందలవెంబడి నొప్పుపార్థుఁ
డల్లనల్లన, నెందు మహాత్ము లవయు
వారి నవయించుమక్కువ న్బడరుగాదె. 6

ఆ. ఓడి పాఱుసేన కొక్కింత ఖిన్నుఁడై
మేను సగము మలపి మేలసునఁగ
స్థిరయశోధనుండు సేనాని యాయగ్ర
భాగమందు నిలిచి పలికె నిట్లు. 7

గీ. "పోకుఁ డాఁగుఁడు డాఁగుడు పోలుపనియె?
యాటకద కదనంబు మీ కందఱకును
పోఁకుపోఁకులమూఁకఁ జీకాకుపఱచు
నసమ మన మఱ గణము లెట్లగుదు రింక. 8

చ. మగతన మింకిపో బయిసిమాలి వృథా పరువెత్తుమి మ్మిసీ!
నగియెడు మీరు తాల్చినకనద్ఘనఖడ్గము లుగ్రరశ్మినుం
తగతుల నిమ్మడిన్ దళుకునన్ మిఱుమిట్లిడు కాంతు లీనుచుం
దగవె యచేతనంబులకుఁ దక్కువయై చెడి పాఱిపోవఁగన్. . 9

ఉ. మ్రోఁగుశరంబు నాటుకొనఁ బోటరి పోటరి గుల్మపాళులన్
డాఁగునరణ్యసత్త్వములదారుల దారులఁబట్టి పాఱ నే
లాగునఁ దీఱు నంగవికలం బనలంబనఁ జిత్త మేర్చుదు
ర్యోగము దుర్యశంబు? వినరో! కనరో! కన రొప్పదేఱనో?. 10

చ. తొలఁగని యేమహాపద యెదుర్కొనె నీగతి సాహసించి మీ
రలు పరుగెత్తఁ? గీర్తిపస వ్రాలుట గొప్పతనంబు డిందుటల్,
పలుచనయాట, త్వాదృశులబాటయె? నిల్వుఁడు నిబ్బరించుకొం
డు, లలితగౌరవంబును గొనుం డరి నోర్చి కలంచి క్రమ్మఱన్. 11

చ. ♦ అసురుఁడు కాఁడు నాగపతియైనను గాఁ డొకకొండయంతరా
త్మసుఁడును గాఁడు నూత్నతరసాహసుఁడౌ ధరణీశుఁడైన రా
జసుఁడును గాఁడె! రజ్జువు భుజంగముగా భ్రమఁ గాంచినట్లు సా
ధ్వసమున గచ్చువిచ్చుగుచుఁ బాఱఁగ నేమి మునింగె మీకిటన్.

ఉ. మెల్లఁగ మెల్లెతోఁ బసుల మీటుకృషీవలుపోల్కి వాని యం
బల్లన నూఁపుచున్ వెనుకయై యరుదేఁ దిరిపీడి పాఱు మీ

---

గోమూత్రికాబంధము.

కం. ♦ ఉరగుఁడో! దైత్యుఁడో కో! చిర । తరదనుజుఁడో కో యజేయధరణీవరదో
స్వరసుఁడో కి నిత్యుఁడో కో! పర । హారమనుజుఁడో! పాయ కేయ నరయన్ వలదో!

రల్లరిపాలు కారె! పసులై రి గణాధిపులంచు లోకమం
దల్లుకొనంగ శక్యమగునా! తలయెత్తఁగ మీకు నవ్వలన్. 13

ఉ. హీనుల గెల్వఁ బ్రజ్ఞయగునే? గెలువంబడఁ బెంపె? పో రిటు
ల్మాని లగెత్తుకంటె నధమస్థితి కల్గునె యట్టిచోట? సే
నానియు నేత యోడిరొకొ? నల్గి కృశించెనె వైరి? మళ్లుఁడో
సైనికులార! నద్దెసల జానతి పాఱుట వీరధర్మమే? 14

గీ. బ్రతికి చెడుకంటెఁ దగుఁ జెడి బ్రతుక నెందుఁ
గుణవిహీనుండె మేల్భ్రష్టగుణునికంటెఁ
బాదవుత్తా లూఁడిపోయినభూషకంటె
వట్టిబంగరునగ చెన్నుపట్టు కాదె. 15

చ. ♦ వడిగల తేర్లొ? ధారఁగొనువాజులొ? ఘీంకృతిసేయు నేన్గులో?
తొడరుపదాతులో? వెఱచి త్రోవలు పట్టఁగ నేమిపోఁకె? నొ
క్కఁడు బడుగున్దపస్వి, పురిగట్టినకండలజోదు లయ్యుఁ బో
టుడుగుచు నిట్లు వెన్నిడునయోగ్యత మీ రొక రింత యెంచరే!

చ. ఖరకరునెండవేడి నుదకం బివురన్ దిగదాఁటరాని పె
న్సరద హ్రదంబుచె న్నడుగుపోలిక వైరిపరాక్రమంబుచే
సురిగినపౌరుషంబున మనుం గిడుదుర్యశ మబ్బ నెట్టిము
ష్కరజనులైన సేవపడఁగా విడఁగాఁ జెడు గూనదే మిమున్. 17

గీ. వేత్రశాకకుజాగ్రంబు విమతదుర్గ
మంబు నగమని దశదిగ్జయంబుఁ గొనఁగ
నేగుచుంటిరె? దివి దితిజేంద్రకోటి
మీటుమీ కిది భరమె? వనాటులార! 18

ఉ. కావఁగ నేరు లేరని పొకాలుదు మందురె? యెందు సువ్రత
శ్రీ విడు పెండ్లమున్ మగఁడురీతిఁ జమూపతి కొండగట్టుగా

♦ గాయత్రీచ్ఛందోవృత్తము. తేరులఁదేజుల। గౌరులఁ గాలురు।
తేరుల? తేజుల? । గౌరుల? కాల్వుర?
అనఁగా, తేరులఁదేరుల?= అడరురథములా?, తేజులఁదేజుల?=ప్రతాప వంతము లగుగుఱ్ఱములా?, గౌరులగౌరుల?=కపటము గలయేనుఁగులా? కాలురు కాల్వుర?= కాలులు శ్రేష్ఠము లగు కాల్బలములా?

మీ వెఱ లెల్లఁ బాపి విధి మీఱుట లెంచక రక్షఁగూర్పఁ దా
నై విడిసెన్గదా ! యెఱుఁగరా ? తదమేయధురంధరత్వమున్. 19

శా. ఓహో ! యూధపులార ! మంథనగము ట్లుగ్రారివారాసులన్
బాహుప్రౌఢిఁ గలంపరో ! పగతుల న్మర్దింపరో నేర్పునన్ ?
భీషః వెట్టఁగ ఘోరతం దవులరో? పృథ్వీశు సేవింపరో ?
వ్యాహారంబుల, రక్ష, నాదృతిని, ధార్ష్ట్యంబందుఁ బేర్గాంచరో? 20

చ. దివిజుల మించుమీ యెదుట దీటె నరుం డొకఁ? డేటి కెన్నఁడున్
దవులనిజంతు సోఁకె మిము? దర్పము పెం పభిమాన మిట్లు చూ
అవిడుచు టేల? మీగుణపరంపర లెం దరిగెన్? జుగుప్సితం
బవుగతిగాఁ బలాయనము నందికొనన్ మది సిగ్గు గల్గదే ? 21

చ. అమరులె కారె; వైరిఁ గనరా? భయ మింతయు లేక శాతఖ
డ్గము వరియించి తేజమునఁ గగ్గక దివ్యతరాజిరంగభా
రము వహియించి యెట్లు నికరంపుజయంబున నున్న వాఁడో! మీ
యమరిక యట్టు లుండవలదా! వెస దానిని మించకుండినన్. 22

ఆ. పోరుటంగి వెలుఁగ భూరితేజంబుచే
నురము పొంగు లెగసి యొప్పఁ జిలుక
కఱకువాఁడికత్తి కదను ద్రొక్కఁగఁ గాళ్ళు
లూఁది నిలిచెఁ గనుఁడి యుద్ధభూమి. 23

చ. తలఁపున లేదె మీరు మును దారుణయుద్ధముల న్రథంబు దా
రులు చెడ గుఱ్ఱము ల్పడఁ గరు ల్గిరులట్లు మొగ్గి నెత్తురే
ఱుల వెలిగ్రక్కఁ జూపినయరుంతుదశస్త్రకళాకలాప మా
చలము బలంబు జ్ఞప్తిఁగొని శాత్రవు నోంచుఁడు కాంచుఁడున్నతిన్.

ఉ. అమ్ములఁ గ్రమ్మి ఱిమ్మి యుపహాస్యము లాడుచు దోమిఁ జిమ్మి పెన్
రొమ్ములఁ దాఁకి దూఁకి సురరోధకుల న్జవసోఁకి యేకి ధై
ర్యమ్ములఁ జించి నొంచి భువనాళులఁ గీరితి మించు నంచు నా
డెమ్మను మంతు నింత ప్రకటింపరె పెంపరె మీప్రసిద్ధతల్. 25

చ. మఱచితిరెట్లు మీరు రణమధ్యముల న్దోలి వైరికంఠముల్
దఱుగఁ జలించు మొండెముల దండడికి న్బెదరొంది తత్తడుల్

పఱచుచు రౌతుల న్దెలివిఁబాయఁగ నేలకు ద్రొబ్బి మారుతుం
డుఱుక ధ్వనించురిత్తదౌనహారునఁ గ్రమ్మఱి డాసి చచ్చుటల్.

ఉ. విస్మృతిపొఁకెనే కదనభీరువులేని విరోధిసేనలన్
విస్మయమెక్క నుక్కుపొలిపీకున దాఁకఁగఁబోరు బొబ్బలన్
సుస్మితి హేలగా మునుపు చూపినమీజగడంబుడంబు, శ
త్రుస్మయవృద్ధిగాదె చెడి త్రోవల డొంకలఁ బట్టి మీరిటన్. 27

ఉ. ఉగ్రతరాసురాహవపయోనిధుల న్బహుశాస్త్రశస్త్రవా
తగ్రథితాయతప్రళయదర్పితమేఘసమూహవర్షధా
రాగ్రముల న్బ్రతాపమహిమాంచితసుస్థిరయుద్ధబద్ధనా
కాగ్రమదివ్యకీర్త్యతిశయం బిటు లారడిపుత్తురే యిటన్ ? 28

చ. అని కులగౌరవంబుపస, వ్యక్తులపూర్వవిశేషపౌరుషం
బును, జనతాపహాస్యముఁ, బ్రభుప్రియభంగము జూపి చెప్పస్కం
దునిపురికొల్పుమాటలకు నొవ్వక చివ్వకు మళ్ళ కార్తితెం
పునఁ బరువెత్తుమూఁకభయము ల్చెఱున వ్వగుపన్ హరుం డటన్.

చ. మునిశరదానవహ్నిపరిభూతిఁ దపించి త్రిపన్నృశించి తొ
ట్రిన వెను చూపిపాఱు ననిరుద్ధుల కుత్సవకృత్సుధాభిషే
చన మన శంకరుం డనియె "జం కెడఁబాయుఁడు, పాఱిపోకుఁ" డన్
ఘనజలదస్వనాధికవికస్వరసుస్వరధీరవాక్యమున్. 30

గీ. సెలలబాధయు, నోడినసిగ్గు, సెలలఁ
దఱుముఁ దఱుచుగణాళిచిత్తములఁ దఱుము
సమయమున భీతిగదిరి వాక్సమితిసమయ
శంకరోక్తి యడంచె నా జంకు శంక. 31

గీ. పరశరాంభోధి దుస్తరభంగిఁ గవియఁ
దేలి మునుఁగుచు మునుఁగుచుం దేలుగణము
లవలిగట్టనఁ బొల్చినహరునిఁ జేరి
ప్రాణభయ మేగ భక్తిం బ్రపత్తి మనిరి. 32

ఉ. ముంగలిపొద్దుచే వెనుకఁబొల్చెడిసీడను వృక్షమట్లు దీ
ప్తాంగుఁడు శంకరుం డభయహస్త మొసంగి పిఱిందిదైనసే

నాంగము లొప్పమీఱ సమరావని కున్ముఖుఁ, డయ్యె నాశ్రితుల్
మంగళకృత్కృతజ్ఞతల మాటికి గీతములన్ స్తుతింపఁగన్. 33

—♦ శంకరార్జునుల శరయుద్ధము ♦—

చ. రణితపినాకుఁడై ప్రళయరౌద్రిత నర్జునుపై ననేకమా
ర్గణముల నేశుఁ డేయునెడఁ గల్గినఘోరరవంబు లోకమా
రణపరతంత్రశక్రకుధరస్ఫుటనస్వనమట్లు రేఁగ ది
గ్గణమట ఘూర్ణిలెన్ బహుళఘర్ఘరినాదము లుప్పతిల్లఁగన్. 34

గీ. విజయవిశ్వేశభీమసంవిత్క్రమంబుఁ
జిత్రసంస్థాచలాకృతిస్థిరత దరిసి
ప్రమథగణములు విడ్డూర మమరఁ గనిరి
చిత్రసంస్థాచలాకృతిస్థిరత దరిసి. 35

గీ. కడిఁదిజతనంబునలవాటు గలుగుకతన
వింటిమొనగాఁడు వెడబేసికంటివాఁడు
కత్తిములుకులబారు కంగారుపఱచె
గడుసుటంపజడిన్ బడిన్ బడి నడర్చి. 36

గీ. సాయకంబులఁ బ్రాణావసాయకములఁ
బాపఁదాల్పరణక్రియన్ బాపఁదాల్చె
శిక్షచేతను ఘనరణశిక్షచేత
నర్జునుం డాజికీర్తిశోభార్జునుండు. 37

గీ. చూచి చొచ్చి చేరి రేచి చిచ్చె చార
చారురుచి రచించి చీరి చీరి
రాచచర్చ చెంచ! రారోరి రారంచు
రాచె రచ్చ చెచ్చెరన్ జరించి. 38

మ. నెఱి గోరోజనమార్గవిధూనపటుగాండీవప్రచండత్వరన్
శరసంధానవిమోక్షణాంతరకథిన్ శంపానురూపాభ చే
కుఱ బీభత్సుఁడు విక్రమింపఁ బ్రళయార్కుం డుల్కతో నొప్పనొ
ప్పు రహస్థత్క్రళ వెల్గె నప్పగిదిచొప్పున్ వైరు లగ్గింపఁగన్. 39

చ. నిబిడవినీలనీరదఘృణిప్రచయంబులు సూర్యభానుజా
లబహుళకాంతిగౌరవముల న్మసుఁగొంది తిరోహితంబులౌ
సొబగు ఘటిల్లె న త్తఱిని శూలి నిగుడ్చుశిలీముఖాళిపై
గబగబఁ బార్థుఘోరవిశిఖంబులు దూఁకి యడంచి కప్పినన్. 40

గీ. సాంద్రశరవృష్టి విజయుండు సవితృపథము
మఱుఁగువడఁజేయ ముక్కంటి మహితబాణ
పటలములఁ దన్నిరోధంబుఁ బాపె ; సూర్యుఁ
డాత్మకిరణాళి హిమముఁ బోనడఁచురీతి. 41

ఆ. కరము నభయదములఁ బరిపంథిభీప్రద
ప్రదరముల మయూరరమ్యపక్ష
పక్షకముల హారుఁడు పరుఁ జంపఁ, డనిఁ గడు
గడుసుటడరు విడఁడు కనికరమున. 42

చతుర్థపదగోపనము :-

ఆ. మెఱుఁగుపురులఁ గరము మేలిమి కోలల
బా ర్లమేయరవము పాటిలంగఁ
జెవులు వగులఁ దఱచుఁ జెంద రోదసి నిండు
మెఱుపుగముల మేటివఱద నిండు. 43

కందద్వయగర్భితచంపకమాలిక.

చ. ♦ గడుసరిగాఁగ శంకరుఁ డఖండరవం బడరంగ నచ్చటన్
ముడినరుదార బాణముల ముంప రహిన్ దనశస్త్రచండిమల్
జెడ జాఱుకున్ ఘటిల్ల నవశత్వర నొందక డిల్లవోక తాఁ
గడుదురుసున్ వహించి సమకట్టె రణంబున కాయతార్భటిన్. 44

---

గర్భితకందద్వయము.

కం. సరిగాఁగ శంకరుఁ డఖం । డరవం బడరంగ నచ్చట న్ముడి నరుఁ దా
నరుదార బాణముల ముం । ప రహిన్ దనశస్త్రచండిమల్ చెడజాఱుకున్.

కం. జాఱుకున్ ఘటిల్ల నవశ । త్వర నొందక డిల్లవోక తాఁ గడుదురుసున్
దురుసున్ వహించి సమక । ట్టె రణంబున కాయతార్భటిన్ గడుసరిగా. 44

అర్థత్రయవాచి.

గీ. అతఁడు జగదీశరణయుక్తుఁడై సుధాసి
తుండునై హారికాంతుఁడై దండి మెఱయ
దానవర్షి కృతాశంసుఁ డై నకతన
నాగరాజసమప్రభ న్దనరె నచట. 45

చ. జతనము వమ్ముగాఁగఁ దనశస్త్రచయం బొకఁబోయవానిచేఁ
బ్రతిహతి నొంద ముమ్మర మవార్యమునై మది రేఁగురోష ము
ద్ధతి సకలాంగకంబుల బయల్వడె నిస్తులదావపావకా
యతకళఁ బార్థునింద్రియములం దభినూత్నరుచుల్ ఘటించుచున్.

నిరోష్ఠ్యము.

గీ. అధికరోషోత్థకాంతుల నన్నిదెసల
నినుచుచున్ రాగిజడలతో నిలుచునరుఁడు
కాలునోషధికాగ్నిశిఖల్ చెలంగఁ
దనరునగరాజు చెన్నునఁ దారసిల్లె. 47

ఉ. కాండపరంపర ల్హతముగాఁగ సహస్రముగాఁగఁ గ్రిడి మా
ర్తాండకరంబులట్లు జవదర్పముల న్నిగిడింప సాంబుఁ డు
ద్దండత నన్నిటి న్ప్రతిహతంబులఁజేసి యమారకంబులై
యుండియు ఘోరమూర్తులయి యొప్పుఘనాంబకపాళి నించినన్.

చ. ప్రళయనిదాఘచండతరభానుసహస్రముఖాగ్నిదీప్తులన్
దళముగఁ బైఁబడన్ దొడరుదర్పకహారిఖరేషువృష్టికిన్
గళవళమొంద కాఁపుకడఁక న్విజయుం డడరించె నం దన
గ్గళశితసాయకాంబుదపరంపర ధారుణి మూఁతఁ జెందఁగన్. 49

గీ. ఘనతరార్జునబాణపూగములఁ బిదప
శివకళాసారవాణముల్ చీలఁబాఱె
ఘనతరార్జునబాణపూగములఁ బిదప
శివకళాసారభాణముల్ చీలఁబాఱె. 50

ఉ. ఈగతిఁ దీవ్రపాతము లనేకములు న్మహిమాంచితంబులై
మూఁగుకిరాతనాథునియమోఘశరౌఘముల న్నగాచల

శీఘ్రఁ గొని యోఁగఁజేయువడిచెన్నున నన్నరుఁ డందు నెందుఁ దా
నై గడితంబుగాఁ గొలిపె నర్బుదముల్ మునిరాట్స్వరూపముల్.
గీ. మనె వికాసత జగతీశమార్గణములు
మనె వికాసత జగతీశమార్గణములు
మనె వికాసత జగతీశమార్గణములు
మనె వికాసత జగతీశమార్గణములు. 52
మ. శివశౌర్యాతిశయంబుచేత జయలక్ష్మీవాంఛ రెట్టింపఁ బా
ర్థివసూనుండు ప్రకోపితోగ్రబలుఁడై దీపింప రుద్రాంశవాఁ
డవుమర్మంబు నెఱింగియున్నమునులే నాశ్చర్యరోమాంచవి
ప్లవసమ్మోహితు లైరి యన్యులగతు ల్పల్కంగ నేలా యిఁకన్.

---

# పదునాఱవ సర్గము.

## అర్జున విషాదము

ఉ. " వాడిమగంటిమి న్నెఱపివాఁడఁగనీయ కసాధ్యసంగర
క్రీడ నజేయతం దొడరుఁ గ్లిష్టచరిత్రుఁడు పైకిఁ జూడఁగా
వీఁ డొకచెంచు చుంచు హరివీర్య మెదుర్చుట యయ్యొ" నంచు నా
క్రీడి రుషాద్భుతాహతులఁ గ్రిందును మీఁ దవుచుండె నచ్చటన్. 1
ఉ. "ఘీం"కృతిఁ, బీసహస్తములు గిఱ్ఱనుచుండ నకాలమృత్యుదం
ష్ట్రాంకకఠోరదంతసహితాయతకుంభము లూఁగ ఘోరగం
డాంకమదప్రవాహము లనర్గళతం బ్రవహింప యుద్ధవీ
రాంకుశచోదితాద్రిసమహస్తులు రా వసదైతి నేటికో ! 2
మ. ధ్వజరత్నంబు లినాథలన్ గుడుసుఁ జెందన్ మింట భిన్నప్రభా
వ్రజమున్ గా లిఖియింప ఘంటికలుఁ జిత్రధ్వానము ల్సేయ నే
మిజరావంబులు నీరదధ్వనులమేల్మిన్ మీఱఁగా ధారుణీ
రజముల్ రేఁగ మహారథౌఘములునన్ రా వేల యిల్లైతినో ! 3

శా. కుంతశ్రేణులె యూర్మిమాలికలుగా గొబ్బిళ్ళుగా నాడుచుం
గంతుల్వారెడి శుభ్రపుచ్ఛములె ఫేనశ్రీలుగా హేషలే
యంతం బొందనిహోర్లుగాఁ బటుతురంగానీకపాథోధి ది
క్సంతానంబులఁ బొర్ల దుద్ధతి నశక్తత్వంబు నా కేటికో! 4

ఉ. "చచ్చెదు చచ్చె" దంచుఁ బెలుచ న్బెడబొబ్బలు రేఁగ ఖడ్గముల్
గచ్చులఁ గచ్చులన్ బహుళకంపముతో నరియూథపుల్ పరున్
మెచ్చక త్రిప్పుచుం గదుర మీటుల నొందిన భానుతేజముల్
విచ్చినకత్తులై చదల లేవవు నా కలు పేల పోఁకెనో. 5

చ. క్రమముగఁ గాఱుధూమములు గ్రమ్మఁగ నంతకఘోరసాంద్రసం
తమసమాననైల్యము లెసంగ రథాంగకరీడ్ఘటాతురం
గమఖురనున్నభూరజము గ్రాలదు దట్టముగాఁగఁ జుట్టు న
ర్యమపటుదీప్తి మాటువడ, హా! చనె సత్తువ యేల నా కిటుల్! 6

శా. వీర్యోద్బుద్ధిపితుల న్వరించుతమి నుర్విం జేరుస్వర్గామినీ
కార్యంబు ల్సెడఁగాఁ బ్రదోషకళల న్గావింపుచు న్నిష్ఠురా
వార్యాక్రాంతిని నేత్రరోధకరజోవష్టంభసంరంభముల్
మార్యావేశత రాసభప్రభలతో మారోర్కవు జం కేటికో! 7

మ. కరిఘీంకారములా? భటేంద్రపటుసంఘుష్టోత్థభేరీమహా
త్తరభాంకారములా? రణాశ్వద్రుతసాంద్రప్రోథదీర్ఘీకృతో
ద్ధురహేంకారములా? రథాంగవికటోద్భ్రాంతోగ్రమాద్యద్ఘుర
ట్టరటాత్కారములా? వినంబడవు జాడ్యం బేల న న్నోఁకెనో!

ఉ. పౌరుషవంతులై యశము వాంఛల రేఁగి విరోధిబాణము
ల్సారెకుఁ బేరురంబు వికలంబుగ దూఁట నసడ్డఁజేసి శౌ
ర్యారభటి న్రణాంతరశయానత నొందినవీరులన్ ఘనా
కారఘటల్ హిమాంబుకణికాతతిఁ దేర్పఁగ రావు పైఁబయిన్. 9

శా. ఈమచ్ఛిష్యములై యసృఙ్మయనదీహేవాకమై పెంపఁ బ్రి
త్యూషాభన్ ధ్వజినీపక్షంబునడుమ న్దూఁగాడుమేఘాళి కు
న్మేషం బింతయు రాదు పంకమునకు న్గీలాలసంప్రాప్తిన
ట్లీషాడ్గుణ్యవిహీనదైన్యగతి నా కేలా ఘటిల్లన్వలెన్! 10

ఉ. సాహసమత్తరౌద్రగజశాతయమాయుధదంతపంక్తిపై
నోహట మూనకే చని తదుగ్రహతి న్దివి కేగువీరస
న్నాహము గౌరవించు, సురనారులకల్పకపుష్పమాల లు
త్సాహము రేఁగఁ బైఁబడవు సాధ్వస మేచెడి నన్ను నేటికో! 11

మ. కరితుండోజ్ఝితనీరశీకరఘనాఘంబందు మాస్త్రీలబం
ధురవర్మంబులఁ జిత్రరత్నవితతుల్ దోఁపింప వర్కత్విషా
ఝురుల న్శక్రధనుఃపరంపరలు, నిస్సారత్వ మి ట్లేల నన్
గరమున్ బైకొనుచుండు హేతు వొకఁడు న్గానంగరా దద్దిరా! 12

చ. మొలిచినఱెక్కల న్దనువు పొంగఁగ మేటిధరాధరేశ్వరుం
డలఘుజలంబు రేఁగ విపులాంబుధి దూఁకి కలంచునట్లు లి
ట్టలపురయంబున న్బెనుకడంక విరోధిమదేభ మేచి సే
నలఁ గలగుండుసేయ నగునాదము లించుక లే వ వెచ్చటన్. 13

ఉ. పావనమానసత్వరలఁ బాఱురథంబులతో మహారథుల్
దీవరమూని సంగరపథిన్ గతివారణరీతి వారణ
గ్రీవకరాదిఖండనగరిష్ఠత మించుటగూడ లే దహా!
స్థావిర మెత్తినట్లు పలుచంబడెఁ బౌరుష మేల నా కిటన్! 14

ఉ. పాపటకల్వచేరు, విడఁబాఱినపెన్ దలకట్టుఁగా, మృతుం
డౌపతి వక్షమందుఁ బడునాలివిధంబునఁ బింఛపృష్ఠసం
దీపితతోమరం బురము నెక్కొన హా స్తిపకుండు భూమిపై
నేపఱఁ గూలఁ గల్గ దిది యెక్కడి చాలమి సోఁకె నా కిటన్. 15

శా. కల్పాంతప్రళయాహతిన్ బహుళసంఖ్య ల్గాఁగ వీర్యాధికుల్
పొల్పుంబాసి నశించుచో గ్రసనసంభూతత్వర న్ఘోరసం
కల్పం బూని ముఖంబు విచ్చుకొననాల్కల్సాఁచుమృత్యుక్రియా
శిల్పం బిచ్చట లేనెలే దురక తోఁచెన్ శాంతి నా కేటికో! 16

ఉ. సంద్రము లేర్లు దాఁటి కలుచం దనముంగిటికాల్వఁ బడ్డటుల్
రుంద్రబలప్రభన్ గురువిరోధిధరాధరశేఖరాళి ని
స్తంద్రత గెల్చి హీనరణధారుణి బోయకు లొంగనుంటి హా!
చంద్రునివెన్నెలల్ మలపెఁ జండరవిప్రభ నేమిచిత్రమో! 17

చ. ఇది పెనుమాయ యేమొ! చలియించెనొ నామది! నాబలంబు సం
పద చెడెనొక్కొ! తొంటివలె బార్థుఁడఁగానొకొ నేను! శత్రుభీ
ప్రదవరగాండివాంబకపరంపర లెప్పటిశక్తి మాని యి
య్యెదనున నీకిరాతుదెస హా! హతశౌర్యము లయ్యె నేటికో! 18

ఉ. ఎక్కడిబోయరా జితఁడహీనగుణాకరవపూర్తి నీసుగో
పొక్కట లేఁగ నేఁచి పురుషోత్తమమధ్యమమైనరోదసీ
ఫక్కిన రెండు చేసెడిని బై కగు వేమను వేషమాత్ర మా
నిక్కము చేష్ట లంబుకళనిగ్గులు గూఢము లెంచిచూడఁగన్. 19

క. దూయుట కూర్చుట యేయుట
లేమెడఁ దోఁపక ధ్వనించు నెపుడు ధనువుమో
పాయతమముక్త మారా
రా! యీపస బోయ కెందు నలవడఁ గలదే? 20

ఉ. నవ్యమయూరపింఛపరిణద్ధము కొండియ సంచలింప దా
జివ్యసనప్రయాసమునఁ జెమ్మట లెత్తవు పొక్కు నిక్కదా
స్యవ్యవహారము ల్మలయహాసము వాయ వొకప్పుడేని సం
స్తవ్యముగాఁ బ్రసాదరమ జాల్గొనుఁ జంద్రకిరీటునాదటుల్. 21

మ. రణభేదానుగతిప్రచారగురుసంరంభంబులం దంగముల్
వణఁకుం జెందక పొంగుల న్మలయు సంపాతాదిసంశుద్ధి మా
ర్గణమోక్షంబు చలాచలంబు లగులక్ష్యప్రాప్తిఁ దుల్యం బస
ద్గుణుఁడౌ నీచకిరాటుఁడైనఁ గనునొక్కో నేరుపీవైఖరిన్! 22

ఉ. సందొకయింత వైరిసరసన్నిగుడ న్గుతితించి మించు నే,
ర్పెందు స్వకీయరంధ్రముల నేర్తెఱఁగా చునసాధ్యశక్తి, యీ
పొందునఁ గల్గనే గురునిశాంతను భీష్మునిచెంత బోయలన్
జెందునె! పట్టిమాట, కడుఁజిత్ర మమానుష మింత నిక్కమా. 23

శా. ఈయప్రాకృతు నాజిదుర్మదుని నిస్సీ! యం చుపేక్షింప కే
మాయింతు న్బరమాస్త్రయోగముల నిమ్మాయాస్వరూపం బటన్
దాయన్ రోగసమాను నల్పునయిన న్దండింపకున్నన్ న్మహా
పాయం బౌఁ దుదిఁ; జిన్నపామయినఁ జంపం బెద్దబాఁకే తగున్. 24

—• శంకరార్జునుల దివ్యాస్త్రయుద్ధము •—

మహాస్రగ్ధర.

అనుచుం దెంపూని పార్థుం డచలబలుఁడు సాంద్రాభ్రసంఛన్న రాత్రి
ఘ్నసనీరంధ్రాంధకారోగ్రత నెఱపుక్రియన్ గాఢసంక్రాంతమార్గా
బనిచెం బ్రత్యర్థికోటుల్ భయమున బెదరం బాఱఁబ్రస్వాప నాస్త్రం
బనివార్యారంభవేగం బడర గిరులు నూటాడ దిగ్దంతు లోడన్. 25

మత్తకోకిల. కాఱుచీఁకటి కాననంబులఁ గప్పి మాపడఁగించునా
తీరుగ న్గణకోటితో శివతిగ్మరశ్ములు మాయఁగన్
ఘోరదావమహాగ్నిధూమము మొకో యనంగ మహీరస
స్ఫారనీలిమపొంగుతో నటఁ బర్వె నస్త్రమహోద్ధతల్. 26

ఉ. పండితుఁ డైనవాగ్మి తొలిపట్టునఁ బ్రౌఢత వెల్లడింప నా
దండికి ముగ్ధ మైనసభ దారి నటం బ్రథమోత్సుకోగ్రమై
చండతఁజూపునస్త్ర మవశత్వముఁ గూర్ప విరోధిసైన్యముల్
కొండొకచింతమాని కనుగూర్కుల నిద్ర మునింగె బిట్టుగన్. 27

ఉ. ఉత్తమవంశసంభవత నొప్పుగురుస్థిరవృత్తి, సంగతా
పత్తిఁ బరీక్షకాఁగి నయపారము సారము గన్నకొన్నివిం
డ్లత్తఱిమిత్రిపోల్కి వెస నాదుకొనెం దగుమాఁత నిచ్చి య
స్త్రాత్తవిమోహులై యొఱఁగుచున్నట్టియు నట్టిరు లుట్టితోట్టఁగన్. 28

గీ. కృషిముఖంబుల ఫలము లదృష్టహాతిని
జేతికిన్ రానిరీతి నాసితహయాస్త్ర
మెదురుకొనుకొన్ని ధనువు లం దిలను బడియె
హా స్త్రముల వీడి యమునాన నందినటులు. 29

శా. ఆసేనన్ హతశేషధైర్యు లగువా రందిందుఁ దూఁగాడు చా
సాస న్దారుచు నడ్డమై తగులుభూజాళిప్రకాండంబులన్
బై సింకంగ నిజాంసభాగములు నొవ్వన్ గాఁగిలి న్వ్రేంది యా
గాసింజేతులు జార్చి రున్మదకరుల్గాఁ గన్ను లల్లార్చుచున్. 30

మ. నిజరూపంబున శంకరుం డమరుచో నీరేజవిద్వేషి యుం
డు జటాజూటపదాగ్రమం దపుడు కన్గోనయ్యె మానీంద్రు లె

ల్ల జయధ్వానముల న్నమస్కృతులఁగొల్వంగాఁ బిశంగాభ మే
రుజచండార్కసమానదీప్తి దివి నారోహింపఁగా నుద్ధతిన్. 31

ఉ. తత్త్వ మవిద్యనుం బలెన తత్ప్రభ లంతకునంత కెక్కుడై
సత్త్వగుణప్రకర్షల దెస న్వెలిఁగించుచు నర్జునాస్త్రనీ
లత్వ మడంచి మించె సకలప్రళయంబులు వీడ వస్తుసం
విత్వము చేకుఱ న్సుఖ మమేయత నగ్గణకోటి రాజిలన్. 32

ఉ. వారిదపంక్తు లెల్లెడలఁ బాటలితంబులు గాఁగఁ బూర్వసం
ధ్యారమ సొంపుపెంపున వియత్తలమెల్ల నలంకరించుచున్
నీరజపాళి విప్పగతి నిద్దములైన తదీయకాంతు లం
దారభటి న్గణాక్షినివహంబుల విప్పి వికాస మొప్పఁగన్. 33

మ. గురుమేఘప్రతిసీరవాయ దశదిక్కుల్ జ్యోతుల న్నించువై
ఖరిఁ బ్రస్వాహన మంతరింప గణసంఘంబు ల్విజృంభించి స
త్వరత న్శస్త్రపరంపర ల్వదలి రాప్రత్యర్థిపై మింట మి
న్నురులం జిమ్మొడి మేలుకట్టగుచు నెందు న్భ్రాంతి సంధిల్లఁగన్. 34

చ. భర మగుకాళరాత్రిచన బల్లున మిన్ను స్ఫురించె దిక్కులం
బరఁగెఁ బ్రసాద మర్కఖరభానుసహస్రములు న్స్ఫుటంబులై
వఱలె నహోత్సుకత్వమున వాసరలక్ష్మియు నైజదీప్తులం
దిరమయి యుద్ధరంగమున నించె ననేకమనోజ్ఞనృత్యముల్. 35

చ. తన యస్త్రాచలదుర్గరాజము పరస్థైర్యోరుదిగ్వారణో
గ్రనిపాతంబున భగ్నయత్నమయినం గంపింప కాసవ్యసా
చి నిజాభీలభుజాబలంబు వెలయ న్విఘ్నంబుగా వైరి బం
ధనముం గూర్పఁగఁ బంపె నద్భుతభుజంగక్రూరసారాస్త్రమున్. 36

చ. మెఱపులఖుక్కులై కొనల మేటివిషాగ్నులు చింద జిహ్వలం
దరుదుగ నూర్ధ్వకోటులుగ నార్చు చట న్నెఱిపోక దూఁకఁ ద
త్తఱమున బోయముఁాక పెడదారులఁ బట్టఁగ నడ్డగించుచున్
గిఱికొనె నస్త్రశక్తి యెసఁగించిన ఘోరభుజంగరాజముల్. 37

స్రగ్ధర. ఆశామత్తేభహస్తాగ్రకృతులదను వ్యాపృతుల్ దూఁకువారల్
బ్రాశస్త్యప్రౌఢనీలప్రకటమణివిభాభాసిభోగాళితో నా

కాశార్ణోరాశివేల్లద్ఘనభయదతరంగక్రమం బొప్ప సేనా
నాశోత్కర్షంబులొప్ప న్నలుదెసల మహానాగముల్ గ్రమ్మెవైరిన్.

చ. ఫణముల విప్పి క్రోధముల బల్మి బుసల్ చెలరేఁగ నాగరా
డ్గణములు, తీక్ష్ణహాలహలగర్భితధూమ్రము లగ్నిపర్వతో
ల్బణజదవోరుధూమములభంగిగ, సాంద్రత మిన్నుముట్ట నా
క్షణమునఁ గ్రుంకునట్లు రవి సౌమ్యతఁ గైకొనె దర్శనీయుఁడై. 39

ఉ దృష్టివిషంబు లుద్దవిడిఁ దీఱనియుల్కల నుల్కలట్టు లు
త్కృష్టవిషాగ్ను లక్షితతిఁ గ్రొవ్వగఁ గ్రక్కఁ బిశంగితంబులై
యష్టదిశ ల్సుతప్తకనకాభల శోభలఁ గూర్చె సేన ప్ర
భ్రష్టధృతి న్గలంగఁబడి ప్రాణభయంబున నుమ్మలింపఁగన్. 40

ఆ. రాకపోక లణఁగ రాణ నశింపఁ బె
న్చిచ్చుఁబొగలు నెందు నిగిడి మిగుల
ముట్టడింపఁబడినపట్టణం బన మిన్ను
భోగు లెగసి మూఁగపొలుపుఁ బూనె. 41

క. నాగాస్త్రమున విరోధి ప్ర
యోగించిన భేదమెల్ల నొకయింతటిలోఁ
బోఁగొట్టె హరుఁడు హేలయుఁ
గాఁగ గరుడమంత్రబలముకలిమి రణమునన్. 42

క. అనిమేషు లైన దివిజుల
కు నిమేషత్వంబు గదుముకొనఁగఁ దటిద్దీ
పనములుగా గారుడవ
ర్తనములు దివినుండి సుందరత ఘటియించెన్. 43

లయగ్రాహి. ఎక్కుటయు డిగ్గుటయుఁ బ్రిక్కకు గమించుట గ
బుక్కుమని వ్రాలుటయు నుక్కునను వేగం
బెక్కఁగ విచిత్రగతి నక్కడఁదిపక్కిగము
లక్కడఁ జరింపఁ బురి నెక్కొనినగాలిన్
జిక్కుకొని కాఱడవిచక్కఁగలవృక్షములు
తుక్కుచెడుధూసరుల మక్కఁగొనినట్లై

యొక్కఁ మొగి పెన్నడి గిరుక్కఁ మనుచుం దిరిగి
పెక్కుసొగసు ల్గొలిపె నక్కజముగాఁగన్. 44

ఉ. భిన్నమనశ్శిలాప్రభలబిట్టుగ నొంచు వెలుంగు గుంపులన్
పెన్నుదెస న్ముసుంగిడుచు విస్తృతవక్షముఁడీకుతాఁకునన్
మున్నదలించుచుం జనెడిభూరిఖగంబులజాడ నింగియు
న్గ్రిన్నఁ బురోగతిం జనుటగా నటనొక్కవిచిత్ర మేర్పడెన్. 45

చ. కలుపొసఁగించుకెంపుసరికాఁదగుస్వర్ణసువర్ణ పక్షదీ
ప్తులను దరీముఖప్రతతిఁ దోరముగాఁ జెడఁద్రావి సోఁకుకై
పులఁబలెఁ జొచ్చలించె ఖగభూరిజవానిలఘూర్ణితోరుసా
నులసితమా హిమాచల మనోకహము ల్గురుల్గఁ దోఁపఁగన్. 46

ఉ. మన్నును మిన్ను సాంధ్యసుమమాసమదీప్తిఁ బిశంగశోభలం
జెన్నుఁగొన న్రవి న్మఱుఁగుఁజేసి వనంబులనెల్ల నీడలన్
బన్నఁ బులుంగుమూఁక రణపాంసులకు న్భుజగేంద్రసేనలన్
మన్నిగొనం బ్రిడీనగరిమన్ డికుచో నెఱఁదన్ని యేగుచోన్. 47

శా. ప్రాయశ్చిత్తవిధానము ల్సవనకర్మంబుల దోషంబులన్
బాయంజేయుగతిన్ బ్రతాపబలసంపత్తేజు లౌనాఖగే
ద్రాయాదుల్ చలపట్టి ముట్టుకొన నిర్దాక్షిణ్యులై చెండఁబా
డై యాభోగిబలంబు చిత్రముగ మాయంబయ్యె నొక్కింతలోన్.

ఉ. సంచితపుణ్యకోట్లువరుసం దనఘోరభుజంగమాస్త్ర మా
చెంచుపరాక్రమంబు ఫలసిద్ధిఁగొన న్నశియించిపోవఁ గో
పించి కిరీటి మంత్రము జపించి నిరింధనవహ్నికంబు రౌ
ద్రాంచితతీవ్రమైనయనలాస్త్రముఁ జెచ్చెర నేసె నేసినన్. 49

శా. క్రిందం బ్రక్కలఁ బైన సాగుశిఖలే రెక్కొన్నజ్వాలై ఘనా
ళిం దట్టంగఁ గ్రమించు కేసరులపోల్కిన్ వహ్నిబృందంబు లం
దెందుం దామయి సర్వజీవహననోగ్రేచ్ఛన్ విజృంభించుచో
విం దన్మారణయుద్ధరోదసిని బర్వెన్ బిట్టుఖర్వత్వరన్. 50

చ. ఎరగలిగా స్ఫులింగము లనేకము లుగ్రతఁ జంక్రమింప ను
ద్ధురగతి ధూమమేఘములు దొర్లుచు నింగికిఁ బొంగ భగ్గుభ

గ్గురవములన్ శిఖ ల్విడుగుఱొత్తిల భాస్కరుదీప్తి మించ నా
దురమున మేదురంపుఁ గళతో నకృశుండు కృశానుఁ డేఁచినన్.

లయగ్రాహి. నెట్టుసుడిగాలిరొద లట్టిపడ దట్టముగ
ముట్టుకొని గట్టిపస నిట్టలపు వహ్నుల్
దొట్టుకొన బిట్టెగసె నట్టనడిపట్టులను
దట్టులను మేల్మికళ చుట్టఁ బురికట్టన్
మెట్టు మినుముట్టుకొన గట్టులనఁగాఁగవను
పట్టులనఁగాఁ బ్రిహరితెట్టువ లనంగాఁ
బట్టణములో మణులగుట్టలో పలాశవన
పట్టములో నా నచట మట్టుతెగి మీఱెన్. 52

గీ. ఎగసి కవియుచు గురుతెగవన్నె సెగలచే
ఖజ్జలాభఁ దనరు కంధరములఁ
గ్రాఁగుజలము లుపరిగతి నేగఁ గ్రీవైపు
శారదాభ్రరుచుల సొరు మీఱె. 53

ఉ. జ్వాలలు మిన్నుముట్ట రభసంబున నిట్టటు గుప్పఁ దాళజం
ఘాలత దూఁక సర్వలయకాలభయంకరలీల నాలుకల్
గ్రాల ధరన్ గ్రసించుగతిగా ననలాస్త్రము ప్రజ్వలించుచో
శూలి మహాంబుదప్రచయచోదకమౌ వరుణాస్త్ర మేసినన్. 54

ఉ. సప్తవలాహకంబు లట సప్తకులాద్రులమాద్రి రౌద్రి సం
శప్తకముద్రి నేచి బహుమానపురస్సరసావలత్తటి
త్ప్రాప్తి వినీలదేహముల నందము లెక్క నధోముఖంబులై
యప్తతిఁ గ్రుమ్మరించె వియదాపగ నేలకు డించుపోలికన్. 55

ఉ. కాలుపెనంబుపైన నుదకంపుఁగణంబులు వ్రాలఁ జిట్పటల్
వ్రేలిచి ధుస్సుభుస్సనుచుఁ బిమ్మట నారెడిరీతి నుజ్జ్వల
జ్జ్వాలలు తజ్జలాహతుల జ్యాస్ఫుటనధ్వనులన్ స్ఫురించి యా
పై లవణాబ్ధిరావములు పర్వఁ గ్రమంబుగ నంతరించుచోన్. 56

మ. తడిగట్టై ల్పొయిఁబెట్ట "జుం"యనెడి నాదం బీనుచు న్నుర్వచా
ళ్ళుడర న్నెన్బొగ లేపులీల నట దీప్తార్చిర్వితానంబులం
బడి ఫేనప్రభఁ "జుంయ్యిచుం"యనురొద ల్వాఱన్ మహాధూమపు
న్దుడుముల్గా దివి కేగుభిన్నధవళాగ్ణోరాద్రిసంపాతముల్. 57

ఉ. పాండురపాటలప్రభల బంధురలీల స్వకేతుధూమము
ల్దండిగ శక్రచాపరుచుల న్వెలయింప విభావసుండు త
ద్భాండనభూమి గంతు లిడుపట్టునఁ బైముసుఁగై దుకూలమొ
క్కండు తదుద్ధతి న్గదలికన్ గెరటాలుగఁ బొల్చునట్లుగన్. 58

చ. వఱదలహోరురున్ ధ్వనులు ప్రౌఢిమ నొందఁగ మాటిమాటికి
న్మెఱయుతటిద్వితానములు నిప్పువెలుంగుపస ల్ప్రవృద్ధులం
దొఱసెడి నట్లుకాఁగఁ బెనుధూమము భ్రాంతిని గొల్పఁ బెచ్చుచి
చ్చుఱియు నజాండ మల్లుకొనున ట్లట మీఱె మహేంద్రజాలముల్.

ఉ. పొంగుసముద్రభూరితరపుష్కలభంగములట్లు వారుణా
స్త్రాంగజలాభిపాతముల నైనప్రవాహము లుర్విఁబాఱ నం
దింగలపుం గళత్కళలు హ్రీగొని ముచ్చముడుంగుచున్ గొనెన్
భంగురభిన్నవారిదలవంబులు సంధ్యలఁ గాంచుపోడుముల్. 60

మ. ఘనతేజస్వియు మూలశక్తులు చనంగాఁ గ్రమ్మఱ నేర్చు ర
క్కొనఁగా లేనివినాశ మొందునటులే కూలంకషప్రౌఢిఁ దా
ట్టినచిచ్చుమ్ము లయాగ్నితుందుడుకు ధాటి న్వాసి శుష్కించి మ
చ్చునకైనం బొడసూపన ట్లడఁగె నచ్చో వారుణాస్త్రార్భటిన్. 61

గీ. పిదప నసితాచలాభలఁ బొదలుమబ్బు
లెల్లఁ గృతకృత్యతన్ వేగ వెళ్ళినంత
పుటముఁ బెట్టినటు ల్మించి పొలిచె నింగి
ఫుల్లనీలోత్పలామలభూరిశోభ. 62

ఉ ఆతతి సర్వసంగరనయజ్ఞుఁడు పార్థుఁ డరిజిఘాంస మొం
దై తగునస్త్రము ల్పఱప నన్నిటిఁ గాలగళుండు సుంతలోఁ
బాఁతఱఁజేసె హేలగ నభశ్చరు లచ్చెరువంది చూడఁగా
నీతివిధేయపౌరుషము నిష్ఠురదైవము నొంచురీతిగన్. 63

మ. రవిచే వేసఁగిఁ జెర్వుల న్నదుల నీరం బింకిపోఁ బృథ్వి మా
నవు లేబావులొ దొర్వులో నెమకి దైన్యం బీఁగుచందంబుగా
శివమాహాత్మ్యముచేత నస్త్రకళ విచ్ఛిన్నత్వముం బొందఁ బాం
డవుఁ డుద్యద్భుజసారలక్ష్మిఁ దన కండం జేసె సన్నద్ధతన్.　　64

---

# పదునేడవ సర్గము



## —* మరల శరయుద్ధము *—

ఉ. "ఆపద నుద్ధరింపఁగ సమర్థత నింతకుఁ బ్రాణమైత్రిఁ బ్రా
పౌ పరమాస్త్రసంతతి లయంబయిపోయెనె యయ్యొ! యెట్లు లేఁ
బాపుదు వీని"నంచు వెఱపొల్పడ 'కీధను విద్ధపౌరుషం
బేపున వెల్గ బోయఁ డోకఁ డెంత" యటంచుఁ గిరీటి పొంగుచున్.

ఉ. లో నుడుకూనియు న్శిఖరి లోహితవర్ణము లేక ధూమముల్
పై నడయాడ గూఢ మగువహ్ని మహాచలమట్లు పోరుచే
నైన సముత్సుకత్వమున నాహవశౌండత యిమ్మడింప లో
నేనికలావు పొంగ మెయి నేయవశత్వము రానిధీరతన్.　　2

మ. పరదుర్భేద్యనిజప్రతాపగతవిశ్వాసంబె మిత్రంబుగా
నరిశస్త్రాగతసంకటస్థితుల ధైర్యస్థైర్యశీలాదుల
న్బరమోత్కృష్టభుజాబలంబె తనకు న్బ్రాపించు గంభీరసు
స్థిరుఁడై సంగరరంగశోభనకళ ల్దీపింపఁ బార్థుం డటన్.　　3

మ. "అభిమానాంచిత, సత్కులక్రమగతివ్యాపార, శుభ్రైందవ
ప్రభ, ప్రాణాధిక, కీర్తికాంత, యొకచెంప న్నేనె వీక్షించుచుం
డ భటుం డేనియుఁగానిభిల్లున కరణ్యావ్యక్తికి న్వైరి కా
ర్తిభవిష్యం బటు సంగ్రహీత యగు టెందేఁ గల్గఁగాఁబోలునే".　　4

మ. అని చింతించుచుఁ దన్నుశాత్రవుని గృత్యంబు న్వితర్కించు న
ర్జునుఁ, డదీశ్వరు బద్ధమూలుని విశత్రు న్బ్రోధి నున్మాలితు

న్బ్రచరింప న్ద్రిపథాగతిం దొడరుచో మఱి హేలగా నీశుఁ డా
పిన నష్టోద్ధత గంగరీతి, సమరోర్వి న్నిల్చె భగ్నాస్త్రుఁడై. 5

మ. ఘనసంస్కారత సంప్రయోగగురుశిక్షాసద్గుణాలంకృతుల్
దనరన్ నిత్యయథార్థదీప్తిఁ గొనుశబ్దప్రౌఢబాణాళిప్రా
పున భావార్థజయంబుఁ గైకొనెడితెంపున్ జేవచే శాబ్దికా
ర్జునుఁ డాయార్యసభాసమిద్ధర స్వయంజ్యోతిప్రభన్ రాజిలెన్. 6

మ. సమరౌత్సుక్యము క్రమ్మఱ న్నిగుడ నుత్సాహంబున "న్నూర్వయు
ద్ధ మిసీ! నాకొకశక్తిసాదకరమా? దర్పింతుఁగా" కంచుఁ గో
పము కన్గొల్కులఁ గూసము న్విడినసర్పంబట్లు లౌచు న్విషం
బుమియన్ జృంభితగాత్రుఁడై నిలిచె నాయూర్ధ్వాంసకృత్తివ్రతన్. 7

గీ. పోరుదూఁకుల సిగ వీడి పొంగి నెగుర
నలుకవిప్పిన జ్యోతులై యత్తు లెగయ
రోసపుంగాఁకవడు నరుగాసి మాన్పఁ
జెమటచిత్తడి నీరార్చుక్రమము గాఁగ. 8

చ. జలదసమావృతుం డయినచండకరుండు ప్రచండవృష్టిచి
హ్నాలు దివి నూర్ధ్వరేఖలుగ నాత్మకరంబులఁ జూపుపోల్కి నా
కలనునఁ బెన్జలంపుఁబొగఁ గప్పినబొమ్మముడి న్గిరీటితూ
పులజడి నించుసూచనలు పూనె దళత్త్రివళి న్ముఖంబునన్. 9

మ. గిరిశృంగంబును మత్తదిగ్గజముఁ బోల్కి న్వారిదధ్వానముల్
పరఁగన్ మాటికి నారి హస్తమున విస్ఫారించుచు న్ఫల్గునుం
డరిసేనం గలఁగించెఁ గాముకునిచిత్తాందోళనంబుం బొరిం
బొరిఁ బూవుల్కులపెన్దర ల్పఱపి కాముం డేఁచుచందంబునన్.

గీ. కోపకలుషితుదరిని హితోపదేశ
మధికనిస్సంగుదెస విషయాభిలాష
మాపరాత్మునివార్త వాక్యప్రపంచ
మట్లు జవమూలె హరుమ్రోల నాశరాళి, 11

శా. హేమంతంబున మంచురాగవిసెనల్ హెచ్చం గడు న్ప్రౌఢిమన్
వ్యోమం బంటెడుకొండలోఁ జటియలన్ బూమత్త్విషామాలికా

స్తోమంబుల్ దరియంగ లేనిగతి నస్త్రాస్త్రవిద్యాబలో
ద్దామున్ శంకరుఁ జేరనైనఁ జన వుద్యత్పార్థబాణౌఘముల్. 12

ఉ. దిగ్గజ మైనదంతములు దీర్ఘబలాఢ్యము లైనఁ గ్రీడచే
నగ్గిరిరాజవప్రముల కాపదఁగూర్చునె హాయిగా కటుల్
మొగ్గఁగఁ బార్థఘోరశరముల్ గిలిగింతలమాద్రి సోఁకఁగా
నగ్గణభర్త కార్తిబదులయ్యె సుఖానుభవంబె మేలుగన్. 13

ఉ. కారణకారణాంబు కెఱకింపఁడు వత్సలతన్ సహించె భూ
భారము సైఁపఁగాఁ దగినప్రాక్షపరాక్రమయుక్తశూరబా
హాకుకళావితీర్ణి భయదోగ్రరుపాకశినార్జునాంబకా
సారపరంపరార్భటి నెసంగుపరాభవ మానసమిద్ధరన్. 14

మ. అరిచే మున్దనశక్తిఁ గోల్పడియు ధైర్యంబూని యుత్సాహియై
పరు మించ న్దనలావుమీఱుపసఁ గోల్పన్ నేఁగి సాధించుతెం
పరికి న్వీర్యసముజ్జ్వలోరుయశము ల్ప్రాప్తించు టేమింత ? భా
స్కరుభానుప్రభలట్లు తత్ప్రభలు లోకశ్రీల వెల్గింపవే? 15

గీ. గడుసుటుద్ధతిఁ గని భీతిపడువిరోధి
బెదరుచేఁ దత్ప్రతాపంబు బింక మీఁగు
తేజ మఱిన నుత్సాహంబు తీఱి విడచు
నాఱుదీపంబును బ్రకాశమట్లు గాఁగ. 16

ఉ. తేజు నశింపఁగా మదము తెంపునవే గెలువంగ సిద్ధమై
యాజికి దూఁకుమత్తగజ మున్యవిభీతమతంగపాళిన
ట్లాజయశీలి పార్థుఁడు గతాస్త్రసహాయుఁడయైన శస్త్రవి
భ్రాజితశక్తిభీతపరభంజన కెద్ది జయించు టబ్రమే ! 17

ఉ. బాలసుధాకరప్రభలవైఖరి సేనలలోన హానికిన్
లీలగ శంకరుండు విరళించె జయాపజయంబు, లాజి న
స్త్రాళి హరించి, శస్త్రవిపులాహవకేళి నుపేక్షసైఁచి, త
న్మూలమునం గిరీటియశము న్దెసల న్విరివిం గళ ల్గొనన్. 18

ఉ. పుట్టుకతో లభించుగుణము ల్ధర జీవగణంబు మాన్పఁకో
నెట్టు లశక్తమో యటులె యేడ్తెఱఁ జిత్రితరాంబకాళి న

ప్పట్టున సవ్యసాచి పనుపన్ దళమై వడి ముంప నాజడి
న్నెట్టుకొనంగ సేనలను నేతల శక్తుఁడు గాఁ డొకండునున్. 19

చ. మొయిళులు ఫెళ్ఫెళార్భటుల మ్రోఁగి నిశన్ జలధార లీన గో
చయములు విహ్వలించువరుసన్ గణకోటు లదాఁటు దాటులన్
స్మయమును జీఁకటిం గొలిపి సందడి నెం డెడమీఁ నిబాణవృ
ష్టి యడర నీరునీరయి వటించిరి పీనిడి యస్వతంత్రులై. 20

మ. కనుదోసంబున నొక్కఁడై శశి యనేకత్వంబునం దోఁచురీ
తి నట న్నెరుపుపెంపుమై నరుఁడు సాంద్రీభూతనారాచవృ
ష్టిని గల్పించి కడు న్వడంకుఁగొను నాసేనాసమూహంబు దృ
ష్టి ననేకార్జును లయ్యె సంధిఁ గలలట్లే చిత్రచిత్రంబుగన్. 21

చ. వికలమనస్కులై బెదరుబెంగలదూలుగణాధిపాళు లు
గ్రకదనభూమి నగ్రమును గాంచఁగ నోడి శుభాశ్రయాసవ
న్కకుఁ గన శూలి పెక్కులలఁ గంపితమైనతటాకమందు భా
నుకళలరీతి నూఁగుచుఁ గనుంగొననయ్యె రుపావికారతన్. 22

ఉ. తాను బరాత్పరుండు నరుఁ దద్దయుఁ బ్రేముడిఁ జూచుఁ గోప మె
ట్లూనుఁ బినాకి? యైన నదె యుజ్జ్వలరక్తిమ నిప్పుపోల్కిఁగ
న్గోనల రేఁగె నోష్ఠములఁ గూరె వడంకు, గగుర్ఘటిల్లె ; సు
జ్ఞానులవృత్తి పైవిలసనంబులచే నెఱుఁగంగ శక్యమే? 23

మ. చలము న్గగురు మేనఁబొంగఁ ద్వర హెచ్చంగాఁ బినాకాంతకో
జ్జ్వలనారిస్ఫురణంబున న్గుణము ద్వంద్వంబై మహాక్రోధవి
హ్వలనాగాధిపజిహ్వల ట్లడర నాహాలాహలగ్రీవుఁ డి
ట్టలపుంబూన్కి నుపక్రమించెఁ బరుఁ జెండ న్వాండి శస్త్రార్భటిన్.

ఉ. ఝూంకృతిఁ దొండమున్ జెవులచాయల కూచుమదేభదుష్టతన్
డాంకృతి మ్రోఁగువిల్పెనుకడంకల నిట్టటు వాఱఁ ద్రిప్ప చే
ణాంకుఁడు నేర్పుపెంపున మహాహవచండిమ రేఁగఁ బార్థుఁ డి
ట్రింకుల నాల్క యొండ నిది యేటిబెడంద యటంచుఁ దొట్రిలెన్.

ఉ. పొర్లఁగఁ ద్రోసికొంచుఁ బయిపొంగుల వార్ధిఁ బ్రతిక్రియోద్ధతిన్
దొర్లుచుఁ బైకొనం గలఁగి తొట్రిన డీల్పడి లోఁగిమళ్ళవే

యే ల్లెటువంటివైన నటు లేపుల నాపురవైరిబాణపుం
బా ర్లడరం గిరీటిశరవాహిని దుర్గతిడించె నింతలోఁ. 26

ఆ. కదుపుచించుటయును గతిమాపి వేయుట
గాసిఁ గూల్చుటయును గాఁగఁ బోర
శంభునాయకుండు శాత్రవనరశరా
ఘముబలంబుఁ గూల్చె నమితశక్తి. 27

ఉ. సోముని గొప్పములుక్కలకు సూటిపడ స్థిరమై చలించెఁగా
కాముని తూపులే ననదులా! ఖరము ల్వరమోత్తమంబు లు
ద్దామము ల స్తకోపభరత న్గతిదప్పియుఁ దున్గియు న్వడిం
భూమికి వ్రాలుచోఁ బాడిచెఁబో కృతకృత్యత వైరిసేనలం. 28

గీ. ఋజుగుణాలంకృతములు పరిమ్మసద్గు
రూపదిష్టలసద్గతిపాత్రితములు
నైనసన్మార్గణము లపర్యాప్తిభంగ
మొందఁగాఁ బెల్లగిలె జిష్ణునుల్ల మెల్ల. 29

ఉ. గండునఁ బాండవాంబకవిఖండనము న్విఫలీకృతిం జపో
ద్దండతఁ గూర్చి శైవశరతండ మఖండఫలంబుఁ గాంచె నా
ఖండనభూమి; మిక్కుటపుఁ బాటుపడప్పుడె చేయువాని కీ
కుండునె యెందుఁ దత్కృతిగణోచితభవ్యఫలప్రదానముం. 30

మ. పరమాశ్చర్యకరోరువేగగతు లొప్ప న్ఘోరపాతంబులై
పరసైన్యాళుల కారణంబు లగు పెన్భల్లంబుల న్బార్థుఁడు
ద్ధురశత్రుప్రదరోగ్రతం నిలిపి శత్రుల్దూలఁగా నేసెఁ బే
రురములాడిచనంగ వెం జఱచి కుయ్యో! యంచు వా రార్వఁగన్.

శా. అన్యోన్యాతిశయప్రకర్షల హరుం డయ్యర్జునుండు న్మహా
మన్యూద్దీపితవృత్తి గ్రీష్మజలదాంభఃపూరము ల్గాఁగ నా
జన్యంబం దురుకాండసంకులమహాసారంబు సాగింప నా
ధన్యుత్కర్షకుఁ దీవ్రఘాతముల కంతం బంత మయ్యెం గడుం.

క. హితురుచిరాలాపంబుల
గతిఁ బ్రియకరుఁ డైనశివుఁడు కతిపయశరముల్

ప్రతికక్షి మర్మముల కు
ద్ధతి నేయఁగ వాని కవి ముదంబు నె కూర్చెన్. 33

గీ. సరిదనరి యొక్కచో మించఁజాలువిజయు
నస్త్రశస్త్రకళ ననియుపగతాభ
నడలునిజసైన్యముం గాంచి యాత్మమహిమఁ
దోడుఁగొన నెంచె శివుఁడు మృత్యుంజయుండు. 34

గీ. వరతపోవీర్యమునను సాగరమహాబ్ధి
దాఁటఁ బోరాఁడుజిష్ణుశస్త్రముల నొకటి
యైన లేకుండ శంకరుం డపహరించె
రవి జలంబుల నింకించురాణ నచట. 35

గీ. మును పె వట్టినకొండకల్గునను దృష్ణఁ
దీర్చుకొనఁ దొండ మిడుదంతితీరుగాఁగ
సరభసంబున నర్జునుకరము తూణ
మునఁ బ్రవేశించె నొప్పటిపోల్కి నంత. 36

ఉ. అప్పుడ నిష్ఫలప్రణయుఁడై మునుపొందినమేళ్ళజ్ఞప్తి నా
యొప్పమి నమ్మలేక మఱియుం దనకోరికఁ దెల్పి వ్యర్థుఁడౌ
చొప్పునఁ దూణమున్బెలుచఁ జొచ్చి శరంబులు లేమిఁ దొల్గ కం
దెప్పటియట్ల దూఱి చలియించెఁ గిరీటికరంబు రిక్తతన్. 37

క. జయమున కగుపరమనయ
ప్రయోగములమేటి నరయు క్రమశీలివరెన్
రయమున నరునగాంగుళి
నియతి గతాగతిని దొనల నెమకెఁ బలుమఱున్. 38

గీ. ప్రళయకాలంబున న్సమ్ముజలములైన
పూర్వపశ్చిమవార్ధులఁ బోలునట్లు
సాయకము లగుశరధులచాయఁ జూడ
నిలువునీఱయి నరుఁ డట్టె నిలిచిపోయె. 39

చ. కవదొనలార! యక్షయముగా శరసంఘము నిండియుండు ను
త్సవ మిటఁ దీఱిపోయెనె? వృథాగద మీ కికఁ నాదుప్రాపటం

చు వనరేఁగాని దుశ్శకునశోకము నొందఁడు క్రీడి ; తోడుపో
నవిసెడువానికట్లు తమయూథప కేడ్వరుగాదె సజ్జనుల్. 40

చ. నెనరు గలట్టిసాత్త్వికమనీషి సహాయు మొనర్పరామి మి
త్రుని విడలేక వీడుగతి దొడ్డశరంబులు చన్న బావురం
చును గనుపించుతూణములఁ జూచి ప్రతిక్రియ చేతఁగామి న
ర్జునుకరమం దవాఙ్ముఖత సొక్కుచు వానిని బాసె మెల్లఁగన్. 41

ఉ. పాయుచు నాఁగి యంబుపొదిపజ్జన యుండుటె శ్రేయమంచు న
ట్లాయెడ నిల్చిపోయె నరుహస్తము, నైజముకాదె? యెందుఁ దాఁ
జేయఁగ నిర్గయం బయిననేఁత యసత్ఫలకంబుగాఁ జెడన్
నాయకుమోలి కేగుట ఘనంబని యేభటుఁడైన నెంచునే? 42

ఉ. తర్కమున న్నిరుత్తరతఁ దాల్చినవాదిని వక్త్రదోషసం
పర్కము లెత్తి దెప్పగరిమ న్నిగృహీతశరు న్నరు నృడిన్
గర్కశలోహసాయకముఖంబుల మర్మములందు నించి సో
మార్కకృశానునేత్రుఁడు మహావ్యథఁ గూరిచెఁ దద్రిణస్థలిన్. 43

చ. సవితను గప్పి శంపల నెసంగెడివారిదఖండ మగ్రివా
యువిలసనంబునం దొలఁగ నొప్పగ భాసిలు సూర్యపోలికన్
బ్రవిమలరత్నదీధితుల రాజిలు మేలిమిగీట్లకంకటం
బు వెస మహేశుమాయ విడిపోయె నరుం దనుకాంతు లుబ్బఁగన్.

చ. ఒటువిడువాఁడి కత్తి పొరయూడినతాఁచు ప్రతిద్విపంబుపైఁ
గొఱకొఱఁ దాఁక మోముటవగుంతన మీఁగినహస్తి వారిదం
బుఱుము గుహాన్తర్జించి బయ లొందినసింగము ధూమసంతతుల్
కొఱవడు రేయిఁజిచ్చుతళుకు ల్నరుఁ డొందెఁ దనుత్రి మేగిరన్.

ఉ. మైమఱు వ్రాడిపోఁ బనికిమాలినవాట నవాఙ్ముఖంబులై [45;46
భూమిఁ బడెన్దొన ల్వ్యసనమూర్ఛితుఁడౌ తమస్వామిఁ దేర్పఁ దా
మేమియుఁ జేయలేమి మొగమెత్తఁగఁజెల్లని చేతనంబుల
ట్లామెఱఁ దా మచేతనములయ్యును దత్సమయోచితంబుగన్. 47

చ. విమలతపోబలాగతము విస్తృతతేజము దీప్తినింప, స
త్త్వమయత నిర్మలాంబరపథంబున నష్టతనుత్రుఁడయ్యె యూ

ద్ధమహీని నిల్చుక్రీడిమెయిఁ ద్వష్ట దినేంద్రునియందురీతి శ
స్త్రముల లిఖించె సందుచెడి జారఁగనీక శివుండు చిత్రముల్. 48

గీ. అస్త్రశస్త్రంబు లుడిపి వజ్రాంగి దులుపఁ
బెరుఁగురుప లంగవేదన న్మఱవఁ జేయ
దగులుహారుతూపు లోకవర్మముగ ఘటిల్లెఁ
గ్రోధకంచుకులకు బాణబాధ కలదె. 49

శా. గోపుచ్ఛాకృతి దీర్ఘవర్తులత బాగు ల్దేఱుకై జంట ముం
దై పొల్పొనఁగ నల్ల కాల్వలయి దేహంబందుఁ గాఱంగ మెం
డై పాదాహతి భూమి దద్దఱిల, సింహధ్వానవిస్ఫూర్తి మి
న్నే పెట్లన్, రణశూరలక్ష్మి వెలయ న్వేగోద్ధతిన్ దాఁటుచున్. 50

ఉ. గండరగండఁ డర్జునుఁ డఖండరయంబున వైరిఁ జేరి యా
ఖండలవజ్రతుల్య మరిఖండనచండిమ మబ్జఖండస
త్పాండురవక్రిమా బహుళఖండనమండితగాండివంబునన్
దండిగ మోఁదె స్తంభము నుదగ్రవిషాణమున న్గజం బటుల్. 51

చ. విడఁబడి పెక్కుపాయలయి వేపడునాత్రిపథాస్రవంతి తుం
దుడుకులు దివ్యతేజుఁడయి తోఁచిన జహ్నునియందు డిందిన
ట్లడరులవింటిబద్ద బహుళారభటు ల్వెలయంగఁ బైఁబయిం
బడ నగువ్రేల్ల భర్గుమెయిఁ బాఱి నశించె నొకేముఖంబుగన్. 52

శా. విల్లుం బోయిన శౌర్యసాధకరణోర్వి న్నిష్కసత్కారమ
ట్లొల్లంబోయెడి శోచనీయు నరు దా నుగ్రుండు దూరోత్పత
ద్భల్లంబు ల్వరఁగించి దవ్వచన నుద్ఘాటించె హేలాగతిం
‘జెల్లంబో! యితఁడేటిభిల్లుఁడని కౌంతేయుండు డిల్లంబడన్. 53

ఉ. ఆరణభూమి దివ్యతమమైతగునాశ్రమ, మందు వెన్ను నీఁ
గోరమి వీరసద్వ్రత, మకుంఠితశైవశిలీముఖవ్యథల్
ఘోరజపోపవాసములు, కోర్కులపంట లభించువేళ చే
కూరఁగ నున్నయట్ల యతికుంజరుఁ డంతఁ దపించె బిట్టుగన్. 54

చ. ‘ములుకులుఁబోయెఁ బైకవచముం జెడె, విల్లు నశించెఁ బోరఁగాఁ
గలఫలసిద్ధి వేఱుపదకంబులఁ గానిదిసుమ్ము, సత్ప్రతా

పలసితము న్శుభాస్పదము భవ్యము నుత్తమ మీంఖరాసి' యం
చులకన దూసెఁ గ్రిడి తనువొందిన రాద్రిముఁ దీవ్రిఖడ్గముల్.

ఉ. భానుయుతోర్మిమాలికల వార్ధి తెఱంగునఁ గాండకృంతనా
ధీనకృపాణపాణి యయి ధీరుఁడు పార్థుఁడు ఖడ్గసంగర
జ్ఞానవిశేషము న్వెలయుచుం కరిమణంబులఁ దళ్కు లెక్కఁగాఁ
బూని లిఖించె రోదసి నపూర్వవిచిత్రరుచిప్రిపంచముల్. 56

శా. భానుం డొక్కఁడె మింటనుండుటయిన న్వాపీతటాకాంబుసం
తానంబందు విశేషసంఖ్యలఁ గనంగాఁ దోఁచుచందంబునన్
మానీంద్రుండొకఁడయ్యు బాణములఁద్రింపన్ వేగ మిందందు నెం
దే నుగ్రోద్ధతిఁ దోఁచి పెక్కురనుభ్రాంతిం గొల్పె భూతాళికిన్.

ఆ. హరునిగొప్పశరము భరముగఁ దగులంగఁ
జేతిపట్టుపిడి చెదరిపడియె
నరుని మెఱుఁగుకత్తి పరమాద్భుతంబుగఁ
బిడుగు మొయిలునుండి పడువిధమున. 58

గీ. విల్లుతోడు పంబులును మాయ కొల్లఁబడినఁ
గత్తి చెడఁ గేవలశరీరగౌరవమున
నిలిచె నరుఁ డాజిఁ దరులతానివహమెల్లఁ
బోవఁ దెఱపగునుద్యానభూమిరీతి. 59

ఉ. ఇట్టు లరాతిచేత సహియింపఁగఁజాలనిభంగ మొంది య
ప్పట్టున బాహుమాత్రిబలవంతుఁడె యయ్యుఁ గిరీటి గెల్పునం
దిట్టలమైనకోర్కి వెలయించెను బెన్వడకండ్లవానలై
తొట్టఁగ గట్టిరాజడుల దొడ్డతరు ల్వడి భగ్నమొందఁగన్. 60

ఉ. ఘోరపృషత్కకోటులను గొల్పి ధనంజయసాంద్రశైలవా
రారభటిన్ దృటిన్ శశికళాంకుఁ డడంచిన నింద్రిసూనుఁ డ
చ్చో రచియించె నింగియును సూరెలు మూఁతపడంగ నిండుభూ
మీరుహజాలవర్షము తమిన్రిము లెల్లెడ నాక్రమింపఁగన్. 61

ఉ. పఱపినతూపుటల్లుగమి పల్లవపత్త్రిసుమాళి నుగ్గుగాఁ
జఱిమి నగంబులం జెఱుపఁ జిందినతచ్ఛకలంబు లెల్లెడన్

దటు చగుజల్లుగాఁ గుటియుఁ దద్రణరంగసురాదుల న్మదం
బుటవ్రగ శంకరుండు బలు లుచునటుల్ గనిపించె నచ్చటన్. 62

గీ. గంగలోన మొసలికై వడిఁ బర్జన్యుఁ
డాశుగప్రవాహమందు వేగ
విషమనయమునుఁ జేరి పృథుహేమశిలఁబోలు
ముష్టిఁ బొడిచె నురము మొక్కలమున. 63

మ. ఒకఁడే పుత్త్రికుఁ డీడుమించుతమిచే నుద్రేకియైన స్మరిం
పక ప్రేమన్ గరుణించుతండ్రివలె దుర్వార్యారిదుస్సాధ్యకీ
ర్తికరంబౌ వెనులక్ష్మిఁ గోరి దరి కార్తిన్ జేరియున్ ధార్త్ర్యమీఁ
గక కౌంతేయుఁ డనీతిఁ జూప సయిచెం గామారి ప్రేమార్భటిన్.

---

# పదునెనిమిదవ సర్గము

## ముష్టియుద్ధము

చ. మహితమదోద్ధతద్విరదమానసమానగతి న్నరుండు దు
స్సహభుజయుగ్మకాయుధలసద్బలుఁడై యట ముష్టియుద్ధస
న్నహనముతోడ డాయ హరిణధ్వజుఁడు న్గైనలు న్విలుం ద్యజిం
చి హతిని నొంచె ముద్గరవిశేషపటుత్వకఠోరముష్టిచేన్. 1

చ. మృడుఁడు నరుండు నేడ్తెఱ సమిద్ధర ముష్టిసమీకరోషులై
పిడికిటిపోటుల న్నిగుడ భీకరసాంద్రరవంబు లద్రినే
ర్పడుస్ఫుటదశ్మసంతతులపట్పటరావముల ట్లనల్పతం
దొడరి గిరీడ్దరీరచితదోహదవృద్ధి జగంబు నిండెడిన్. 2

మ. అహహా! శస్త్రకృతవ్రణంబులు మహేశాభీలబాహుప్రచం
డహతిన్ రేఁగ సుఖానుభూతివలె మండ్రాటంబులే కాహవ
స్పృహ నేఁచు న్నరుఁ డెం దసాధ్యముగదా! వీరాధివీరు ల్మహా
మహులౌ వారల నెవ్వరే ననుకరింపం బోల నుంకింపఁగన్. 3

ఉ. అద్రిసమానవక్షమున నైనవ్రణంబులనల్లయూఁగ క్షతిన్
రాద్రముచేతఁ జిందుచు నుర మ్మఖిలమ్మునఁ గ్రమ్మ నూత్నసం
ధ్యాద్రవసిక్త మైనజలదంబుకళన్ రణభూమి నొప్పెనా
రుమ్రఁడుఁ గూడ; నాహవనిరూఢి నరుండు నసాధ్యుఁ డేసుమీ !　　4

ఉ. సహ్యగిరీద్రతటంబుఁ బెలుచ న్జలధిశ్వసనావళుల్మహా
ర్మహ్యముగాఁగ సోఁకుగతి మొక్కలపు న్బిడికింటిపోట్ల దు
స్సహ్యముగా మహేశ్వరవిశాలశిలాసమవక్షమెల్ల దం
దహ్యముగాఁగఁ గ్రమ్మెఁ బెనుదాడడిసందడిఁ గ్రీడితెంపునన్.　　5

ఆ. ఉక్కుగుదియఁబోనియుగ్రంపుఁ బెనుముష్టి
హరుఁడు కంఠమందు నరునిఁ గొట్టఁ
గనులు దిరిగినటులు వెనుకకు మూఁడునా
ల్గంగ లిడుచుఁ దూలె నర్జునుండు.　　6

చ. కలిగినయీపరాభవము గ్రించురుష న్వెలయింప దేహము
జ్జ్వలబలయుక్తమై నిగుడ ఫల్గునుఁ డాజి సరాలున న్హాలా
హలగళుఁ జేరఁగా దుమికి హస్తయుగంబునఁ దద్భుజద్వయం
బలుక గ్రహించి ఘోరతరమైనప్రతిక్రియఁ జేయఁజూచినన్.　　7

ఉ. చేతులుకూడ వ్రేళ్ళు మెలిచిక్కఁగ నెట్టుచు గుంజుచు న్శిరో
ఘాతముమీఱ డీకొనుచుఁ గాళులయిర్వురివ్రేలి క్రిందుమీఁ
దై తగరుల్ ఫణుల్ గిరులు నబ్ధులుగా నరభిల్లనాథులం
దాతతరీతి వర్తిలె హిమాచలచాలనమల్లనైపుణుల్.　　8

చ. నిలువునఁ బోరువేళ గణనేత యితం డితఁ డర్జునుండునాఁ
గలుగదు భూమి వ్రాలి కడఁక న్బనఁగ న్బడుచుండ మీఁదుక్రిం
దుల నితఁ డీతఁడం చనఁగఁ దోఁపదు సంగరసంగరింగణా
దులగమనత్వరల్ బహుగతుల్గొనఁ బ్రేక్షకులౌ గణాళికిన్.　　9

ఉ. ఓరువ 'కేనశించెదనొకో' యనుభీతి హిమాద్రి పోరున
న్వారు శమింప నాఁగుఁ దెగువం జలియింపఁ జలించు నున్నతి
స్మిఱిన మీఱు నమ్రత గమించిన నమ్రత లొంగు బిట్టహం
కారవికారడోలితమనంబున రాగరసంబుపోలికన్.　　10

చ. కరచరణాళి లంకె విడఁగాఁ బిడుగుల్వడుగాసిగా భయం
కరభుజరావము ల్నెఱపి కమ్రతరోత్ప్లవమానసిష్ఠుర
త్వరితగతి న్నకేశులు మదంబులఁ బోర వడంకున న్గిరీ
ద్ధర సుధ నాఁగదోఁచెఁ బరితఃప్రసరత్సరిదంబువర్షముల్. 11

మ. ఇతఁడే భర్గుఁ డటంచు నర్జునున కింతే న్వార్త లేకున్న ను
ద్ధతిఁబోరన్ ద్రిపురాంతకుండు వపుప్రం దర్పంబున న్దాఁటు నా
యతభక్తాత్మున కట్లుగా దొరికెఁ బాదాబ్జాతము ల్వేఁడు న
న్వ్రత నట్లాతఁడు వానిపట్టువిడ కెంతే గట్టిగాఁ బట్టెన్. 12

మ. అవురా! భక్తుఁడటన్న నింకొకఁడె వీఁడేఁగాక యన్ ప్రేమ న
ట్లు వనాటాకృతి నున్నశంకరుఁడు గండుంగాఁగిటం దాపసున్
మివులన్ నొక్కుచు నక్కుఁ జేర్చికొని విస్మేరన్ముఖాబ్జాతుఁడై
యువిరెన్ బో నరుసర్వకర్మము తదీయోష్మంబులు న్బండెఁబో.

ఉ. కన్నులు మూసి మైమఱచి గద్గదికన్భగవంతుఁ డాదరా
భ్యున్నతి నద్దిరో యనెడి నుండుఁ 'డహో! తప మంతకన్న మే
ల్వన్నెప్రతాప' మంచు వినవచ్చెడి నిశ్చయమేకదా తమిన్
సన్నిధిసేయుసేవలకు సత్వము సాయ మొసంగు టబ్రమే. 1

ఉ. పిమ్మట బిమ్మిటిన్ గొనినవీరుఁడు క్రీడి యొకింత తేఱి కం
దమ్ముల విప్ప రోఁతనెయి తావున భూతిసమేత మైనయం
దమ్మగు మేను గేకిఫురితట్టు కళాక్త జటాభరమ్ముఁ జి
త్రమ్ముగఁదోఁప సంభ్రమముదంబుల భక్తి నమస్కరించుచున్. 15

మ. కలయో! మాయయొ! బోయ యేఁడి? రుధిరగ్రస్తాంగమున్వర్ష్మమె
ట్టులఁ బ్రాపించె? దొనల్! ధనుస్సు! సెల! లుండున్మైనవియ్యెడన్
బలుకు ల్దాఁటెడియబ్బురంబు కిటి సంవాదంబు, యుద్ధంబు మి
థ్యలొకో? యీగణకోటు లెవ్వరనుచు న్దర్కించుఁ బార్థుం డెదన్

క. మెల్లనఁ జల్లనితుంపర
జల్లిడె జలదములు విరులఁ జల్లిరి సుర లే
పుల్లలు మీటకె భేరులు
కొల్లగ దివి నెల్లయెడల గోలగోల మ్రోఁగెన్.

—* సాంబమూర్తి ప్రత్యక్షమగుట *—

క. హరసాక్షాత్కారము సం
బరమిడ దిక్పాలసురసమాజము కొలువ
న్సురపతిమణిరథముల దివిఁ
బరఁగ నుడుగణములవలె నభమునం దోఁచెన్. 18

ఉ. దేవవిమానధారణవిధిం బఱతెంచు మహామరాళముల్
గ్రీవనదత్కళాకలితకింకిణుల న్విపులప్రియత్నసా
రావితపక్షవిస్తృతుల నంబరముం దమిఁ గౌఁగిలించు న
ట్లై విలసిల్లె సవ్యవలయభ్రమణంబుల లక్ష్మిఁ గొల్చుచున్. 19

మ. ముదితేందిందిరబృందము ల్చదల సొంపు న్మ్రోల్వితానంబులై
పొదలం గల్పకనూత్నపుల్లకుసుమంబు ల్మాలలై మెర్పుసం
పదలీన న్దివిజాపగాజలకణవ్రాతంబు వర్షాంబువై
పిదుల న్మబ్బనగాలి సౌఖ్య మిడి సేవించె న్వృషాధిష్ఠితున్.

మ. ప్రియభేశు ల్గురొందుమేనులఁ "బు రే! బా" గంచు శ్లాఘింపను
ద్యమ మమ్మైత్రసఫలత్వమొందఁగఁ, నరుఁ డానందసందోహ సం
భ్రమ మంగంబునకుం గళల్ దొడుగ, శంసాగీతికా వాక్సుధా
గ్రిమహస్తాంజలి శైవదక్షిణపదశ్రీనొంద నానమ్రుఁడై. 21

ఉ. ఓయపరాజితా! భవ! కృపోదధి! కేవలభక్తిగమ్య! లో
కాయతనా! సమస్తవిపదంతక! రక్షక! నీదు ప్రావు మా
కేమెడ మృత్యువు న్గెడపి యెట్టిమహాపదనైన మాకు మే
మే మెడప న్సమర్థతఁ గ్రమింప నొనర్చుట లోకవింతయే. 22

శా. తండ్రీ! నిన్ను స్మరింపకే కొలువకే ధ్యానింపకే మ్రొక్కకే
మండ్రాటంబులు నాపదల్ వ్యధలు సంసారంబులు న్మాయునే?
కండ్రే కోర్కులు సంపద ల్శుభములున్ గైవల్యముం బెక్కులౌ
గండ్రల్ గచ్చులకేమి మానవులనే కా దాదితేయాదులున్. 23

ఉ. ఈవుల నిన్దలంచుకొని యిత్తురు దాతలు జన్మదుఃఖవి
ప్లావితులౌట ముక్తికి సపర్యలొనర్తురు నీకుఁ జిత్రము
న్నే? వరదాతవై ప్రణతి నీదరిఁ జేరినవారిపైఁ గృపా
శ్రీ విరళింతు పూరకయ చిత్రతరం బిదిగాని శంకరా!. 24

శా. దద్వైగన్ జనిలేక, మాభవసముద్రం బెల్ల దాఁటించి మా
నొవ్వ ల్దీరిచి మోక్షనిత్యపథమందు న్నమ్ము న్నిల్పంగ నెం
దెవ్వేళ న్సకలార్థదక్షమత నున్నే తీర్థ సోమాస్వామి! నీ
నవ్వు ల్చిల్కు కృపారసార్ద్రనయనానందాపగ ల్దక్కఁగన్. 25

శా. నీయందే మరులొందుభక్తతతికి న్నిశ్శ్రేయసం బబ్బు, నిన్
దాయంగాఁ గనుదుర్వినీతులకు సంతాపంబులే కల్గుఁగా
దే! యీద్వంద్వము వారివారికృతిసందీప్తంబుగాఁ జెల్ల నీ
వాయీజోలియు లేక సాక్షివయి నిత్యానందము ల్గాంచవే 26

ఉ. నీకరుణాస్వరూపమును నిర్వచనం బొనరింప దేవతా
శ్రేణికి యసాధ్యమన్న విపరీతముగాదొకొ మాప్రియోక్తి, మ
య్యా! కడుదుర్గభాగ్యమున కబ్బులు సాఁప, మనన్యభక్తిచే
మాకపవర్గమే పెరటిచుం బగుచుండఁగ నన్య మేటికిన్. 27

చ. ఎఱుకలముఖ్యముం దెలిసి యేకృతి మంచిదొ దానిఁజేసి యే
కొఱఁతయు లేనిబాట నెసఁగు న్నిరపాయతమై వివేకి, మా
కెఱుకలలోన ని న్నెఱుఁగుటే పరమం బఖిలక్రియాళులం
దఱచగుభక్తి నీకొలువె దండికి దండి గదయ్య! శంకరా!. 28

శా. వ్యాసాదుల్ దమయోగశక్తిఁ బ్రజకత్యంతోపయుక్తంబులౌ
వ్యాసంబు ల్పరమోపదేశములు గ్రంథాళి న్బ్రసాదించి రా
వ్యాసంగంబె సమస్తబాధముల నిర్వాపింపఁగా శక్తమే
నీసేవాగతియట్లు లాత్తునకుఁ? దండ్రీ! దివ్యధామా! శివా!. 29,

మ. పెనుమాయా న్బడి చచ్చి పుట్టుప్రజ ప్రాపించు న్స్వరూపాళిఁ బ్రా
క్తనకర్మానుగుణంబుగాఁగఁ బరమాత్మా! యనన్యదుర్వార్యత
ద్ఘనపాపార్జిత రౌరవాదిభయ ముద్ఘాటింపనేకాదె కై
కొని దీయద్భుతరూప మోగురుకృపాకూపార! మాయాహరా!30

ఉ. రాగము లేనియోగివఁట, ఆతఁట దారువనంబునందు, ను
ద్యోగము భైక్ష్యమంట, విడనోపవఁ టర్ధశరీర నాలి న
భ్యాగతు మారు మాడ్చితఁట, పద్మజవంద్యుఁడవయ్యు సంధ్యలం
దాగురుఁగొల్తువంట సహజాఖిలదుర్గమువౌర! నీకథల్. 3]

చ. పునుకలపేర్లె? కాటినుసి పూఁతలె? యేనుఁగుతోలు చీరయే?
ననుచు మెఱుంగురాఁదలలనాగుఁజె పిన్నొలనూలె? యౌర! యా
యనుచితముల్ త్వదంగనిచయాదృతిఁ బావనశోభఁ జందిదీ
ప్తిని నిరసించి మించుటయె? దివ్యతరంబులు నీమహత్త్వముల్. 32

ఉ. మొదలేనూపములేదు లీలకయి సంభూతంబును న్వ్రాంతకా
స్పద మైనట్టిది యాఁడురూపుసగము న్నామునుఁ బుంస్త్వంబు కై
పొదువన్ లోకవిరుద్ధ మంగములసొమ్ముల్ వైపరీత్యంబుల
య్యుఁదమిన్ గొల్పెడిసారునీమహిమ మాకూహింపఁగా దాఁటెడిన్.

న. వసుధ జనించుభూతతతివైఖరి జన్మజరామృతుల్ వినున్
మునరవు సర్వలోకపరమూర్తివి, నీవలెనాఁగ, దీనిమే
ల్పన నని చెప్ప నూ తెలివి పార దనిర్వచనీయరూపివౌ
ట సగుణనిర్గుణైక్యములతావు భవత్కళ గాదె శంకరా! 34

చ. అనఘ! చరాచరంబులకు నంతకమూర్తివి నీవ, నీ కృపా
ఘనతనె సర్వలోకములుఁ గాంచు నిరంతరమంగళంబులన్
మునులకునైన హేతుఫలము న్నమయింపఁగ నీవ నేర్తు భూ
తనికరసూక్ష్మకారణపదా! సకలార్థవిదా! చిదాత్మకా! 35

మ. మును దైత్యు ల్దనుజు ల్సుర ల్నరులు నాపూర్తిం దిగ్లోకాధిక
త్యనిరూఢి న్బహుకాలముండుటలు భవ్యం బాశ్రితౌఘార్తివి
ర్ధానవప్రాభవము పావనంబును శరణ్యం బైననీపాదప
ద్మనమస్కారము కాదె కారణము? సంభావ్యానుభావప్రదా. 36

మత్తకోకిల. ప్రాణవాయుబలంబుచేత నెవండు సృష్టిధరించునో
రాణ వర్ణభవంబు లెవ్వనిప్రాభవత న్వెలసిల్లెనో
త్రాణశీలతఁ బాప బావనతర్పురుండగు నెవ్వఁడా
జాణ పావనమూర్తి విశ్వవిశాల! నీ కిదె మ్రొక్కెదన్. 37

చ. గెలుపిడి బ్రహ్మఁ జేర్చుకసఁ గీర్తిఁ దనర్చినయాగికాసనం
బుల సతతంబు నిన్ దలఁచుబుద్ధిమదగ్రణు లైననీదుభ
క్తులభవహేతుకర్మవనకోటుల నిష్ఠురదావకీలికీ
లల దహించుభాస్వదనలా! బహుళంబు లివే నమస్కృతుల్.

ఉ. చావు భయంబె మంటగ విశంకటవృత్తి జగత్ప్రసిద్ధమా
చేవ భవానలం బఖిలసృష్టి దహించుచునుండఁ బ్రాణిజీ
వావనశీలివై ఘనదయారసవర్షముఁ గూర్చి తేర్చుచీ
జావహజీవనప్రదజలాత్మక ! యంజలులన్ గ్రహింపవే. 39

శా. నేలల్ నీళులు నిప్పులు న్బవనము ల్నిద్దంపుగోళాప్తిచే
నే లెక్కింపునరానిపుట్టుకకుఁ దానే హేతువై శ్రేష్ఠమై
లీల న్సర్వము నావరించి పుటుక ల్లేకుంటలే కక్షిపా
ళీలక్ష్యంబుల దాఁటువ్యోమమయ కేళీరూప ! నీకే నతుల్. 4

చ. అణువులసూక్ష్మమై జగము లన్ని భరించెడిదేవ! వందనం,
బణఁగి సమస్తమందుఁ గన నందనిదూరతరా! నమస్సు, త
ద్గణపతివయ్యు నూహనుడిదాఁటునగమ్యుఁడ! ఱేఁడ! మ్రొక్కు, మా
రణగుణివయ్యు సంశ్రితపరా! వరదానరతా! నమస్కృతుల్. 41

మ. తెలియంజాలక తప్పుఁజేసితిని నాదే వ్రేల నాకన్నె పా
ద్బులలిన్ జ్ఞానపతీ! క్షమింపఁగదె; నిండున్ మోహ మూన న్విశృం
ఖలత న్వైరముఁ బూని పౌరుషములు చిక్కం గాళ్లబేరంబుసం
ధిల నిన్ జేరెడివారిఁ బ్రోచుటలు తండ్రీ! నీకుఁ గ్రొంగ్రొత్తలే!

ఉ. ఆస్తికసిద్ధధర్మమునకై మనసుం గొనిప్రోచుధర్మజున్
గస్తివడ న్నిరుల్ దులిపి కానలఁ ద్రోసిరి వైరు, లార్యధ
ర్మస్తబకాళిరూప! సమరస్థలి వారిని దేన గెల్తు మా
నిస్తులవైభవంబుఁ గరుణింపవె మ్రొక్కెద సారెసారెకున్. 43

మ. ప్రిణతి న్నిండు తెలుంగున న్మనవి నిందస్ఫూర్తి సల్పంగ ర
క్షణదాక్షిణ్యరసంబు నేత్రములు చిల్కన్ శంభుఁ డోదార్చి భీ
షణతేజోమయరౌద్రపాశుపతశస్త్రంబుం బ్రయోగాదివా
రణమంత్రాఢ్యముగా నొసంగె సుధతోరం బైనవాచాఝరిన్. 44

శా. పింగాక్షుండు త్రిలోకపూజ్యమహుఁడున్ భీమాంగుఁడున్ శోభనుం
డుం గైవల్యదుఁడుం ద్రయీద్యుతి నఖండుండౌ ధనుర్వేదుఁ డం
తం గారీశుఁ బ్రదక్షిణించి నరులోన న్సంక్రమించె న్నభో
రంగంబందు దివాకరుండు మొయిలుం బ్రాపించుచందంబునన్.

చ. పదపడి శంకరుం డనుప వాసవముఖ్యసుర ల్సమిజ్జయా
స్పదము లమోఘపూర్ణ ఫలవంతము లావిమలాశిషంబులుం
బాదల ననుగ్రహించిరి ప్రభూతదయ న్వివిధాస్త్రముల్ కిరీ
టి దరిసి మ్రొక్కి వారలకడిందివరంబుల స్వీకరింపఁగన్.　　46

మిగుఁలుతరస్సున న్గెలుచు మేలిమి నభ్యుదయాప్తి విఘ్నముల్
దెగిచన సర్వలోకముల తేటకు ఘోరధురాభరంబునై
పఁగలుగు పారలౌకికవిభాసహితోచ్ఛ్రపదంబునం దపో
ధిగతవికాసుఁడై విజయతిగ్మకరు న్సుర లెన్ని రెంతయున్.　　47

చ. 'బుడుతఁడ! వైరుల న్గెలుము పొ' మ్మని శూలి యనుజ్ఞనీయ సం
దడిఁ గొనుభక్తిఁ దచ్చరణదాస్యమొనర్చి సురల్ నుతింపఁ గే
ల్మోడ్చి సెలవొంది భూరిజయపోషకలక్ష్ములు చేరికొల్వఁ బా
ర్థుఁడు గృహమేగి యాదరముతో నతిఁ జేసెను ధర్మసూతికిన్.　　48

మంగళమహాశ్రీ

వాసి వెలయన్ విజయవాటికను శ్రీవిజయపర్వతముపైఁ గళలు వెల్గన్
భాసిలుశివా! విజయభవ్యకథ యుంకువగ భక్తిఁ గృతినిత్తు మదిపొంగన్
దోసములు వెన్నెలలతో దివిజగంగరుచితోడ నతిపూతములుగాఁగన్
జేసి దయ నీవిజయుఁ జేయుము కృతార్థునిగ శ్రీవరదమంగళమహాశ్రీ.

శ్రీసాంబసదాశివార్పణ మస్తు.



గుంటూరు, చంద్రికాముద్రాశాలయందు, ముద్రింపఁబడినది.

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 8 | 40 | 3 | వణకుచు | వణఁకుచు |
| 15 | 38 | 4 | న్యాయవృత్తి | న్యాయ్యవృత్తి |
| 17 | 54 | 2 | త్వర | ద్వర |
| 20 | 16 | 2 | ప్రజలు | ప్రజల |
| 27 | 54/2 | 10 | గాక | గాఁక |
| 29 | 5 | 3 | ననటున | న్నటున |
| | 11 | 2 | దెసలఁ | దెసలుఁ |
| 46 | 30 | 4 | నుడుల | నుడులు |
| 49 | 1 | 1 | అదిగో? | అదిగో! |
| 55 | 3 | 4 | నుత్కంఠల్ | నుత్కంఠల్ |
| 56 | 12 | 2 | గొల్పఁబతుల | గొమ్మనఁబతి |
| 58 | 22 | 3 | సురకైపు | సురఁగైపు |
| 61 | 41 | 2 | కాక | కాఁక |
| 62 | 49 | 4 | నయమె | నయము |
| 68 | 34 | 4 | తమిల్ | దమిల్ |
| 69 | 41 | 2 | స్వేదకణముల్ | స్వేదకణముల్ |
| 70 | 47 | 4 | నితంబముల్ | నితంబముల్ |
| 71 | 54 | 4 | సేఁతనో | సేఁతయో ! |
| 72 | 61 | 3 | మధ్య | మద్య |
| 80 | 35 | 1 | యటి | యట్టి |
| 89 | 30 | 2 | న్యాయా | న్యాయ్యా |
| 95 | 77–78 | 2 | స్చ | స్వ |
| 102 | 41,42,43. | 9 | సెగలుపొగ | పొగలుసెగ |
| 106 | 10 | 4 | లాహాకార | రాహాకార |
| 120 | 39 | 4 | జొరదాని | జొరరాని |
| 128 | 20 | 2 | న్భగింపరో | న్భంగింపగ్రో |